# ఆంధ్రప్రదేశ్

మార్చి, 1958.

సంపుటి 2 — సంచిక 5

ఫాల్గుణం, శాలివాహనశకము - 1879

## విషయసూచిక



— చందా వివరాలు —

సంవత్సరానికి రూ. 1-8-0 లేక 1 రూపాయి 50 నయాపైసలు

విడిప్రతి 2 అణాలు లేక 12 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి
సిటిజన్‌ప్రెస్‌లో ముద్రింపబడినది.



# ముఖచిత్రం

26-2-58 న ఆంధ్రప్రదేశ్ శాసన సభలో బడ్జెట్టును సమర్పిస్తూ ఆర్థిక శాఖామాత్యులు డా. బి. గోపాలరెడ్డి ప్రసంగిస్తున్న దృశ్యం.

# రాజధానీ నగరానికి నీటి సరఫరా

శ్రీ ఆర్. జి. బోర్గాంకర్

( హైదరాబాదు నీటి సరఫరా శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు )

నీటి సరఫరా పనులు అంటే ప్రస్తుతం ఆమాటకి గల భావాన్నిబట్టి రక్షిత నీటిసరఫరా సిస్టం అని సాధారణంగా అర్థం చేసుకుంటాం. ఈ సిస్టంక్రింద నీరు శుభ్రం చేయబడి, గొట్టాలద్వారా పంపిణీ చేయబడుతుంది. కాని, యీ పదానికి స్థూలమైన అర్థం తీసుకుంటే, కుతుబ్ సాహి పరిపాలనా కాలంలో హైదరాబాదు నగరం నిర్మాణమాది దాని నీటిసరఫరా చరిత్రను ముఖ్యంగా రెండుకాలాలుగా విభజించ వచ్చును. మొదటిది, సక్రమమైన రక్షిత నీటిసరఫరాను ప్రవేశ పెట్టకముందు కాలం, రెండవది, అది ప్రవేశ పెట్టిన తరువాతది. ఈ రెండు కాలాలనుకూడా మళ్ళీ విభజించి దిగువ వేర్వేరు దశలుగా యేర్పాటు చేయవచ్చును.



లొగ్గుల్ కుంట నీటి సరఫరా పనులు-పంపింగ్ స్టేషన్.

### అరక్షిత నీటి సరఫరా కాలం

1. ఐసీనది బద్వైలీ అనకట్ట నుంచి ముడి నీటి సరఫరా.
2. మీర్ ఆలమ్ చెరువునుంచి ముడి నీటిసరఫరా.

### రక్షితనీటి సరఫరా

1. హైదరాబాదు నీటి సరఫరా పనుల యేర్పాటు. మీర్ ఆలం చెరువు, హుస్సేన్ సాగర్ లనుంచి నీటినిసరఫరా చేయడానికై వరుసగా సిటీ, చాదర్ ఘాట్ నీటిసరఫరా పనుల నిర్మాణం. (తరువాత వీటికి హైదాబ్రాదు పాత నీటి సరఫరా పనులు అన్న పేరువచ్చింది).

2. ఉస్మాన్‌సాగర్, హిమాయత్ సాగర్ చెరువులు రెండిటినుంచి నీటిని సరఫరా చేయడానికి అవకాశం యిచ్చే పునర్నిర్మాణ పథకం. వాయిదాలలో చేపట్టబడిన యీపని యిప్పుడు జరుగుతున్నది. దీనిలో సగంకంటే యెక్కువ పని పూర్తయింది.

## మీర్ఆలం చెరువునుంచి మంచినీటి సరఫరా

అప్పటి హైదరాబాదు ప్రధానమంత్రి నవాబ్ మీర్ఆలం 1802-1806 మధ్య మీర్ఆలం చెరువును నిర్మించారు. హైదరాబాదు నగరానికి నీటిసరఫరాకి అదే ప్రారంభం. అప్పుడు పాతనగరంలో మంచి నీటికి చాలా కొరతగా వున్నందున, ఆ కొరతను తీర్చడానికై దీనిని ఆయన నిర్మించారు.

## మీర్ఆలం చెరువు

ఈ చెరువు హైదరాబాదుకి యించుమించు 5 మైళ్ళ దూరంలో నైఋతి దిశలో వున్నది. ఈ చెరువుని నింపడానికై ఐసీనదికి కొత్వాలగూడా (కొంచెం యెక్కువతక్కువలో ప్రస్తుతం హిమాయత్ సాగర్ వున్న స్థలంలో) సమీపంలో ఒక ఆనకట్ట నిర్మించ బడింది. దీనికి రూ. 60,000/- వ్యయమైంది. అక్కడినుంచి యించుమించు 6 మైళ్ళ పొడుగుగల మట్టికాలువ యీ చెరువుకి నీరు అందించేది. దీనికి ఇర్సలగుండి కాలవఅని పేరు.

మీర్ఆలం ఆనకట్ట ప్రపంచంలో బహు సంఖ్యాకమైన ఆర్చీలతో నిర్మించబడిన ఆనకట్టలలో మొదటిది. దానికి 21 అర్ధచంద్రాకారమైన అడ్డ ఆర్చీలు వున్నాయి. ఇవి రాతిచిమ్ముపై నిర్మితమైన స్తంభాలు లేక అండగోడలపై నిల్చి వున్నాయి. గ్రావిటీ రకం మామూలు ఆనకట్టల విషయంలో నీటి ఒత్తిడిని కట్టడం బరువే తట్టుకోవాలి. కాని యిక్కడ అలాకాక నీటిఒత్తిడిని యీ ఆర్చీలు, అండగోడలు కలిసి తట్టుకుంటాయి. మొత్తం ఆనకట్టే ఒక ఆర్చి. అర్ధచంద్రాకార ఆర్చీల మధ్య పొడవులు 70-147 అడుగుల మధ్య వుంటాయి.

ముఖ్యాంశాలు దిగువ యివ్వబడినవి:—

| | |
|---|---|
| అరగాణి (స్వంతం), | 5 3/4 చ. మైళ్ళు |
| ఆనకట్ట పొడుగు | 3,360 అ. |
| ఎత్తు | 40 అ. |
| ఆనకట్ట అగ్రభాగం | ఆర్.ఎల్. 1700.00 |
| తూము సిల్ | ఆర్.ఎల్. 1680.00 |
| ఎమ్. డబ్లుయు. ఎల్. వద్ద నీటివ్యాప్తి | 0.62 చ. మైళ్లు |

ఈ ఆనకట్ట నిర్మాణానికి లక్ష రూపాయలు వ్యయమయాయి. ఈ ఆనకట్ట మద్రాస్ ఇంజనీర్ల కోర్‌నుంచి వచ్చిన ఆంగ్లేయుడు మిస్టర్ హెన్రీ రస్సెల్ అజమాయిషీకింద నిర్మితమయింది. ఆయన అప్పుడు రెసిడెన్సీ భవనాల ఇంజనీర్ యిన్‌ఛార్జిగా కూడా వుండేవారు.

మీర్ఆలం చెరువు నిర్మించబడిన తరువాత అంతకుముందున్న తీవ్రమైన నీటికొరతతీరి నగరానికి పుష్కలంగా నీరు లభించేది.

## మీర్ఆలం చెరువునుంచి పాతనగరానికి పంపిణీ ఏర్పాట్లు

ఈ చెరువునుంచి నగరానికి నీరు సరఫరా చేయడానికై కాలవలు నిర్మించ బడినవి. ఇవి కొంత దూరం అనాచ్ఛాదితంగాను, కొంతదూరం ఆచ్ఛాదితమయీ ప్రవహించేవి. నీరు వీటిలోనుంచి రోడ్డు మట్టానికి దిగువనగల మట్టి గొట్టాలలోకి, అక్కడినుంచి వేర్వేరు నీటి తొట్లలోకి ప్రవహించేది.

మీర్ ఆలం చెరువునుంచి అనాచ్ఛాదితమైన కాలవలు రెండు ప్రవహించేవి. ఒక్కొక్కదాని కొలత 3′ × 2′. 'పేట' కాలవఅని వ్యవహరింపబడే యెగువ కాలవ చెరువు ఈశాన్యదిశ కొసనుంచి ప్రారంభమయేది. 'టబ్' కాలవఅని వ్యవహరింపబడే దిగువ కాలవ తూర్పువైపున మొదటి ఆర్చీవద్దనుంచి బయలుదేరేది. అవిరెండూ టార్బన్‌ద్వారా ప్రవహించి అక్కడనుంచి ఒకదానికొకటి, కొంచెం యెక్కువ తక్కువలో సమానాంతరంగా ప్రవహిం

చేవి. అయితే వాటి గర్భాల మట్టంలో యించుమించు 4-5 అ. వ్యత్యాస ముండేది. అవి అలా ప్రవహించి మిస్రిగంజ్ సమీపంలో కజానా అని వ్యవహరింపబడే తొట్టిని చేరేవి. ఇక్కడ వాటి మార్గాలు కలిసేవి. ఇంకా అలా బయలుదేరి ఒక దానిపై ఒకటి ప్రవహిస్తూ సిటీ వాల్‌గుండా 'జోరాహూజ్' తొట్టిని చేరేవి. ఇక్కడ వాటి మట్టంలో యించుమించు 3½ అ. వ్యత్యాసముండేది.

మిస్రిగంజ్‌వద్ద యెగువ కాలవనుంచి ఒక పిల్ల కాలవ బయలుదేరి వుత్తరంగా సిటీ వాల్‌గుండా ఫతేదర్వాజా, దూద్‌బౌలి దర్వాజాల మధ్యనుంచి ప్రవహించి నవాబ్ సర్‌సాలార్ జంగ్, మరి కొందరు వున్నత వంశస్థుల ప్రాసాదాలకి నీటిని అందించేది.

జోరా కేంద్రంలో 48' చతురంగల పెద్ద పెద్ద జలాశయాలు రెండు వుండేవి. అవి యిటుక, సున్నంతో నిర్మితమయినవి.

జోరాహూజ్‌నుంచి బయలు దేరిన కాలవ నగరం గుండా ప్రవహించి పురాణా హవేలీ జలాశయంలో కలిసేది. ఇక్కడినుంచి గనరంలోని పల్లం ప్రదేశాలకి రోడ్డు మట్టానికి దిగువనకల మట్టి గొట్టాల ద్వారా నీరు సరఫరా చేయబడేది.

కాలం గడిచినకొద్దీ, ప్రజారోగ్యం దృష్ట్యా యీ పద్ధతి తృప్తి కరంగా లేదని కనుగొన బడింది. పారిశుద్ధ్య ప్రమాణాలు బాగా మారిపోయాయి. వాటిని సడిలించ డానికి వీలులేదు. 1888 లో అప్పటి పబ్లిక్‌వర్క్సు శాఖ చీఫ్ ఇంజనీరు మిస్టర్ పామర్ నగర నీటి సరఫరా పథకంపై ప్రభుత్వానికి నివేదికను సమర్పిస్తూ యీ కాలవని "యించుమించు అనాచ్ఛాదితమైన మురుగునీటి కాలువ" గా అభివర్ణించారు. ఎందుచేత నంటే, నీరు అనాచ్ఛాదితమైన కాలువలో ప్రవహించే టప్పుడు దానిలో కల్మషాలు చేరేవి. ఆరోగ్యానికి భంగ కరమైన అనేక పదార్థాలు కూడా చేరేవి.



*బాగుల్‌కుంట నీటి సరఫరా పనులు-నీటిలో కోరిన్ కలిపే దృశ్యం.*

## హైదరాబాదు నీటి సరఫరా పనుల నిర్మాణం, రక్షిత నీటి సరఫరా

1889 లో హైదరాబాదు నీటి సరఫరా పనుల శాఖ యేర్పాటు అయింది. 1894-1899 మధ్య రక్షిత నీటి సరఫరాకై స్వతంత్రమైన రెండు విడి పథకాలు అమలుపరచ బడినవి. (1) నగర నీటి సరఫరా పనులు. ఇవి మీర్ ఆలం చెరువునుంచి వడ పోసిన నీటిని అసలు 'నగరానికి' అనగా మూసీనదికి దక్షిణానగల ప్రాంతానికి సరఫరా చేసేవి. (2) చాదర్ ఘాట్ నీటి సరఫరా పనులు. ఇవి హుస్సేన్ సాగర్ నుంచి వడపోసిన నీటిని 'చాదర్ ఘాట్' పల్లపు ప్రాంతాలకి అనగా మూసీనదికి వుత్తరాన గల ప్రాంతానికి సరఫరా చేసేవి.

### నగర నీటి సరఫరా పనులు

పైన పేర్కొన్నట్టుగా అప్పటి పబ్లిక్ వర్క్సు శాఖ చీఫ్ ఇంజనీరు మిస్టర్ పామర్ 1888 లో యీ పథకాన్ని సమర్పించారు. పాత పద్ధతిలోలా అనాచ్ఛాదితమైన కాలవలద్వారా కాక యినప గొట్టాలద్వారా వడపోసిన నీటిని సరఫరా చేయాలని ఆయన నొక్కి వక్కాణించారు. ప్రభుత్వం యీ పథకాన్ని 1894 లో ఆమోదించింది. ఆ తరువాత తక్షణం పని ప్రారంభ మయింది. ఈ పథకం క్రింద మీర్ ఆలం వద్ద ఒకబహిర్గ మనద్వారం, స్క్రీనింగు టవరు నిర్మించ బడినవి. ఇక్కడనుంచి నీరు చెరువుకి మిక్కిలి సమీపంలో గల వడపోత ప్రదేశానికి, 22″ ప్రధాన బహిర్గ మనద్వారం గుండా ప్రవహించేది. ఇక్కడ ఒక్కొక్కటి 121′-6″ × 50′-6″ కొలతలు గల 6 వడపోత (ఫిల్టర్) బెడ్స్ వుండేవి. స్లోసాండు రకానికి చెందిన అవి రోజుకి యించుమించు 1.5 లక్షల మందికి యించుమించు 12.2 లక్షల గేలన్ల నీటిని సరఫరా చేయడానికి వీలుగా యేర్పాటు చేయ బడినవి. దీని ప్రకారం రోజుకి తలకి 8 గేలన్లు మాత్రమే లభిస్తాయి ప్రస్తుతపు అవసరాలతో పోల్చినప్పుడు యిది చాలా తక్కువ.

వడపోత అయిన తరువాత 22″ వ్యాసం, 5,754 అ. పొడుగుగల ప్రధాన గొట్టంద్వారా నీరు మిస్రిగంజ్ కి సమీపాన గల సర్వీసు జలాశయానికి చేరేది. ఈ జలాశయం యించుమించు 40½ లక్షల గేలన్ల నీరు పట్టేవి.

ఈ జలాశయం పూర్తిగా నిర్మితమైన పిమ్మట దానిలో నాలుగు గదులున్నాయి యెగువ గదులని వ్యవహరింప బడ్డ 2 గదుల కొలతలు 132′ × 64½′. ఆ తరువాత నిర్మితమైన రెండు గదుల కొలతలు 208′ × 132′. ఇవి దిగువగదులని వ్యవహరింప బడేవి. ఈ రెండు రకాల ఎఫ్. ఎస్. ఎల్. లోతు కూడా 10′ వాటి సిల్ మట్టాలు ఒకటే. అయితే యెగువ గదులలో నీరు, కొంచెం మెరక ప్రదేశాలకి సరఫరా చేయడానికై యెగువ మట్టాన్ని నిలవ చేయబడేది. దిగువ గదులు ఆసిస్టం క్రింది మిగిలిన ప్రదేశాలకి నీటిని సరఫరా చేసేవి. ప్రతి గదికి నీరు వచ్చే పోయే మార్గాలు విడివిడిగా వుండేవి. వాటన్నిటిలోకి నీరు ఒకేటక చాంబర్ లోనుంచి వదల బడేది.

పెద్ద గదులు రెండింటికి 20″ ప్రధాన బహిర్గ మనద్వారం, చిన్నలేక యెగువ గదులకి 12″ బహిర్గ మనద్వారం వుండేవి. దిగువ రెండు గదుల నుంచి యేర్పడిన పంపిణీ సిస్టం క్రింద నగరంలోని పల్లం ప్రాంతాలన్నిటికి పూర్తిగాను, చాదర్ ఘాట్ లో నదికి ప్రక్కనేవున్న కర్వాన్ వంటి కొన్ని పల్లపు ప్రదేశాలకి కూడా నీరు సరఫరా అయేవి.

పంపిణీ సిస్టం క్రింద యించుమించు 3 చ. మైళ్ల ప్రదేశం వుండేది.

నగర నీటి సరఫరా పనుల పథకం మొత్తం ఖర్చు రూ. 12,59,000/-.

షహాలీబండ, అలియాబాద్ దర్వాజాకి పైన గల ప్రదేశాలవంటి మెరక ప్రాంతాలకి నీటిని సరఫరా చేయడానికై మిస్టర్ పామర్ ఒక పంపింగు జోన్ యేర్పాటును సూచించారు. కాని 1888 లో సమర్పితమైన ఆయన పథకం 1894 లో మంజూర య్యేలోగా, నవాబ్ సర్ అస్మాన్ జా బహద్దూర్

ఒకపంపు మార్గాన్ని నిర్మించారు. ఈ ప్రాంతాలకి నీరు అందించడానికై దీనికి వుమ్‌దాసాగర్ నుంచి నీరు లభించేది. ఈ పనిని ఆయన ధర్మకార్యంగా జరిపించారు. అయితే యీ నీరు వడపోయ బడేది కాదు.

ఉస్మాన్‌సాగర్‌నుంచి కొత్త నీటి సరఫరా పథకం (దీనినిగురించి తరువాత వివరింప బడుతుంది) ప్రారంభమయ్యేక మీర్ ఆలం ఒడపోత సాధనాలు పని చేయడం మానేశాయి. మిస్రిగంజ్ జలాశయాన్ని వుస్మాన్‌సాగర్ సిస్టం నుంచి నింపడం ఆరంభ మయింది. ఆ తరువాత స్వల్ప కాలానికే ముఖ్యంగా వేసవిలో నగరానికి యింకా యెక్కువ నీరు కావలసివచ్చింది. కాబట్టి వున్న నీటికి మరికొంత నీటినిచేర్చి సరఫరా చేయడానికై మీర్ ఆలం ఒడపోత సాధనాలతో తిరిగి పని ప్రారంభించబడింది. తరువాత వీటిని సంవత్సరం పొడుగునా నడపవలసి వచ్చింది. ఇప్పటికీ అవి అలాగే పని చేస్తున్నాయి.

## చాదర్‌ఘాట్ నీటి సరఫరా పనులు

1899 లో పూర్తయిన యీ పథకం క్రింద చాదర్‌ఘాట్ పల్లపు ప్రదేశాలకి నీరు లభించేది. దీనికి నీరు హుస్సేన్‌సాగర్ నుంచి లభించేది. హుస్సేన్‌సాగర్‌కి 95 చ. మైళ్ల స్వతంత్రమైన ఆరగాణి వున్నది. దీనికి నీరు కల్వలాయిర్ వాగు నుంచి లభిస్తుంది. ఇదిగాక దీనికి నీరు బల్కాపూర్ కాలవనుంచికూడా లభిస్తుంది. ఈ కాలవ మూసీనది బల్కాపూర్ ఆనకట్ట నుంచి ప్రవహిస్తుంది.

నీటి సరఫరాకై రెండు తూములున్నాయి మొదటిది మైసమ్మ తూము. ఇక్కడి నుంచి చాదర్‌ఘాటు నీటి సరఫరా పనులకై నీరు తీసుకో బడేది. రెండవది, నాంపల్లి తూము. ఇది రెసిడెన్సీకి నీటిని అందించేది.

మైసమ్మతూము నుంచి 7,210 అ. పొడవుగల 18″ ట్రంక్ మెయిన్‌ద్వారా నీరు నారాయణ గూడాలో వున్న నాలుగు స్లోసాండ్ ఫిల్టర్లకి వెళ్లేది. (మరొక 4 ఫిల్టర్లు 1911 లో చేర్చబడినవి.) ఒక్కొక్క దాని కొలత 90′ × 30½′. ఇక్కడి నుంచి నీరు 12″ ట్రంక్‌మెయిన్‌ద్వారా లోగ్గల్ కుంట సర్వీసు జలాశయానికి వెళ్లేది. ఈ జలాశయం యించుమించు 11.39 లక్షల గేలన్ల నీటిని నిలవ చేసేది.

ఈ జలాశయం నుంచి ప్రధానమైన రెండు పంపిణీ గొట్టాలు బయలుదేరేవి. 12″ ప్రారంభ వ్యాసం గల మొదటిది ట్రూప్ బజారులో కొంత భాగానికి, పాత వంతెన వరకూ ఉస్మాన్‌గంజ్, బేగంబజారు వగైరా ప్రాంతాలకి నీటిని సరఫరా చేసేది. 10″ వ్యాసంగల రెండవది ట్రూపుబజారులో మిగిలిన భాగానికీ, అఫ్‌జుల్ గంజ్, కొత్తవంతెన వరకూ గల ప్రాంతాలకి సరఫరా చేసేది.

ఫిల్టర్లనుంచి 6″ ప్రధానవాహిక ఒకటి విడిగా నారాయణగూడాలోని పంపింగు స్టేషన్‌కి వేయ బడింది. ఇక్కడి నుంచి నీరు కొత్త బస్తీ జలాశయానికి పంపుచేయబడి, గన్‌ఫౌండ్రీ చుట్టూగల మెరక ప్రదేశాలకి అందించబడేది. ఈ 6″ ప్రధానవాహిక నుంచి బయలుదేరిన చిన్న శాఖ ఒకటి పాతనిజాం కళాశాల సమీపానగల కొండగుట్టమీద గల కింగ్ కోఠి జలాశయాన్ని నింపేది.

రెసిడెన్సీ ప్రాంతం సరఫరాకై నీరు, హుస్సేన్ సాగర్ చెరువు నాంపల్లితూము నుంచి బయలుదేరిన 15″ ప్రధానవాహికద్వారా నారాయణగూడాలోని రెసిడెన్సీ నీటి సరఫరా పనుల 6 వడపోత బెడ్స్‌కితేబడేది. ఈ బెడ్సు ఆచ్ఛాదితమైనవి. వీటిలో ఒక్కొక్కదాని కొలత 52′ × 14′. వీటి ప్రక్కనే ఒక సర్వీసు జలాశయం వుండేది. దీనిలో ఒక్కొక్కటి 54′ × 60′ × 8′ గల గదులు రెండు వుండేవి. వీటి నిలవశక్తి 3.34 లక్షల గేలన్లు. ఇక్కడి నుంచి బయలుదేరిన 12″ పంపిణీ ప్రధానవాహిక రెసిడెన్సీ ప్రాంతానికి నీటిని అందించేది.

ఈ రెండు కలిసి చాదర్‌ఘాట్‌లో యించుమించు 80,000 మందికి, సగటున తలకి 12½ గేలన్ల చొప్పున నీటిని సరఫరా చేసేవి.

చాదర్‌ఘాట్ నీటి సరఫరా పనుల ఖర్చు రూ. 9,55,000.

కొత్తనీటి సరఫరా పనులు పూర్తయిన తరువాత నారాయణగూడా ఫిల్టర్లు పనిచేయడం మానేశాయి,

అవితప్ప, చాదర్ ఘాట్ నీటి సరఫరా సిస్టం యితర భాగాలు ఉస్మాన్ సాగర్ సిస్టంతో కలుపబడి నేటి కీపని చేస్తున్నాయి. కొత్తనీటి సరఫరా పథకం ప్రారంభంతో రెసిడెన్సీ ఫిల్టర్లుకూడా పని మాని వేశాయి. రెసిడెన్సీ ప్రాంతం యిప్పుడు వుస్మాన్ సాగర్ సిస్టం పంపిణీ మండలాలలో ఒక భాగంగా వున్నది.

నగర నీటి సరఫరా, చాదర్ ఘాట్ నీటి సరఫరా పథకాలు పూర్తి కావడంతో హైదరాబాదు నగరం లో చాలాభాగానికి ఒడపోసిన నీరు లభ్యమయ్యేది. కాని అప్పటికీ అసలే సరఫరా కానివి, ఒడపోయని నీరు సరఫరా అయేవి యింకా యెన్నో ప్రాంతాలు వుండేవి. 'నగరం'లో అలియాబాదు దర్వాజాకి ఆవలనున్న షహాలిబండ, తదితరమైన ప్రాంతాలు వుమ్దాసాగర్ నుంచి లభించే అనారోగ్య కరమైన ముడి నీటిపై ఆధారపడి వుండేవి. "చాదర్ ఘాట్" భాగంలో సైఫాబాదు, ఖైరతాబాదు, ముషీరాబాదుల వంటి అనేకమైన ముఖ్యప్రదేశాలకి అసలు నీరే సరఫరా కాక బావులపై ఆధార పడ వలసి వచ్చేది. ఈ రెండు పథకాల క్రింది ప్రాంతాలకి లభించే తలసరి సరఫరా కూడా తక్కువగా వుండేది. కాబట్టి నీరు యింకా యెక్కువగా సరఫరా చేయ బడాలని, నీటి సరఫరా అసలు లేని ప్రాంతాలకి కూడా అది విస్తరింప చేయబడాలని కోరడం జరిగేది. అప్పుడు హైదరాబాదుకి హుస్సేన్‌సాగర్, జీడుమట్ల చెరువులనుంచి విడిగా ముడినీరు సరఫరా అవుతూ వుండేది.

కొన్ని సంవత్సరాల క్రితం హైదరాబాదు నగరంలో ఒక మహాప్రమాదం సంభవించింది. దాని వల్ల యెంతో ప్రాణాసి నష్టం కలిగింది. అయితే అది పరోక్షంగా నీటి సరఫరా అభివృద్ధికి తోడ్పడి ది. 1908 లో మూసీనదికి వచ్చిన విపరీతమైన వరదలే ఆ మహా ప్రమాదం.

## హైదరాబాదు కొత్తనీటి సరఫరా పథకాలు

1908 సెప్టెంబరు 28 వ. తేదీన హైదరాబాదు నగరం విపరీతమైన వరదలకి గురైంది. ఇందువల్ల అపారమైన నష్టం కలిగింది. భవిష్యత్తులో అటువంటి ప్రమాదాలను అరికట్ట డానికై ప్రముఖ ఇంజనీరు శ్రీ ఎమ్. విశ్వేశ్వరయ్య సలహాపై ప్రభుత్వం రెండు ఆనకట్టల్ని, మూసీ, ఈసీ నదులపై అనగా వుస్మాన్‌సాగర్, హిమాయత్‌సాగర్ ఆనకట్టల్ని నిర్మించడానికి నిశ్చయించింది.

ఆ ప్రకారం 1912 లో వుస్మాన్‌సాగర్ ఆనకట్ట నిర్మాణం చేపట్ట బడింది. ఇది పుష్కలంగా నీరు నిలవచేయ బోతున్నది. ఆపైన నగరంకంటె తగినంత యెత్తున వున్నది. అప్పుడు మంచినీటికి కొరతగా కూడా వున్నది. కాబట్టి దీనిని మంచినీటి సరఫరా వనరుగా వుపయోగించు కోవాలనే ఆలోచన సహజంగా కలిగింది. వరద నివారణకై అధిక ధనవ్యయంతో ప్రభుత్వం నిర్మించే యీ ఆనకట్ట వూరికే పడివుండేకంటె, దానిని నీటి సరఫరాకి వినియోగించుకుని, తద్వారా దానినుంచి మరొక లాభాన్ని పొందవచ్చునని ఆలోచించ బడింది. ఆ ప్రకారం, నిర్మాణం జరుగుతుండగా మొత్తం నిలవలో యించుమించు 30 అడుగులు నీటి సరఫరాకి, మిగిలినది వరద నివారణకి కేటాయింప బడింది.

## ఉస్మాన్‌సాగర్ ఆనకట్ట

ఈ ఆనకట్ట 1912-1920 మధ్య ఆ. సి. రూ. 54 లక్షల వ్యయంపై, వరద నివారణ పనుల ప్రత్యేక సూపరింటెండింగు ఇంజనీరు మిస్టర్ దలాల్ ఆధిపత్యంక్రింద నిర్మించ బడింది.

ఈ సరస్సు అరగాణి విస్తీర్ణం 285 చ. మైళ్లు ఆనకట్ట పొడుగు 6,300 అ. యెత్తు 118 అ. సరఫరా తూము సిల్ ఆర్. ఎల్. 1757. శాశ్వత నిలవమట్టం ఆర్. ఎల్ 1787. ఎఫ్. టి. ఎల్., ఎమ్. డబ్లుయు. ఎల్. లు వరుసగా 1805, 1810. ఎఫ్. టి. ఎల్. వద్ద మొత్తం నిలవశక్తి 107680 లక్షల ఘ అ. మట్టం 1787 యొక్క శాశ్వత నిలవమట్టం నిలవశక్తి 47010 లక్షల ఘ. అ. కాబట్టి వరద నివారణశక్తి 6,0670 లక్షల ఘ. అ. ఎమ్. డబ్ల్యు. ఎల్. వద్ద నీటి వ్యాప్తి విస్తీర్ణం 14.0 చ. మైళ్లు. మిగులు పనులు (ఆర్. ఎల్. 1810 వద్దవి) బయటికి పంపగల మొత్తం నీరు 92,100 క్యూ సెక్కులు.

### హిమాయత్‌సాగర్ ఆనకట్ట

ఇది 1920-27 మధ్య మిస్టర్ దలాల్ ఆధిపత్యం క్రిందనే నిర్మిత మయింది. దీనికి రూ. 93 లక్షలు వ్యయమైనవి. ఆరగాణి విస్తీర్ణం 505 చ. మైళ్లు. ఇది కాంపోజిట్ ఆనకట్ట. దీని పొడుగు 7,400 అ. గరిష్ఠ యెత్తు 111 అ. సరఫరా తూము సిల్ ఆర్. ఎల్. 1733 వద్ద వున్నది. శాశ్వత నిలవ మట్టం ఆర్. ఎల్. 1762. ఇక్కడ నిలవశక్తి 46600 లక్షల ఘ. అ. ఎఫ్. టి. ఎల్., ఆర్. ఎల్. 1774 వద్ద వున్నది. దీని నిలవశక్తి 66920 లక్షల ఘ. అ. ఈ విధంగా వరద నివారణ శక్తి 32320 లక్షల ఘ. అ. ఎమ్. డబ్ల్యు. ఎల్., ఆర్. ఎల్. 1781 వద్ద వున్నది. నీటి వ్యాప్తి విస్తీర్ణం 12 చ. మైళ్లు. ఆర్. ఎల్. 1781 వద్ద మిగులు పనుల మొత్తం శక్తి 2,35,370 క్యూ సెక్కులు.

### కొత్తనీటి సరఫరా పథకం

పైన పేర్కొన్నట్టుగా ఉస్మాన్‌సాగర్ ప్రాజెక్టునిర్మాణాన్ని చేపట్టిన స్వల్పకాలానికే ప్రభుత్వం "హైదరాబాదు కొత్తనీటి సరఫరా పనుల పథకం" అని వ్యవహరించబడే ఒక సమగ్ర పథకాన్ని నిర్వహించడానికి నిశ్చయించింది. ఇందుకు నీరు పాత వనర్లు మీర్ ఆలం చెరువు, హుస్సేన్‌సాగర్‌లనుంచి కాక వుస్మాన్‌సాగర్ నుంచి తీసుకో తలపెట్టబడింది.

పూర్తయేసరికి అప్పటి ధరలప్రకారం యించుమించు రూ. 88 లక్షలు వ్యయమయే (ఇప్పుడయితే దీనికి రూ. 2 కోట్లకి పైన ఖర్చయి వుండును) యీ పథకం తయారీలో ప్రభుత్వ పబ్లిక్ వర్క్సు శాఖ తీసుకున్న శ్రద్ధ గమనార్హమైనది.

1913 లో యీ పథకం తయారీలో తమకి సలహా యివ్వడానికై మద్రాసు ప్రభుత్వంలోవున్న నీటి సరఫరా నిపుణుడు మిస్టర్ హట్టన్‌ని వారు రప్పించుకున్నారు. ఆయన హైదరాబాదును సందర్శించి, తమ నివేదికను సమర్పించారు. దానిలో ఆయన ప్రతిపాదించిన పథకం స్థూలంగా వివరింపబడింది.

1914 లో ప్రభుత్వం మిస్టర్ హెచ్. ఎ. ఇర్విన్, ఎఫ్. ఐ. ఎస్. ఇ., ని ప్రత్యేకంగా "హైదాబాదు కొత్త నీటి పంపిణీ పథకం ఇంజనీరు" గా నియమించింది. పూర్తి పరిశోధనలు జరిపినమీదట ఆయన రూ. 57.85 లక్షల అంచనాపై విపులమైన ఒక పథకాన్ని ప్రభుత్వానికి సమర్పించారు.

ప్రభుత్వం యీ పథకాన్ని 1915 డిసెంబరులో ఆ. సి. రూ. 60 లక్షల వ్యయంతో మంజూరుచేసింది. ప్రథమ ప్రపంచ సంగ్రామం అప్పటికే ఆరంభమయినందున, అందువల్ల గొట్టాలు మున్నగువాటి ధర హెచ్చుగలదని యిలా అసలు అంచనాకంటే యెక్కువసొమ్ము మంజూరు చేయబడింది.

ఈ లోపున ప్రభుత్వం మిస్టర్ ఇర్విన్ తయారు చేసిన పథకంపై తన అభిప్రాయాన్నిమ్మని కేంద్ర ప్రభుత్వపు శానిటరీ కమిషనరు మిస్టర్ డబ్ల్యు. డబ్ల్యు, క్లెమిషా, ఐ. ఎమ్. ఎస్. ని కోరింది. ఆయన హైద్రాబాదుకివచ్చి యీ పథకాన్ని పరిశీలించిన మీదట ఒక నివేదికను సమర్పించారు. దానిలో ఆయన ముఖ్యమైన రెండు విషయాలలో తప్ప మిగిలిన వాటిలో మొత్తంమీద మిస్టర్ ఇర్విన్ ప్రతిపాదనలతో యేకీభవించారు. కాలవచివరిని నీటి నిలవకై జలాశయాలు అవసరమని ఆయన భావించలేదు. ఆ పైన స్లో సాండు ఫిల్టర్ల స్థానే రాపిడ్ ఫిల్టర్లను ఆయన సిఫార్సుచేశారు.

ఉస్మాన్‌సాగర్ నుంచి అసఫ్‌నగర్‌లోని మెకానికల్ ఫిల్టర్ల వరకూ యించుమించు 9 మైళ్ల పొడుగుగల కాలవ నిర్మించబడింది, దీని వాహకశక్తి రోజుకి 200 $\frac{1}{4}$ లక్షల క్యూసెక్కులు. ఈనీరు 10 లక్షలమందికి తలకి 20 గేలన్ల వంతున పంపిణీ చేయడానికి సరిపోతుంది. ఈ ఫిల్టర్లు పాటర్సన్ రకానివి. ఇవి పట్టేనీటిని 5 లక్షలమందికి మనిషికి 20 గేలన్ల వంతున సరఫరాచేయవచ్చు. ఈ ఫిల్టర్ల నుంచి లకిడీకాపూల్‌కి సమీపానగల హాబీబునగర్ కూడలికి 9327 అ. పొడవుగల 33" ట్రంక్ మెయిన్ (తరువాత రెండవ దానిని వేసే యేర్పాటుతో) నిర్మించబడింది. ఇక్కడినుంచి 30"—26" శాఖ ఒకటి బషీరుబాగ్, సైఫాబాదు, లోయర్ టాంక్ బండ్ రోడ్డు ప్రక్కనుంచి వెళ్లి హుస్సేన్‌సాగర్ బండ్‌కి అవతల కొననున్న సికిందరాబాదు కంటోన్మెంటుకి మొత్తంగా సరఫరాచేసేది. ఇక్కడనుంచి

తన సరిహద్దులలోని ప్రదేశాలకి నీటిని పంపిణీచేసు కోడానికి కంటోన్మెంటే స్వయంగా ఏర్పాట్లుచేసు కుంది. ఈ ట్రంక్ మెయిన్ 30", 26" భాగాల పొడుగులు వరుసగా 6,900 అ., 6000 అ. చిలకల గూడాలోని కొత్త సర్వీసు జలాశయాన్ని, నింపడానికై సికిందరాబాదు కూడలి నుంచి 10" ట్రంక్ మెయిన్ (ఉద్దేశించిన 15" మెయిన్ స్థానంలో) ఒకటి నిర్మించబడింది. చాదర్ ఘాట్ నీటిసరఫరా పనుల 18" ట్రంక్ మెయిన్ 26" మెయిన్‌తో కలుపబడి, బొగ్గులకుంట జలాశయానికి, చాదర్ ఘాట్, రెసిడెన్సీ నీటిసరఫరా పనులక్రింది ప్రాంతాలకి నీటిని సరఫరాచేయడం ఆరంభించింది. హాబీబునగర్ కూడలినుంచి 36" వ్యాసంగల మరొక శాఖ బయలుదేరి, దక్షిణంగా వెళ్లి, రెడ్‌హిల్స్‌వద్దనున్న, కొత్త జలాశయానికి నీటిని అందించేది. ఈశాఖ పొడుగు 1627 అ. ఆతరువాత దీని పరిమాణం 30" కి తగ్గించబడింది. అది మంగళ్‌హాట్, పురానాపూల్‌ల మీదుగా 17978 అ. పొడుగున వెళ్లి, పూర్వపు నగర నీటిసరఫరా పనుల పాత మిస్రిగంజ్ జలాశయాన్ని నింపేది. మిస్రిగంజ్ కూడలినుంచి 5155 అ. పొడుగుగల 24" మెయిన్ ఒకటి బయలుదేరి అలియాబాదులోని కొత్త జలాశయానికి నీటిని అందించేది.

పైన పేర్కొన్నట్టుగా యీ పథకంక్రింద, రెడ్‌హిల్స్, చిలకలగూడా, అలియాబాదులలో 3 కొత్త జలాశయాలు నిర్మించబడినవి.

మెరక ప్రదేశాల సరఫరాకై రెండు పంపింగు స్టేషన్లు, ఒకటి రెడ్‌హిల్సువద్ద, రెండవది అలియాబాదు జలాశయం వద్ద నిర్మించ బడినవి. రెడ్‌హిల్స స్టేషన్ శక్తి 45 బ్రి హా. ప. ఇది రెడ్‌హిల్సు వద్ద నిర్మించ బడిన హెచ్. ఎల్. టవర్‌లోకి నీటిని, వుత్తరాన ఖైరతాబాదు, బేగంపేట ప్రాంతాలకి, తూర్పున గన్‌ఫౌండ్రికి సరఫరా చేయడానికై, తోడేది. అలియాబాదు స్టేషన్ శక్తి 60 హా. ప. ఇది అలియాబాదు దర్వాజా చుట్టూరాగల మెరక ప్రదేశాల నీటి సరఫరాకి వుద్దేశించ బడింది. ఈ మండలానికై ఒక మొత్తయిన వుక్కుటాంకు కొనబడింది. కాని నీరు పంపిణీ సిస్టంలోకి తోడబడ్డంచేత యిది స్థాపింప బడలేదు.

పంపిణీ సిస్టం 12 గంటలలో 20 గేలన్ల సరఫరాకై యేర్పాటు చేయబడింది. దీని మొత్తం పొడుగు 40.8 మైళ్లు వుండేది.

ఇదివరకే చెప్పినట్టు, కొత్తనీటి సరఫరా పథకం పూర్తయిన తరువాత చాదర్‌ఘాట్‌లోని నారాయణగూడా, రెసిడెన్సీ ఫిల్టర్లు, నగరంలోని మీర్ ఆలం స్లోసాండు ఫిల్టర్లు పని మానివేశాయి. మీర్ ఆలం చెరువు, ఇర్రులగుండి కాలవ సర్ సాలార్ జంగ్ యెస్టేటుకి చెందినవి. ఇవి వాడుకున్నందుకు గాను సాలీనా ఆ. సి. రూ. 9741/- చెల్లించబడేవి. అవి తిరిగి ఆ యెస్టేటుకి అప్పగించివేయబడ్డాయి, అయితే కొన్ని సంవత్సరాల అనంతరం, నగరంలో హెచ్చిన వాడకానికి సరిపడ నీటిని అసఫ్ నగర్ ఫిల్టర్లు సరఫరా చేయలేక పోయాయి. అందుచేత మీర్ ఆలం ఫిల్టర్లు, చెరువు మళ్లీపని ప్రారంభించ వలసి వచ్చింది. అవి నేటికీ వుపయోగింపబడుతున్నాయి.

కొత్తనీటి సరఫరా పథకం ప్రారంభంతో బావుల మీద ఆధారపడిన ప్రాంతాలకి, వడపోయని నీరు లభించే ప్రాంతాలకి కూడా వడపోసిన నీరు సరఫరా కావడం ప్రారంభించింది. మనిషికి సరఫరా 10 నుంచి 20 గేలన్లకి హెచ్చించ బడిందికూడా. కాని కొన్ని సంవత్సరాలలోనే నగరం, దానిశివార్లు శీఘ్రంగా విస్తరించాయి. చక్కని పౌర సౌకర్యాలు యేర్పడి, మొత్తంమీద జీవన ప్రమాణం హెచ్చింది. దానితో 1930 నాటికి ముఖ్యంగా నగర పొలిమేరల్లో నీటి వాడకం రోజుకి మనిషికి 30 గేలన్లకి మించిపోయింది. ఇంకా కొన్ని ప్రాంతాలు ముఖ్యంగా పొలిమేరల్లోని వాటికి నీరు సక్రమంగా పడకుండా లభించేది. కొన్నిటికి అసలే సరఫరా అయేదికాదు. కాబట్టి నగరం అవసరాలకి ఒక్క వుస్మాన్‌సాగర్ నీరు (రోజుకి యించుమించు 140 లక్షల గేలన్లు) చాలదని స్పష్టమైపోయింది. కాబట్టి వుస్మాన్‌సాగర్, హిమాయత్ సాగర్‌లు రెండింటి నుంచి పూర్తిగా నీరు తీసుకోడానికి వీలుగా

హైదరాబాదు నీటి సరఫరా పథకాన్ని మార్చాలనీ సంకల్పించ బడింది.

## సవరించిన హైదరాబాదు నీటి సరఫరా పథకం

వెనుక భాగంలో చూసినట్టుగా, హైదరాబాదు కొత్తనీటి సరఫరా సిస్టం చాలాకాలం వుస్మాన్ సాగర్ పై ఆధారపడి వుంది. ఆపైన ఈ పథకం క్రింద అసఫ్‌నగర్ లో నిర్మితమైన పాటర్సన్ ఫిల్టర్లు రోజుకి 100 లక్షల గేలన్లు మాత్రమే పట్టేవి. హెచ్చిన నీటి వాడకానికి యీ పథకం చాలనందున దానిని మార్చడానికి సంకల్పించ బడింది.

ఈ పథకం క్రింద, వుస్మాన్‌సాగర్ నుంచి రోజుకి 140 లక్షల గేలన్లు లభించగలవని అంచనా వేయబడింది. హిమాయత్‌సాగర్ ప్రభుత్వ పొలాల పంటనీటికై రోజుకి యించుమించు 20 లక్షల గేలన్లని కేటాయించిన తరువాత హిమాయత్ సాగర్ నుంచి రోజుకి 130 లక్షల గేలన్లని తీసుకోవాలని సంకల్పించ బడింది. ఈ రెండింటి నుంచి రోజుకి మొత్తం 270 లక్షల గేలన్లు లభించ గలవనీ, అవి 6 లక్షలుగా అంచనా వేయబడిన హైదరాబాదు, సికిందరాబాదు నగరాలజనాభాకి చాలుననీ భావించబడింది. రోజుకి మనిషికి 45 గేలన్ల నీరు సరఫరా చేయాలని నిశ్చయించ బడింది.

క్లుప్తంగా యీ పథకం క్రింద వుస్మాన్‌సాగర్ సిస్టానికి సంకల్పించబడిన పనులు (1) అసఫ్‌నగర్ వడపోత యంత్రాల శక్తిని పెంచి రోజుకి మరొక 50 లక్షల గేలన్లని అదనంగా వడపోసే యేర్పాటు చేయడం, (2) అసఫ్‌నగర్ ఫిల్టర్లనుంచి హబీబునగర్ కూడలికి 33% డూప్లికేట్ ట్రంక్ మెయిన్ నిర్మాణం. (3) ఈ సిస్టంక్రింది మండలాలన్నిటిలోనుగల పంపిణీసిస్టం మార్పు. సికిందరాబాదు, చిలకలగూడాల ట్రంక్ మెయిన్‌ల విస్తరణకూడా యిందులో చేరివున్నది.

హిమాయత్‌సాగర్ సిస్టానికి సంకల్పించిన పనులు (1) హిమాయత్‌సాగర్ నుంచి మీర్ ఆలంకి కాలవ నిర్మాణం (2) అవసరమైన శక్తిమేరకి ఫిల్టర్లు, అలియాబాద్‌కి ట్రంక్ మెయిన్ (3) వేర్వేరు మండలాల పంపిణీసిస్టం మార్పు.

దీనికి అప్పటిధరల ప్రకారం మొత్తం రూ. 70 లక్షలువ్యయం కాగలదని అంచనా.

1932 లో ప్రభుత్వం యీపథకాన్ని చేపట్టడానికి ఆమోదించింది. దీనిని తగిన వాయిదాలలో చేపట్టి అంత సొమ్మును స్వల్పకాలంలో ఖర్చుచేయవలసిన అవసరం లేకుండా చేయాలని కూడా నిర్ణయించ బడింది. మార్చిన పథకం మొదటివాయిదా ఖర్చు రూ. 15.5 లక్షలను ప్రభుత్వం మంజూరు చేసింది.

## మొదటి వాయిదా

ఈ వాయిదా క్రింద జరిగిన పనులు యివి:-

1. కాండీశైప్ యూనిట్టుద్వారా అసఫ్‌నగర్ వడపోత యంత్రాల శక్తి హెచ్చింపు.

2. అసఫ్‌నగర్ నుంచి హబీబునగర్ కూడలికి 33″ డూప్లికేటు ట్రంక్ మెయిన్ నిర్మాణం.

3. ఉస్మాన్‌సాగర్ సిస్టంలో దిగువ రెడ్ హిల్సు, చిలకలగూడా మండలాలుతప్ప మిగిలిన అన్ని మండలాల పంపిణీ సిస్టం మార్పు. జూబిలి హిల్సుపై మొదటి, రెండవ అంచె యెగువ జలాశయాలని వ్యవహరింపబడే 2 యెగువ జలాశయాల నిర్మాణం, తట్టిఖానా, అసఫ్‌నగర్ మెరక మండలాలకై వాటివాటి పంపింగు స్టేషన్లతోసహా యెగువ చెరువుల నిర్మాణంకూడా దీనిలో చేరి వున్నవి.

4. అలియాబాదు మెరక మండలం పంపిణీ మార్పు.

5. మధ్యదశలో సికింద్రాబాదు, రైల్వే, చిలకలగూడాలకై సప్లిమెంటరీ ట్రంక్ మెయిన్ నిర్మాణం.

ఈ పనులు 1935-36 నాటికి పూర్తయినవి. దీనితో వడపోత అయే నీరు, మీర్ ఆలం ఫిల్టర్లు వడపోసేదానితో సహా, మొత్తం 170 లక్షల గేలన్లకి హెచ్చింది.

ఈ కాలంలో మరి రెండు చిన్న పథకాలు కూడా (సవరించిన పథకం పరిధికి అవల నున్నవి.) అడిగ్‌మెట్ కొత్త విశ్వవిద్యాలయ ప్రాంతానికి,

మైనరంకి నీటిని సరఫరా చేయడానికై నిర్వహించ బడినవి.

హిమాయత్‌సాగర్ చెరువు నుంచి యింకా యెక్కువ నీటిని తీసుకొని, వుస్మాన్‌సాగర్ పై ఒత్తిడిని తగ్గించడం అత్యవసరమైన కారణంగా 1937 లో సవరించిన పథకానికి చెందిన దిగువ పనులు మంజూరు చేయబడినవి.

1. మీర్ ఆలం చెరువు వద్ద పంపింగుస్టేషన్. హిమాయత్‌సాగర్ కాలవ నిర్మాణం పూర్తయే వరకూ హిమాయత్‌సాగర్ నీటిని మీర్ ఆలం చెరువు నుంచి తోడడానికి యిది స్థాపించబడింది.

2. మీర్ ఆలం నుంచి అలియాబాదు జలాశయానికి 27" ట్రంక్ మెయిన్.

3. మీర్ ఆలం రాపిడ్ గ్రావిటీ ఫిల్టర్ల నిర్మాణం.

సవరించబడిన అంచనాల ప్రకారం వీటి ఖర్చు రూ. 9.39 లక్షలు. మీర్ ఆలం రాపిడ్ గ్రావిటీ ఫిల్టర్ల నిర్మాణంతో మొత్తం వడ పోతశక్తి రోజుకి 240 లక్షల గేలన్లకి హెచ్చింది.

## రెండవ వాయిదా

1944 లో సవరించబడిన పథకం 2వ వాయిదా మంజూరైంది. ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్ సిస్టాల క్రింది మిగిలిన మండలాలన్నిటిలోను పంపిణీ మార్గాల మార్పు యిందులో చేరి వున్నది. రెడ్‌హిల్సులో కొత్త రెడ్‌హిల్సు దిగువ సర్వీసు జలాశయం అనివ్యవహారింప బడే మరొక జలాశయం నిర్మాణం, మీర్ ఆలం రా. గ్రా. ఫిల్టర్ల నుంచి రెండు ట్రంక్ మెయిన్‌ల నిర్మాణం దీనిలో చేరి వున్నాయి. ఇందులో ఒకటి మిస్రిగంజ్ జలాశయాన్ని, రెండవది మిస్రిగంజ్ కూడలి వరకూ వెళ్ళి ప్రస్తుతపు 30" ట్రంక్ మెయిన్‌తో కలిసి కొత్త రెడ్‌హిల్సు దిగువ జలాశయాన్ని నింప డానికి వుద్దేశించ బడినవి.

2వ వాయిదా పనులు పూర్తి కావడానికై ప్రతి సంవత్సరం యించుమించు రూ. 5-6 లక్షలు గ్రాంటు యివ్వబడాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది.

సవరించ బడిన అంచనాల ప్రకారం వీటికి రూ. 49.74 లక్షలు ఖర్చు కాగలదు. వీటిలో 80% అప్పుడే పూర్తయింది. మిగిలిన పని జరుగుతున్నది.

## మూడవ వాయిదా

1946 లో సవరించ బడిన పథకం 3వ వాయిదా మంజూరయింది. సికింద్రాబాదు సరఫరాను హెచ్చించ డానికై హబీబునగర్, సికింద్రాబాదు కూడలుల మధ్య సప్లిమెంటరీ ట్రంక్ మెయిన్‌ల నిర్మాణం యిందులో చేరివున్నది.

ఈ అంచనా ప్రకారం హబీబునగర్ కూడలి నుంచి నాంపల్లి తూముకి ఒక 27" మెయిన్ అప్పుడే నిర్మితమై పనిచేస్తున్నది. ఇక్కడి నుంచి పైకి సికింద్రాబాదు కూడలి వరకూ నిర్మించ వలసిన 30" ట్రంక్ మెయిను పని దాదాపు పూర్తయింది.

దీనికి రూ. 6.32 లక్షలు ఖర్చు కాగలదు. సవరించ బడిన పథకం పై యింతవరకూ యించుమించు రూ. 70 లక్షలు వ్యయపరచ బడినవి.

## నాలుగవ వాయిదా

ప్రస్తుతం హిమాయత్‌సాగర్ నుంచి లభించే నీరంతా వుపయోగించ బడ్డం లేదు. దీనిని సాధించ డానికై (1) మీర్ ఆలం రా. గ్రా. ఫిల్టర్ల శక్తిని హెచ్చించి, (2) హిమాయత్‌సాగర్ నుంచి మీర్ ఆలం రా. గ్రా. ఫిల్టర్లకి కాలవను నిర్మించాలని సంకల్పించ బడింది. ఈపనుల అంచనాలు ఐ. జి. రూ. 45.64 లక్షల్ని 1954 లో ప్రభుత్వం మంజూరు చేసింది. వీటి పని పూర్తికా వస్తున్నది.

ఇదివరకే చెప్పినట్టు హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో మొత్తం 6 లక్షల మందికి మొత్తం మీద రోజుకి 270 లక్షల గేలన్లని సరఫరా చేయడానికై యీ సవరించబడిన పథకం వుద్దేశించ బడింది. ఇప్పుడీ జనాభా అనుకున్న దానికంటే యించుమించు రెట్టింపు పెరిగింది. 1951 జనాభా లెక్కల ప్రకారమే జనసంఖ్య 11 లక్షలు వుంది. రోజుకి యీ 270 లక్షల గేలన్లు చాలవనడం స్పష్టం.

గత కొన్ని సంవత్సరాలలోను హిమాయత్ సాగర్ నీటి పరిస్థితి గమనించ బడింది. దాని పోలా లకి పోను దానినుంచి రోజుకి 180 లక్షల గేలన్లు లభించ గలవని యిప్పుడు నిర్ధారణ అయింది. ఇప్పుడు వుస్మాన్‌సాగర్‌లో కూడా నీరు యిదివర కటికంటె హెచ్చుమట్టంలో నిలవచేయ బడు తున్నది. దానినుంచి కూడా మరంత నీరు లభిస్తుం దని భావించ బడుతున్నది. కాబట్టి రోజుకి మొత్తం 360 లక్షల గేలన్లు లభిస్తాయి. నాలుగవ వాయిదా పనుల యేర్పాటులో యీ విషయం దృష్టిలో పెట్టుకొన బడింది.

ఆంధ్రప్రదేశ్ అవతరణతో హైదరాబాదు నగరం, సికిందరాబాదుల హోదా పెరిగింది. వీటి జనసంఖ్య, సరిహద్దులు కూడా బాగా పెరిగే అవ కాశ మున్నది. ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రానికి రాజధానియైన నగరానికి చక్కటి మంచినీటి సరఫరా వుండడం అవసరం. పై 360 లక్షల గేలన్లు మన అవసరాలకి చాలవు. కాబట్టి పరిస్థితి విషమిం చకముందే అదనపు నీటి వనర్ల వుపయోగాన్ని పరిశీలించి తగిన పథకాన్ని తయారు చేసుకోవాలి.

హైదరాబాదు, సికిందరాబాదు నగరాల ప్రస్తు తపు జనసంఖ్య యించుమించు 12 లక్షలు. పంపిణీ మార్గాలు ఆఖరికి 6.5 లక్షలమంది సప్లైకై వుదేశించ బడినవి. పంపిణీ మెయిన్‌లు, మురుగు కాలవల అభివృద్ధికై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వం యీ రెండు నగరాలకి ఒకకోటి రూపా యల్ని కేటాయించింది. దీనిలో రూ. 54.5 లక్షలు హైదరాబాదు నగర నీటి సరఫరా అభివృద్ధికై కేటాయించ బడ్డాయి. అంచనాలు అప్పుడే ప్రభు త్వానికి సమర్పించ బడినవి. ఆఖరికి జనసంఖ్య 20 లక్షలకి పెరుగు తుందనుకొని రోజుకి మనిషికి 40 గేలన్లు కావాలనుకుంటే, రోజుకి కనీసం మొత్తం 800 లక్షల గేలన్లు కావాలి. ఈలోటు భర్తీకై మంజీరానదిని వుపయోగించు కోడానికి గల అవ కాశాల పరిశీలనకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎస్టా బ్లిష్ మెంటు స్కేల్‌ని మంజూరు చేసింది. పరిశోధ నలు జరుగుతున్నాయి, ప్రభుత్వానికి నివేదిక 1958 జూలై నాటికి సమర్పించ బడుతుంది.

హైదరాబాదు, సికిందరాబాదు నగరాల మునిసి పలు సరిహద్దులు విస్తరిల్లి అనేకమైన శివార్లు వెలిశాయి. ప్రస్తుతపు నీటి వనర్ల సరఫరా పరిమి తంగా వుండుటవల్ల యీ శివార్లకి నీటిని అందించడం సాధ్య పడదు. కాని మంజీరానది నీరు లభ్యమయి నప్పుడు యీ రెండు నగరాలకి వాటి శివార్లతో సహా పుష్కలంగా నీరు లభిస్తుంది.



పరిశోధన, విస్తరణ, విద్యాబోధనలద్వారా

# ఇతోధికమైన వ్యవసాయ వస్తూత్పత్తి

## వ్యవసాయరంగంలో ప్రభుత్వ వ్యవసాయశాఖ వహిస్తున్న ప్రముఖ పాత్ర

శ్రీ ఐ. జె. నాయుడు, ఐ. ఏ. ఎస్., (వ్యవసాయశాఖ డైరెక్టర్)

1956 నవంబరు 1వ తేదీన అవతరించిన ఆంధ్ర ప్రదేశ్ భారతదేశంలో పునర్వ్యవస్థీకృతమైన రాష్ట్రాలలో మిక్కిలి పెద్దవాటిలో అయిదవది. దాని విస్తీర్ణం 1,06,041 చదరపు మైళ్లు. జనసంఖ్య 1951 జనాభా లెక్కల ప్రకారం 312.6 లక్షలు. ప్రధానవృత్తి వ్యవసాయం. ఇది 210.4 లక్షల మందికి జీవనోపాధిగా వున్నది. రాష్ట్రపు మొత్తం భౌగోళిక విస్తీర్ణంలో 21.0% అడవులక్రింద వున్నది. 10.9% పర్ర, సాగు లాయకుగాని భూములై వున్నవి. వ్యవసాయేతర ప్రయోజనాలకై 5.0% వుపయోగించ బడుతున్నది. సాగులాయకైన బంజర్లు, కర్రెంటు బీడుభూములు, యితర బీళ్లు, శాశ్వతమైన పచ్చిక బయళ్ళు, వివిధ రకాల చెట్లు, పంటలు, పశువుల మేతకి పనికివచ్చే యితర భూములు, తోటలు మున్నగు వాటిక్రింద మరొక 21.2 % వుంటుంది. ఇవిపోను మిగిలిన 42.0% వేర్వేరు పంటలక్రింద వున్నది. పైరువేసిన కొత్త ప్రదేశం మనిషికి 1.29 యెకరాలుంటుంది. అఖిల భారతానికి యిది 1.26 యెకరాలు. రాష్ట్రంలోని వివిధ వనర్లక్రింద సాగునీటి సౌకర్యంగల భూమి 65 లక్షల యెకరాలు లేక మొత్తం పంటప్రదేశంలో 21%.

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన నేలల రకాలు యివి :—

1. ఎరుపు, బూడిదవర్ణం, యిసుక నేలలు
2. నల్లరేగడి నేలలు
3. కోస్తాఒండు నేలలు, ముఖ్యంగా యిసుకనుంచి యిసుకతో కూడిన బంకమట్టి.
4. డెల్టాఒండు నేలలు
5. బొంతరాతి నేలలు
6. సున్నపు నేలలు.

ఎరుపు, బూడిదవర్ణం యిసుక నేలలు సాధారణంగా బంకమట్టినుంచి యిసుకతోకూడిన బంకమట్టిగా వుంటాయి. వీటిలో సాధారణంగా మొక్కల కవసరమైన పోషకాహారం తక్కువగా వుంటుంది. నల్లరేగడి భూములు తేమను బాగా పట్టి వుంచుతాయి. ఇవి సామాన్యంగా సారవంతంగా వుంటాయి. కోస్తాఒండు భూములలో సాధారణంగా జీవ పదార్థాలు, మొక్కల పోషక పదార్థాలు తక్కువగా వుంటాయి. కాని మళ్ళీ డెల్టా ఒండ్రు భూములు సారవంతమైనవి. రాతి సున్నం నేలలుకూడా సామాన్యంగా సారవంతంగా వుండవు. సంవత్సరంలో చాల కాలం వుష్ణంగా వుంటుంది. రాష్ట్రంలోని కొన్ని ప్రదేశాలలో వేసవిలో యెండలు, శీతాకాలంలో చలి కొన్నాళ్లపాటు బాగా తీవ్రంగా వుంటాయి మార్చి నుంచి మే వరకూ వేసవికాలం, జూన్ నుంచి సెప్టెంబరు వరకూ వర్షాకాలం, డిసెంబరు నుంచి ఫిబ్రవరి వరకూ చలికాలం. సాధారణంగా మే నెలలో యెండలు బాగా యెక్కువగా వుంటాయి.

ఆంధ్ర ప్రదేశ్
నేలలు, వర్షపాతములను
చూపే పటము



మిక్కిలి వేడి ప్రదేశాలు గుంటూరు, కృష్ణా, ఖమ్మం జిల్లాల్లో వున్నాయి. రాష్ట్రంలో హెచ్చు వర్షాలు ( గరిష్ఠసగటు 45.7 అం. ) తూర్పుగోదావరి జిల్లాలో కురుస్తాయి. తక్కువ వర్షాలు (కనిష్ఠసగటు 22.4" ) అనంతపురం జిల్లాలో కురుస్తాయి. 1955-56 లో నైఋతి రుతుపవనాల వల్ల కోస్తా ఆంధ్రదేశం, రాయలసీమ. తెలంగాణాలలో కురిసిన సగటువర్షం వరుసగా 23.3", 17.0" 37.4" ఈశాన్య ఋతుపవనాలవల్ల యీ మూడు ప్రాంతాలలోను కురిసిన సగటు వర్షం వరుసగా 14.5", 6.7", 4.8". ఇక్కడ శీతాకాలంలో సగటు వర్షపాతం వరుసగా 0.8", 0.2", 0.2". కాగా వేసవి కాలంలో వరుసగా 4.4", 4.7", 5.3". అయివున్నది. ఈ మూడు ప్రాంతాలలోను సంవత్సరంలో కురిసిన మొత్తం వర్షాల సగటు వరుసగా 42.4", 28 8", 47.2", అయి వున్నది.

వర్షపాతం జిల్లాల వారీ వివరాలు అంగుళాలలో

| వరుస సంఖ్య | జిల్లా | మామూలు | (1954-55లో) కురిసినది |
|---|---|---|---|
| 1 | శ్రీకాకుళం | 43. 0 * | 44.8 |
| 2 | విశాఖపట్నం | 39. 0 * | 58.4 |
| 3 | తూర్పు గోదావరి | 45. 7 * | 53.5 |
| 4 | పశ్చిమ గోదావరి | 40. 7 * | 53.4 |
| 5 | కృష్ణా | 37. 0 * | 43.8 |
| 6 | గుంటూరు | 32. 4 * | 38.4 |
| 7 | నెల్లూరు | 35.11 * | 44.1 |
| 8 | కర్నూలు | 24. 2 * | 24.3 |
| 9 | అనంతపురం | 22. 4 * | 20.3 |
| 10 | కడప | 27. 1 * | 34.2 |
| 11 | చిత్తూరు | 33. 7 * | 41.5 |
| | ఆంధ్ర ప్రాంతం | 34. 6 | 41.5 |
| 12 | హైదరాబాదు | 27. 0 X | 27.2 |
| 13 | నిజామాబాదు | 39. 2 X | 36.8 |
| 14 | మెదక్ | 33. 4 X | 36.5 |
| 15 | మహబూబునగరం | 28. 3 X | 30.9 |
| 16 | నల్గొండ | 27. 2 X | 32.5 |
| 17 | వరంగల్లు | 38. 3 X | 37.6 |
| 18 | ఖమ్మం | 37. 7 X | 40.8 |
| 19 | కరీంనగరం | 36. 9 X | 32.3 |
| 20 | ఆదిలాబాదు | 44. 7 X | 39.8 |
| | తెలంగాణా ప్రాంతం | 36. 7 | 34.9 |
| | ఆంధ్రప్రదేశ్ సగటు | 35. 7 | 38.2 |

* 1940 తో అంతమైన సంవత్సరాల సీరీస్ సగటు వర్షపాతం

X 34 సంవత్సరాల నార్మల్

రాష్ట్రంలో పండే ప్రధానపంటలు, మొత్తం పంట భూమిలో ప్రతిపంటా ఆక్రమించే భూమి శాతం, 1955-56 సగటు రాలుబడులవివరాలు దిగువ యివ్వ బడినవి :—

| | పంట పేరు | విస్తీర్ణం. ఎకరాలు | మొత్తంపంట ప్రదేశంలో శాతం |
|---|---|---|---|
| | ఆహార పంటలు | మొత్తం | శాతం |
| 1 | కాయధాన్యాలు | 1,87,97,580 | 63.2% |
| 2 | పప్పుదినుసులు | 32,56,257 | 10.9% |
| 3 | చెఱకు | 1,74,963 | 0.6% |
| 4 | మిర్చి | 4,35,899 | 1.4% |
| 5 | పళ్లు, కాయగూరలు | 3,78,860 | 1.2% |
| 6 | ఇతర ఆహార పంటలు | 3,55,898 | 1.2% |
| | | 2,33,99,407 | 78.5 |

## 1955-56 లో

## ఆంధ్ర ప్రదేశ్‌లో ఎకరా వుత్పత్తి పంటల లో ఇది ఇండియా వుత్పత్తితో పోల్చబడింది.



| పంట పేరు | విస్తీర్ణం ఎకరాలు | మొత్తంపంట ప్రదేశంలో శాతం |
|---|---|---|
| **ఆహారేతర పంటలు** | | |
| 7 ప్రత్తి | 10,05,442 | 3.4% |
| 8 వేరుసెనగ | 30,54,174 | 10.4% |
| 9 పొగాకు | 3,94,857 | 1.3% |
| 10 కొబ్బరి | 88,019 | 0.3% |
| 11 ఆముదాలు | 8,56,150 | 2.8% |
| 12 నువ్వులు | 6,67,488 | 2.3% |
| 13 పశుగ్రాసం పంటలు | 3,03,587 | 1.0% |
| మొత్తం | 63,79,726 | 21.5 |

మొత్తం పంట ప్రదేశంలో ఆహార పంటలు దాదాపు 2,33,99,407 ఎకరాలు లేక 78.5% ఆక్రమిస్తాయి. రాష్ట్రంలో మిక్కిలి ప్రధానమైన పంట వరి. ఇది మొత్తంపంట ప్రదేశంలో 71,04,000 యెకరాలను అనగా (22.1%) శాతాన్ని ఆక్రమిస్తుంది.

ఆ తరువాత మెట్ట ధాన్యాలు ప్రాధాన్యత వహిస్తాయి. ఇవి (21,13,470) టన్నులు పండుతా యని అంచనా. ఇవన్నీ రాష్ట్రంలోనే ఖర్చయి పోయి, యెగుమతికేమీ మిగలవు. తగినంత ప్రదేశం పప్పు దినుసుల క్రింద వున్నది. ఇవి స్థానికావస రాలకి సరిపోతాయి.

చెఱకు రాష్ట్రంలోని ప్రధానమైన రొఖ్ఖం పంట. రాష్ట్రంలో సగటున యించుమించు (5,28,046) టన్నుల వుత్పత్తి అవుతుందని అంచనా. రాష్ట్రంలో (4,12,846) టన్నులు మాత్రమే ఖర్చు అవుతుంది. కాబట్టి (1,15,200) టన్నులు యెగు మతికై మిగులుతుంది. ఎగుమతికై మిగిలే పంట లలో వేరుసెనగ, మిర్చి, పొగాకు, వుల్లిపాయలు, పసుపు, మామిడి, అరటి, నిమ్మజాతి వంటి పళ్లు కూడా చేరివున్నాయి. ఈ వస్తువుల వుత్పత్తి విని యోగాలు, యెగుమతికై మిగిలిన సరుకు వివరాలు (1955-56 కి) దిగువ యివ్వబడినవి.

| వస్తువుల పేర్లు | సగటు వుత్పత్తి (టన్నులు) | రాష్ట్రపు అవసరాలు (టన్నులు) | ఎగుమతికి మిగిలే సరుకు (టన్నులు) |
|---|---|---|---|
| వేరుసెనగ | 1,07,01,120 | 97,61,720 | 93,400 |
| పొగాకు | 1,31,100 | 49,900 | 81,200 |
| మిర్చి | 1,10,490 | 1,03,651 | 6,839 |
| వుల్లిపాయలు | 1,70,532 | 1,26,532 | 44,000 |
| పసుపు | 64,497 | 54,497 | 10,000 |
| కొబ్బరి కాయలు | 2330 లక్షలు | 1830 లక్షలు | 500 లక్షలు |
| ఆముదాలు | 62,426 | 40,106 | 22,320 టన్నులు |
| ముడిప్రత్తి | 1,35,400 బేళ్లు (ఒక్కొక్కటి 392 పౌన్లు) | 29,943 బేళ్ళు | 1,05,457 బేళ్ల ముడిప్రత్తి |
| మామిడి | 1,83,000 } టన్నులు. ఎగుమతికి మిగిలే సరుకు | | |
| అరటి | 22,900 } | | |
| నిమ్మజాతి | 11,650 } | | |

# ఆంధ్రప్రదేశ్

## పటము

వ్యవ. డిప్యూటి డైరెక్టర్లు, జిల్లా వ్యవసాయాధికార్లు, వ్యవసాయ కళాశాల ప్రిన్సిపాల్‌లు మున్నగువారి ముఖ్య కార్యాలయాలు గల ప్రదేశాలను చూపుతుంది.




### సూచన

- ■ - జిల్లాముఖ్య కార్యాలయం.
- ● - వ్యవసాయ డిప్యూటి డైరెక్టరు
- ▲ - జిల్లా వ్యవసాయాధికారి
- ఎ - అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీరు
- ప్రి - వ్యవ. కళాశాల ప్రిన్సిపల్
- ✕ - అసిస్టెంటు ప్రత్తి విస్తరణాధికారి
- (ఆకు) - అసిస్టెంటు పొగాకు విస్తరణాధికారి
- ★ - మొక్కల రక్షణాధికారి

## వ్యవసాయశాఖ ప్రధాన భాగాలు

రాష్ట్ర వ్యవసాయ శాఖలో స్థూలంగా మూడు విభాగా లున్నాయి. 1. పరిశోధన, 2. విస్తరణ, 3. విద్యాబోధన. హెడ్ క్వార్టర్సులో వ్యవసాయ శాఖ డైరెక్టరుకి, యిద్దరు జాయింటు డైరెక్టర్లు, ముగ్గురు వ్యవసాయ డిప్యూటీ డైరెక్టర్లు (విస్తరణ, పరిశోధన, మార్కెటింగు), నలుగురు వ్యవసాయ అసిస్టెంటు డైరెక్టర్లు (పథక నిర్మాణం, అధికాహారోత్పత్తి, పరిశోధన, సాధారణ విషయాలు), ఒక వ్యవసాయ ఇంజనీరు, ముగ్గురు అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీర్లు, యిద్దరు అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్లు, ఒక ఆడిట్ ఆఫీసరు, అక్కౌంట్ల ఆఫీసరు, పర్సనల్ అసిస్టెంటు, ప్రచార అసిస్టెంటు డైరెక్టరు వ్యవసాయ సమాచార ఆఫీసరు తోడ్పడుతారు.

## పరిశోధన

ఈ శాఖలో రెండు రకాల విషయాలలో పరిశోధన జరుగుతుంది. 1. వ్యవసాయానికి సంబంధించిన మూల, ఆర్థిక సమస్యల పరిశోధన 2. ఉత్తమమైన పంటల రకాల సాధన. ఈ పనిని రాష్ట్రంలోని వివిధ పరిశోధన కేంద్రాలలో వేర్వేరు పంటల నిపుణులు పరిశోధన సిబ్బంది సహాయంతో చేస్తారు ప్రస్తుతం రాష్ట్రంలో 34 పరిశోధన కేంద్రాలున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో మరి కొన్నిటిని నెలకొల్పాలని సంకల్పం. పరిశోధన పథకాలు అమలు జరుగుతున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో రూ. 131.45 లక్షలు వ్యయమయ్యే 65 పరిశోధన పథకాలను చేపట్టాలని సంకల్పం. ఇంతవరకూ వరి క్రింద 73 రకాల స్ట్రైన్లు, మెట్టధాన్యాల క్రింద 49 రకాల స్ట్రైన్లు సాధించబడినవి

ఉత్తమ రకాల పంటల క్రిందవున్న అంచనాని వేయబడిన భూమి వివరాలు దిగువ యివ్వబడినవి :-

| పంట | ఉత్తమ రకాల క్రిందగల భూమిశాతం | |
|---|---|---|
| | ఆంధ్ర | తెలంగాణా |
| 1. వరి | 82 | 44 |
| 2. జొన్న | 38 | 1 |
| 3. రాగి లేక చోడి | 34 | — |
| 4. కొర్ర | 47 | — |
| 5. సజ్జ | 2 | — |
| 6. చెఱకు | 97 | 82 |
| 7. ప్రత్తి | 53 | 32 |
| 8. వేరుసెనగ | 13 | — |

## వ్యవసాయ విద్య

రాష్ట్రంలో 2 వ్యవసాయ కళాశాలలున్నాయి. ఒకటి బాపట్లలో వున్నది. ఇది వ్యవసాయ శాఖచే నిర్వహించబడు తున్నది. హైదరాబాదులో వున్న రెండవది వుస్మానియా విశ్వవిద్యాలయంచే నిర్వహించబడు తున్నది. ఇక్కడ 3 సంవత్సరాలు శిక్షణ పొంది వ్యవసాయంలో బి. ఎస్‌సి. డిగ్రీని పొందవచ్చును. ప్రస్తుతం బాపట్ల వ్యవసాయ కళాశాలలో యేటా 144 మంది విద్యార్థులకీ, హైదరాబాదు వ్యవసాయ కళాశాలలో 83 మందికి ప్రవేశమివ్వబడుతున్నది.

## విస్తరణ

పరిశోధన ఫలితాలను ప్రత్యక్షంగా చేసి చూపించడమే విస్తరణ కార్యక్రమంలోని ముఖ్యాంశం. రైతుల పొలాల్లో ప్రదర్శించి చూపడం ద్వారాను, ప్రచురణ, ప్రచారాలద్వారాను యీ ఫలితాలు అమలు జరపబడుతాయి. జిల్లాల్లో పనిని యేడుగురు వ్యవసాయ ప్రాంతీయ డిప్యూటీ డైరెక్టర్లు అజమాయిషీ చేస్తారు. వారి ముఖ్య కార్యాలయాలు

హైదరాబాదు, వరంగల్లు, నిజామాబాదు, విశాఖపట్నం, ఏలూరు, గుంటూరు, కడపలలో వున్నాయి. జిల్లాల్లోని వివిధకార్యక్రమాల్ని పర్యవేక్షించి, అమలు జరపడానికై ప్రతి జిల్లాకి ఒక జిల్లా వ్యవసాయాధికారి వున్నారు. ఆయనకి వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు లేక వ్యవసాయ అసిస్టెంట్లు, ఫీల్డుమెన్ సహాయకులుగా వుంటారు. ప్రతి తాలూకాకు ఒక వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు లేక అసిస్టెంటు వుంటాడు. పెద్ద తాలూకాలకి కొందరు డిమాన్‌స్ట్రేటర్లు అదనంగా వుంటారు. వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు లేక అసిస్టెంట్లకి ఫీల్డుపనిలో ఫీల్డుమెన్, డిమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలు సహాయం చేస్తారు. ఆంధ్ర జిల్లాలలోని యేర్పాటు 'ఎ' పటంలో సూచించబడింది.

వ్యవసాయశాఖలో ఒక వ్యవసాయమార్కెటింగు విభాగం వున్నది. ఇది వ్యవసాయ పదార్థాల మార్కెటింగుకి సంబంధించిన సమస్యల పరిష్కారాన్ని చూస్తుంది. ఈ విభాగం వ్యవహారాలను చూసే హెడ్‌క్వార్టర్సు డిప్యూటీ డైరెక్టరు (మార్కెటింగు) కి (యిద్దరు) అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్లు, ఆడిట్ ఆఫీసరు, మార్కెటింగు అసిస్టెంట్లు సహాయకులుగా వుంటారు.

ఈ శాఖ వ్యవసాయ ఇంజనీరింగు విభాగం హెడ్‌క్వార్టర్సులోవున్న వ్యవసాయ ఇంజనీరు అధ్వర్యంలో వుంది. ఆయనకి (ముగ్గురు) అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీర్లు, యిద్దరు సూపర్‌వైజర్లు సహాయకులుగా వుంటారు. ఈ శాఖకిగల ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు, ఆయిల్ ఇంజన్లు మున్నగువాటి సక్రమ నిర్వహణకి సంబంధించిన పనిని యీ విభాగం చూస్తుంది.

తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆంధ్రప్రదేశ్ 50 వ్యవసాయ పథకాలపై రూ. 559.73 లక్షలు ఖర్చుచేసి రాష్ట్రపు వ్యవసాయోత్పత్తిని బాగా పెంచింది. వీటిలో అధికాహారోత్పత్తి పథకాలే కాక పరిశోధన పథకాలు కూడా వున్నాయి. ద్వితీయ ప్రణాళిక కాలంలో 169 పథకాలపై మొత్తం రూ. 854.24 లక్షల్ని వ్యయం చేయాలని సంకల్పం. వ్యయం చేయగల పద్దులు స్థూలంగా దిగువ యివ్వబడినవి.

| తరగతి | పథకాల సంఖ్య | అంచనా సొమ్ము (లక్షల రూపాయలలో) |
|---|---|---|
| 1. వ్యవసాయ విస్తరణ | 54 | 555.80 |
| 2. వ్యవసాయ పరిశోధన | 85 | 131.45 |
| 3. భూసార పరిరక్షణ | 12 | 98.06 |
| 4. మార్కెటింగు | 8 | 37.89 |
| 5. విద్య, శిక్షణ | 10 | 14.49 |
| 6. రిజర్వు (తలవని తలంపుగా వచ్చే పథకాలు) | | 14.55 |

తొలి ప్రణాళిక అమలులో గణించిన అనుభవంతో యీ ప్రణాళికలోని లోపాలను సరిదిద్దడానికి ప్రయత్నించ బడుతున్నది. వ్యవసాయం సర్వతో ముఖాభివృద్ధికై సమన్వితము, యేకీకృతము అయిన చక్కని కృషి జరుగడానికి యేర్పాటు చేయబడింది. ఇందు నిమిత్తం వ్యవసాయశాఖ వేర్వేరు కార్యక్రమాలకి అనగా విస్తరణ, పరిశోధన, విద్యాబోధనలకు సంబంధించిన పథకాలు తగినన్ని చేర్చబడినవి.

ఇక యిప్పుడు యీశాఖ నిర్మాణం, దీనిలోని వివిధ విభాగాల కృషికి సంబంధించిన వివరాలు, తొలి ప్రణాళికలో అమలు జరిపిన పథకాలు మున్నగువాటి వివరాలు, ద్వితీయ ప్రణాళికలో సంకల్పించిన పథకాలు, వాటి ఆశయాలకి సంబంధించిన వివరాలు, యివ్వబడగలవు. వ్యవసాయ రంగంలో అతి సమగ్రమైన యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలుతో రైతాంగంలో సర్వసాధారణమైన జాగృతి కలుగుతుందనీ, వ్యవసాయం శాస్త్రీయమైన పద్ధతులలో జరిగి, దాని అభివృద్ధికి తీవ్రమైన కృషి జరుగుతుందనీ, వ్యవసాయ కార్యక్రమాలు అంగలలో పురోగమించి తద్వారా రైతు రాబడి, సాధారణ సంపదలు హెచ్చగలవని హృదయపూర్వకంగా ఆశించ బడుతున్నది.

## వ్యవసాయ శాఖ నిర్మాణం

హెడ్ క్వార్టర్సులో యీ శాఖ నిర్మాణానికి సంబంధించిన వివరాలు యిదివరకే యివ్వబడినవి. దీనిలోని వివిధ విభాగాలు పనిచేసే విధానం దిగువ యివ్వ బడింది.

## విస్తరణ

ఆంధ్రప్రదేశ్‌లో 20 జిల్లాలు వున్నాయి. రాష్ట్రంలో 121 మంది వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు, 44 మంది అదనపు వ్యవసాయ డిమాన్ స్ట్రేటర్లు, 66 మంది వ్యవసాయ అసిస్టెంట్లు (తెలంగాణాలో) వున్నారు. వ్యవసాయ డిమాన్ స్ట్రేటర్లందరికీ డిపోలు, 45 మంది అదనపు వ్యవసాయ డిమాన్ స్ట్రేటర్లకి సబ్-డిపోలు సమకూర్చ బడినవి. వీటిలో వుత్తమ విత్తనాలు, రసాయన యెరువులు, క్రిమి సంహారకమైన మందులు, వ్యవసాయ పరికరాలు మున్నగు నవి, రైతులకి పంపిణీ చేయడానికై నిలవ చేయబడతాయి. వ్యవసాయ డిమాన్ స్ట్రేటర్లు, గ్రామంలో కార్యక్రమాన్ని ఫీల్డుమెన్, డిమాన్‌స్ట్రేషన్ మేస్త్రీల సహాయంతో జరుపుతారు.

## వ్యవసాయ విద్య

బాపట్ల (గుంటూరు జిల్లా) వ్యవసాయ కళాశాలలో 3 సంవత్సరాల డిగ్రీ కోర్సు వున్నది. ఇక్కడ వ్యవసాయ సిద్ధాంతాలు, ఆచరణల విషయంలో పూర్తి శిక్షణ యివ్వబడుతుంది. అదిగాక వ్యవసాయానికి సంబంధించిన యితర మూల శాస్త్రాలలో కూడా విద్య గరప బడుతుంది, హైద్రాబాదు వ్యవసాయ కళాశాలలో కూడా వ్యవసాయంలో 3 సంవత్సరాలు శిక్షణ యివ్వ బడుతుంది.

## మార్కెటింగు

ఈ శాఖ మార్కెటింగు విభాగం హెడ్ క్వార్టర్సు డిప్యూటీ డైరెక్టరు (మార్కెటింగు) అధ్వర్యాం క్రింద వుంది. ఈ విభాగానికి ఆంధ్ర ప్రాంతంలో కాకినాడ, విజయవాడ, కడపలలో మూడు ప్రాంతీయ యూనిట్లు వున్నాయి. ప్రతి యూనిట్టుకి ఒక అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసరు, ఆయన క్రింద సిబ్బంది వున్నారు. వ్యవసాయ శాఖ డైరెక్టరు కార్యాలయంలోని హెడ్ క్వార్టర్సు డిప్యూటీ డైరెక్టరు (మార్కెటింగు) ఆదేశాల ననుసరించి యీ ఆఫీసర్లు పనిచేస్తారు. తెలంగాణా ప్రాంతంలో 39 రెగ్యులేటెడ్ మార్కెట్లున్నాయి. వీటిలో ప్రతి ఒక్కటి ఒక సూపరింటెండెంటు అధ్వర్యంలో వున్నది. ఆంధ్ర ప్రాంతంలో మాత్రం ఒక్క నెల్లూరు జిల్లాకి తప్ప మిగిలిన అన్ని జిల్లాలకి జిల్లాకొక మార్కెటు వుంది.

## వ్యవసాయ ఇంజనీరింగు

వ్యవసాయ ఇంజనీరింగు విభాగం వ్యవసాయ ఇంజనీరు అధ్వర్యంలో వున్నది. ఆయనకి హెడ్ క్వార్టర్సులో ముగ్గురు అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీర్లు తోడ్పడుతారు. జిల్లాలో పనిని ముగ్గురు అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీర్లు చూస్తారు. వీరి ముఖ్య కార్యాలయాలు విశాఖపట్నం, విజయవాడ, కడపలలో వున్నాయి. ప్రతి జిల్లాకి ఇద్దరు వ్యవసాయ ఇంజనీరింగు సూపర్ వైజర్లు వున్నారు. వీరు వ్యవసాయ విస్తరణకి సంబంధించిన వ్యవసాయ ఇంజనీరింగులో జిల్లా వ్యవసాయాధికారికి తోడ్పడుతారు. శాఖ యొక్క ట్రాక్టర్లు మున్నగు యంత్రాలను సక్రియంగా వుంచి సర్వీసు చేస్తారు కూడా. తెలంగాణా జిల్లాల్లో ఇంజనీరింగుకి సంబంధించిన పనిని రాజధానిలోని అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీరు చూస్తారు ఆయనకి హైదరాబాదు (హైదరుగూడా) లో ఒక వర్కుషాపు వున్నది. వ్యవసాయ శాఖలో రైతులకి అద్దెకి యివ్వడానికై ప్రస్తుతం 274 ఆయిల్ ఇంజన్లు, 19 పంపుసెట్లు, 106 ట్రాక్టర్లు, 92 బుల్ డోజర్లు వున్నాయి.

## పరిశోధన

రాష్ట్రంలో ప్రస్తుతం 31 వ్యవసాయ పరిశోధన కేంద్రాలున్నాయి. వాటిలో కొన్ని వరి, మెట్ట ధాన్యాలు, ప్రత్తి, చెఱుకు, కొబ్బరి, పళ్ళు మున్నగు పంటల పరిశోధనకై ప్రత్యేకం కృషి చేయగా కొన్ని గ్రామీణ ఆర్థిక శాస్త్రం, వ్యవ

సాయ సమస్యలకి సంబంధించిన యితర విషయాలను పరిశోధిస్తాయి.

భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం, అలాగే భారతీయ కేంద్ర చెఱకు సంఘం, భారతీయ కేంద్ర ప్రత్తి సంఘం, భారతీయ కేంద్రీ పొగాకు సంఘం, భారతీయ కేంద్రీ నూనె గింజల సంఘం, భారతీయ కేంద్ర కొబ్బరి సంఘం, భారతీయ కేంద్రీ పోక చెక్కల సంఘాలవంటి వివిధ వస్తు సంఘాలు పెట్టుబడి పెట్టే అనేక పథకాల్ని కూడా వ్యవసాయ శాఖ అమలు జరుపుతున్నది. ఈ శాఖ పరిశోధన పనిని వివిధ పరిశోధన సెక్షన్లు జరుపుతాయి. రాష్ట్రీంలోని పరిశోధన పనిని దిగువ ప్రవీణులు చూస్తున్నారు.

### 1. పంటల అభివృద్ధి విభాగం

వ్యవసాయ రసాయనిక వేత్త, రాజేంద్రనగర్. ఫల ప్రవీణుడు, అనంతరాజుపేట, కోమారు, కడప జిల్లా. తోట పని నిపుణుడు, హైద్రాబాదు, హైదరుగూడా. చెఱకు నిపుణుడు, అనకాపల్లి.

### 2. పంటలు, మొక్కల రక్షణ విభాగం

ప్రభుత్వ కీటక శాస్త్రజ్ఞుడు, రాజేంద్రనగర్. ప్రభుత్వ మైకాలజిస్టు, రాజేంద్రనగర్.

### 3. పంటలు, పెంపొందించు విభాగం

ప్రత్తి నిపుణుడు, నంద్యాల. నూనె గింజల ప్రవీణుడు, రాజేంద్రనగర్. మెట్ట ధాన్యాల నిపుణుడు, లాం, గుంటూరు. వరి నిపుణుడు, రాజేంద్రనగర్. మొక్కజొన్న పరిశోధన ఆఫీసరు, కరీంనగరు. పప్పుదినుసుల నిపుణుడు, రాజేంద్రనగర్.

ఈ నిపుణులు వివిధ కేంద్రాలలో, తాముచూస్తున్న పంట లేక పంటల విషయంలో పరిశోధనకై తోడ్పడుతారు. వీరి క్రిందగల అసిస్టెంటు పరిశోధనాధికార్లు యీవిషయంలో వీరికి తోడ్పడుతారు. రాజేంద్రనగర్ లోని వరి నిపుణుడు వరి విత్తనాల అభివృద్ధి పనికి కూడా అధ్వర్యం వహించి దానిని అమలు చేస్తారు. ఆ విషయంలో ఆయునకి ఒక విత్తనాల అభివృద్ధి అధికారి, 10 మంది అసిస్టెంట్లు సహాయకులుగా వుంటారు. అలాగే మెట్ట ధాన్యాల నిపుణుడు మెట్టధాన్యపు విత్తనాల అభివృద్ధి పనిని, ఒక విత్తనాల అభివృద్ధి అధికారి, నలుగురు అసిస్టెంట్ల సహాయంతో, అజమాయిషీ చేస్తారు. ప్రత్తి నిపుణుడు ప్రత్తి పరిశోధన పనికి అధ్వర్యం వహిస్తారు. ఆయున ప్రత్తి విస్తరణ పథకానికి కూడా అధ్వర్యం వహిస్తారు. ఈ విషయంలో ఆయునకి యిద్దరు సహాయప్రత్తి విస్తరణాధికార్లు తోడ్పడుతారు. వారి ముఖ్య కార్యాలయాలు గుంటూరు, కడపలలో వున్నాయి.

వ్యవసాయ రసాయనిక వేత్త రసాయన శాస్త్ర విభాగానికి అధ్వర్యం వహిస్తారు. ఆయున ముఖ్యంగా దిగువ పనులను చేస్తారు. భూసారాలు, యెరువులు, మొక్కల పదార్థాలు, పశుగ్రాసం, సాగు నీరులను పరిశీలించి, విశ్లేషించడం, వరిపై సమన్వితమైన యెరువు ప్రయోగాలు జరపడం, పంటల కవసరమైన పోషక పదార్థాలనుగురించి పరిశీలించడం వగైరా.

కోడూరులోని ఫల ప్రవీణుడు ఫలాలపైన, హైదరాబాదులోని తోటపని నిపుణుడు కాయగూరల పైన పరిశోధనలు జరుపుతారు. ఉత్తమ పద్ధతులలో మొక్కల వృద్ధి, వాంఛనీయమైన గుణ స్వభావాలు గల రకాలను సమ్మిశ్రమ పరచడం, ఫలాలను నిలవచేయడం మున్నగునవి వారు ముఖ్యంగా చేసేపనులు. ఈపైన వారు వివిధ వ్యవసాయ పరిశోధన కేంద్రాలలో వృత్తము విత్తనాలు, నారు మొక్కలు, అంటు మొక్కలు మున్నగు వాటి వుత్పత్తి, పంపిణీల విషయంలో తోడ్పడుతారు కూడా.

చెఱకు నిపుణుడు చెఱకు పరిశోధనకి అధ్వర్యం వహిస్తారు. గ్రామీణ ఆర్థిక ట్రయల్సు, పోషకాహారాల పరిశీలన, వేర్వేరు సాగు నీటి పద్ధతుల క్రింద చెఱకు గుణధర్మాలలో కలిగే మార్పులు, కాటుక తెగులును ప్రతిరోధించే శక్తి మున్నగు విషయాలలో యీయన పరిశోధన చేస్తారు. చెఱకు లైజాన్ క్షేత్రంలో జరిగే చెఱకు అభివృద్ధి పనికి కూడా ఆయన, చెఱకును ప్రధానంగా పండించే

తాలూకాలలో ఒక సూపరింటెండెంటు, తదితర సిబ్బంది సహాయంతో, అధ్వర్యం వహిస్తారు. ఆపైన ఆయన చేతికు ఇనస్పెక్టర్ల సహాయంతో పంచదార ఫ్యాక్టరీల చట్టం అమలుకి సంబంధించిన పనిలో వ్యవసాయ శాఖ డైరెక్టరికి తోడ్పడుతారు.

ప్రభుత్వ కీటక శాస్త్రజ్ఞుడు, మైకాలజిస్టులు వరుసగా వ్యవసాయ కీటక శాస్త్రం, పుట్టగొడుగుల శాస్త్రానికి సంబంధించిన పనిని చూస్తారు. వారు ముఖ్యంగా పంటలని పీడించే వివిధ చీడ పురుగులు, వ్యాధుల్ని గురించి పరిశీలించి వాటికి తగిన విరుగుడును కనిపెట్టడానికై కృషి చేస్తారు. విస్తరణ విషయంలో, ఆరుగురు మొక్కల రక్షణ అధికార్లు వున్నారు. వారు రైతుల పొలాల్లో చీడలు, వ్యాధుల నివారణకై కృషి చేస్తారు. ఈశాఖ రెగ్యులర్ విస్తరణ సిబ్బందితో కలసి పని చేసే మొక్కల రక్షణ సహాయకులు జిల్లాలలో యీపనిలో వీరికి సహాయ పడతారు.

హైదరాబాదు లోని రాజేంద్రనగర్ ప్రధాన క్షేత్రం రాష్ట్ర వ్యవసాయ పరిశోధన సంస్థగా యేర్పరచ బడి, అభివృద్ధి చేయ బడుతున్నది. మా పరిశోధన నిపుణులలో చాలమంది ముఖ్య కార్యాలయాలు యీ కేంద్రంలోనే వున్నవి. ప్రాంతీయావసరాల నెదుర్కోడానికై రాష్ట్రంలో మరికొన్ని వ్యవసాయ పరిశోధన సంస్థల అభివృద్ధికై పథకాలు వున్నాయి.

## వ్యవసాయ శాఖ పనులు

ప్రదర్శన, ప్రచారాల ద్వారా వ్యవసాయంలో వుత్తమ పద్ధతుల్ని గురించి రైతులకు బోధ పరచడం, రైతులకు వారి దైనందిన వ్యవసాయపు పనులలో తోడ్పడ్డం, జరిగిన ప్రయోగాల ఫలితాలకి విపుల ప్రచారాన్నివ్వడం, వివిధ పంటల వుత్తమ విత్తనాల పంపిణీ సేంద్రియ, రసాయన యెరువుల వాడకాన్ని వ్యాప్తిలోనికి తేవడం, యివి వ్యవసాయ శాఖ ప్రధాన కర్తవ్యాలయి వున్నవి. ఈ శాఖ వ్యవసాయ పరికరాలను, పంపుసెట్లు, ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు, మున్నగు యంత్ర పరికరాలను కూడా రైతులకు యిచ్చి తోడ్పడుతుంది. పంటల చీడలు, వ్యాధుల నివారణకై యిది రక్షణ చర్యతీసుకుంటుంది కూడా. అప్పుడప్పుడు వివిధ వస్తువులపై మార్కెటింగు పరిశీలనలు జరుప బడతాయి. రైతులకు వారివాణిజ్య పంటల విషయంలో సరసమైన ధరలు కిట్టడానికి అవసరమైన సహాయం చేయబడుతుంది. కాబట్టి యీ శాఖ ముఖ్యమైన కర్తవ్యం వుత్పత్తిని పెంచి తద్వారా రైతుల సౌభాగ్యాన్ని వృద్ధిచేయడం. ఈ ఆశయ సిద్ధికై అది పైన పేర్కొన్న పనులన్నిటినే కాక యింకా వాటికి సహాయకరమైన యితర పనులను కూడా నిర్వహిస్తుంది.

## వ్యవసాయ విస్తరణ : ఆశయం, ప్రాముఖ్యాలు :

పరిశోధన ఫలితాల్ని ప్రత్యక్షంగా రైతుల పొలాల్లో ఆచరణలో పెట్టడం యీ విస్తరణ కార్యక్రమం ఆశయమై వున్నది. 'ప్రత్యక్షంగా చూపించి, ప్రచారం చేయడం ద్వారా దీనిని సాధించ వలసి వున్నది. మొదట రైతులకి కొత్త పద్ధతుల్ని గురించి తెలియ చెప్పాలి. వాటి నవలంబించమని వారికి నచ్చచెప్పాలి కూడా. సాంప్రదాయ సిద్ధమైన పద్ధతుల కలవాటు పడిన రైతులు కొత్త పద్ధతులు మంచివని, వాటిపై తాము ఆధార పడవచ్చుననే నమ్మకం కలుగనిదే వాటిని అవలంబించరు. వారి యీ వైఖరి సరైనదే కూడా. ప్రయోగ కేంద్రాలలో జరిగే విషయాలను అవగాహన చేసుకోగల సాధన సంపత్తి వారికి లేదు. ఈ విషయాలకి సంబంధించిన పుస్తకాలు కూడా చదువుకొన్న యేకొందరికోమాత్రమేవుపకరిస్తాయి. కాబట్టి రైతులు తనుంతతాము వచ్చి అడిగేవరకూ వేచివుండక యీ కొత్త పద్ధతులను వారి వద్దకు తీసుకువెళ్ళి ప్రదర్శించడం అవసరం. ఈ ఆశయంతో, గ్రామీణులు సమావేశమయ్యే అన్ని ముఖ్య సందర్భాలు, పండుగలలోను కూడా వ్యవసాయ ప్రదర్శనలు, ఫిలిమ్ ప్రదర్శనలు జరుపబడు తున్నవి.

## ప్రచార, విస్తరణ కార్యక్రమాల అంశాలు

వ్యవసాయ శాఖ జరిపే ప్రచార, విస్తరణ కార్యక్రమాలలో దిగువ అంశాలుంటాయి.

## I ప్రచారం

రాష్ట్రంలోని వివిధ వ్యవసాయ పరిశోధన కేంద్రాలలోను, బాపట్ల వ్యవసాయ కళాశాలలోను వివిధ వ్యవసాయ విషయాలలో పరిశోధన జరుగుతుంది. ఈ ఫలితాలను గురించి రైతులికి యీ శాఖ ప్రచార సిబ్బంది తెలియ జేస్తుంది. వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు లేక అసిస్టెంట్లు వ్యవసాయ పట్టభద్రులై వుంటారు. వీరు పరిశోధన కేంద్రాలు, రైతులమధ్య ప్రధానమైన లింకుగా వుంటారు. ఈ శాఖ సాధించిన వుత్తమరకం విత్తనాలు, వుత్తమ వ్యవసాయ పద్ధతులు మున్నగు వాటిని గురించి రైతులకు ప్రత్యక్ష ప్రమాణాలతో తెలియ చెప్పడం జరుగుతుంది.

### ట్రయల్ ప్లాట్లు

వ్యవసాయ పరిశోధన కేంద్రంలో జరిపిన ప్రయోగాలలో సఫలం అయిన వుత్తమ రకం స్ట్రైన్ లేక వ్యవసాయ పద్ధతి లేక యెరువు వాడకం పద్ధతి రైతు పొలంలో ప్రయోగాత్మకంగా "ట్రయల్ ప్లాట్ల"లో ప్రవేశ పెట్టబడు తుంది. దాని ప్రక్కనే స్థానిక పద్ధతి కూడా ప్రయోగాత్మకంగా అమలు పరచ బడుతుంది. ఈ "ట్రయల్ ప్లాట్లు" ఖచ్చితంగా ఆధునిక ఫీల్డు ప్రయోగాల కండిషన్ల ప్రకారం యేర్పాటు చేయబడతాయి.

### పరిశీలన ప్లాట్లు

ఖచ్చితంగా పై కండిషన్ల ననుసరించని ట్రయల్ ప్లాట్లను పరిశీలన ప్లాట్లు అంటారు. ఈ ప్లాట్ల వల్ల గణాంక విశ్లేషణ ప్రాతిపదికపై ఫలితాలను లెక్కకట్టడానికి వీలుండదు కాని కొంచెం యిటూ ఆటూలో శీఘ్ర నిర్ణయాలను తీసుకోడానికి వీలుంటుంది.

### ప్రదర్శన ప్లాట్లు

ఏదైనా ఒక వుత్తమ పద్ధతి ట్రయల్ ప్లాట్ల దశలో ఫలించినట్లయితే, అది రైతు పొలంలో పెద్ద పెద్ద ప్లాట్లలో ప్రదర్శించ బడుతుంది. ఈ ప్లాట్లకి ప్రదర్శన ప్లాట్లు అని పేరు. ఈ విధంగా వీటిని చూసిన తరువాత రైతులు తమ పద్ధతి, యీ కొత్త పద్ధతులలో యేది మంచిదో తెల్సుకోడానికి అవకాశం కలుగుతుంది.

### వ్యవసాయ సంఘాలు

రాష్ట్రంలోని పెక్కు తాలూకాలు, గ్రామాల లో రైతు సంఘాలు యేర్పడినవి. వీటి యేర్పాటును వ్యవసాయ శాఖ మొదటి నుంచీ ప్రోత్సహిస్తున్నది. వ్యవసాయ సమాచార వ్యాప్తి, ఆధునిక పద్ధతుల ప్రదర్శనల విషయంలో యీ రైతు సంఘాల తోడ్పాటును పొందాలనే వుద్దేశంతో వాటి యేర్పాటు ప్రోత్స హించబడు తున్నది.

## II ప్రచురణ

వ్యవసాయ శాఖ సమర్థించే వివిధ అభి వృద్ధులను గురించి ప్రజలకి తెలియ జేయడానికై దిగువ యేజన్సీల ద్వారా కృషి చేయ బడుతున్నది.

1. "పాడి పంటలు", వ్యవసాయ శాఖ చే ప్రకటింప బడే తెలుగు మాస పత్రిక.
2. గ్రామీణుల గైడ్ అండ్ కేలెండరు.
3 చిన్న చిన్న పుస్తకాలు.
4. మల్టిలిత్ మెషిన్ పై ముద్రిత మైన కరపత్రాలు.
5. ప్రదర్శనలు.
6. రేడియో ప్రసంగాలు.
7. ఫిలిమ్ ప్రదర్శనలు మున్నగునవి.

వ్యవసాయ శాఖ డైరెక్టరు కార్యాలయంలో ఒక ప్రచురణ విభాగం వున్నది. ఒక అసిస్టెంటు డైరెక్టరు (ప్రచురణ), ఒకవ్యవసాయ సమాచార అధికారి, 4 గురు అసిస్టెంట్లు, ఆర్టిస్టులు, ప్రొజెక్టర్ ఆపరేటర్లతో కూడిన సిబ్బంది యీ విభాగం పనిని చూస్తూంది. ఈ విభాగం ప్రదర్శనలు జరపడంలో కూడా తోడ్పడు తుంది. రాష్ట్ర, జిల్లా స్థాయిలలో అప్పుడప్పుడు వ్యవసాయ ప్రదర్శనలు జరుప బడతాయి. అపైన పెక్కు వ్యవసాయ పరిశోధన కేంద్రాలు సంవత్సరానికి రెండు సార్లు రైతుల దినోత్సవం జరుపుతాయి. వాటికి రైతులు ఆహ్వానించ బడతారు. ఈ విధంగా ఆయా కేంద్రాలు

సాధించిన వివిధ అభివృద్ధులను రైతులు స్వయంగా చూడ్డానికి అవకాశం కల్పించ బడుతుంది. వివిధ జిల్లాల్లో పంటల చీడలు, వ్యాధులను గురించి, వాటి నివారణోపాయాన్ని గురించి ప్రతివారం ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంనుంచి వార్తా ప్రసారం చేయ బడుతుంది. ఇదికాక అవలంభించ వలసిన వ్యవసాయ పద్ధతుల్ని గురించి ప్రతి నెల తప్పక ఫోల్డరు కార్డులు ప్రసారం చేయబడ తాయి. ఈ కార్యక్రమాలన్నిటికి సంబంధించిన వివరాలు దిగువ యివ్వబడినవి:

### i "పాడి పంటలు"

వ్యవసాయ శాఖ 14 సంవత్సరాల నుంచి "పాడి పంటలు" అనే తెలుగు మాస పత్రికను ప్రకటిస్తు న్నది. దీని సంవత్సర చందా రు. 2-4-0. విడి ప్రతివెల 3 అణాలు. దీనిని రాష్ట్రంలోని రైతులు బాగా వినియోగించు కుంటున్నారు. క్రమేణా యెక్కువప్రతులు ఖర్చవు తున్నాయి. వీటి ప్రస్తుతపుసంఖ్య నెలకి 50,000. దీనిలో వ్యాసాలు, సూచనలు మున్నగునవి చిత్రాల సహాయంతో వివరించ బడతాయి.

### ii గ్రామస్థుల పంచాంగము

ఇది వ్యవసాయ శాఖచే సంవత్సరాని కొకసారి తెలుగులో ప్రకటింప బడుతుంది. జిల్లాల్లో పండే పంటల సాగు, ప్రతి పంట విషయంలోను అందుబాటులో వున్న వుత్తమ రకం స్ట్రైనులు, ప్రతి జిల్లాకి సంబంధించిన ప్రత్యేకమైన వ్యవసాయ సమస్యల విషయంలో యిది బాగా వుపకరిస్తుంది. రాష్ట్రంలోని ప్రతి వ్యవసాయ పరిశోధన కేంద్రంలోను జరిగిన పనిని గురించి కూడా యిందులో వివరించ బడుతుంది. మొక్కల రక్షణ, తేనెటీగల పెంపకం మున్నగు విషయాలలో ఆచరణకి సంబంధించిన సూచనలు యివ్వబడుతాయి. అపైన దీని అనుబంధంలో తిథివార నక్షత్రాలతో కూడిన తెలుగు పంచాంగం వుంటుంది. దీని వెల 2 అణాలు మాత్రమే. ప్రతి సంవత్సరం యించుమించు 30,000 ప్రతులు ముద్రిత మవుతాయి.

### iii వ్యవసాయ శాఖ పుస్తకాలు.

వివిధ పంటలు, వ్యవసాయానికి సంబంధించిన ప్రత్యేక సమస్యలపై యీ శాఖ చిన్న చిన్న పుస్తకాలను కూడా ప్రకటిస్తున్నది. ఇవి లాభ నష్టాలు లేని పద్ధతిపై ఒక్కొక్కటి అణాన్నర నుంచి 3 అణాల వరకూ గల ధరకి విక్రయించ బడతాయి. దిగువ పేర్కొన్న 10 రకాల పుస్తకాలు తెలుగులో రకానికి 25,000 ప్రతుల చొప్పున ముద్రితమై, విక్రయానికి విడుదల చేయబడినవి. వాటి వివరాలు :

1. వరిసేద్యం, 2. చిరు ధాన్యాలు, 3. ప్రత్తి, 4. చెరకు. 5. వ్యవసాయ పరికరాలు, 6. పసుపు, 7. కర్ర పెండలం, 8. ఫలాలు, 9. చిలగడ దుంపలు, 10. సూనెగింజలు.

ఆంధ్ర రాష్ట్రంలో చీడపీడలు, వ్యాధుల నివారణ పద్ధతులను వివరించే పుస్తకం ఒకటి యీ శాఖచే ఇంగ్లీషులో కూడా ప్రకటించబడింది. విడి ప్రతి వెల 7 అణాలు మాత్రమే.

దిగువ విషయాలపై మరొక ఆరు పుస్తకాలు తెలుగులో ముద్రిత మవుతున్నాయి:

1. ఫ్రూటికల్చరు, 2. నానావిధ ఫలాలు, 3. కంచె మొక్కలు, 4. క్షారభూముల అభివృద్ధి, 5. ఆంధ్రలో కాయగూరల పెంపకం, 6. బంట కిరువైపులా నాటే చెట్లు.

1, 2, 3 పంపిణీకి సిద్ధంగా వున్నాయి.

### iv వ్యవసాయ సమాచార కరపత్రాలు.

భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం తోడ్పాటుతో రాష్ట్రంలో ఒక వ్యవసాయ సమాచార యూనిట్టు ఆరంభమై పని చేస్తున్నది. పై సంఘం యీ రాష్ట్రానికి ఒక డేవిడ్సన్ ఆఫ్ సెట్ మెషిన్‌ని వుచితంగా యిచ్చింది. అది హైదర్ గూడా లోని అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీరు కార్యాలయంలో స్థాపించబడి, ప్రచురణ విభాగంచే నడుప బడుతున్నది.

ఇంతవరకూ, దిగువ రకాల వ్యవసాయ సమాచార కరపత్రాలు ఒక్కొక్క రకానికి 1000 ప్రతుల చొప్పున మల్టిలిత్ మెషిన్ పై ముద్రితమై రాష్ట్రంలోని రైతులకి వుచితంగా పంపిణీ చేయబడినవి.

| వరుస సంఖ్య | కరపత్రం పేరు | భాష |
|---|---|---|
| 1. | ఇరక్టేస్ప్రేయర్ పాయింట్ | ఇంగ్లీషు |
| 2. | విత్తనాలు వరుసలో చల్లండి | ఇంగ్లీషు |
| 3. | జీడిమామిడి గింజలు డాలర్లను సంపాదిస్తాయి | ఇంగ్లీషు |
| 4 | యునర్ సాయిల్ | ఇంగ్లీషు |
| 5. | అర్ల్బాన్షూ నివారణ | ఇంగ్లీషు |
| 6. | మంచి కొబ్బరి నారు మొక్కల్ని నాటండి | ఇంగ్లీషు |
| 7. | మామిడి హాపర్ ని కంట్రోలు చేయండి | ఇంగ్లీషు |
| 8. | పోకచెక్కలు | ఇంగ్లీషు |
| 9. | తీవ్ర యెరువు వాడకం పథకం | తెలుగు |
| 10. | జొన్న | తెలుగు |
| 11. | మిర్చి | తెలుగు |
| 12. | ఫలవృక్షాల పెంపకం | తెలుగు |
| 13. | జపాను పద్ధతి వరిసాగు | తెలుగు |
| 14. | గ్రామీణ పెంట యెరువు | తెలుగు |
| 15. | మార్కెటు కమీటీల వుపయోగం | తెలుగు |
| 16. | మత్స్య పోషణ (I) | తెలుగు |
| 17. | పంటల పోటీ | తెలుగు |
| 18. | మత్స్య పోషణ (II) | తెలుగు |
| 19. | అరటి | ఇంగ్లీషు |

V రైతుల కన్వెన్షన్లు, యితర షోలు, ప్రదర్శనలు రాష్ట్ర స్థాయిని జరుప బడుతూ వుంటాయి. ప్రతి సందర్భంలోను వ్యవసాయ శాఖ సావనీరను ముద్రించి, ప్రజలకి అంద జేస్తుంది. నంద్యాల వ్యవసాయ పరిశోధన కేంద్రం స్వర్ణోత్సవం సందర్భంలో తయారైన స్వర్ణోత్సవ సంచిక, కాకినాడ లో జరిగిన వుద్యానవన ప్రదర్శన సందర్భంలో ప్రకటింప బడిన ఫ్రూట్ సావనార్, హైదరాబాదు లో జరిగిన పంటల పోటీ వుత్సవ సందర్భం లో తయారైన ప్రత్యేక సంచికలు ప్రజల ప్రశంసల నందు కొన్నవి.

జిల్లా లన్నిటిలోను ప్రదర్శనలు కూడా జరుప బడతాయి. వాటిలో వ్యవసాయ వస్తు సంపద ప్రముఖంగా ప్రదర్శింప బడుతుంది. అపైన వ్యవసాయ శాఖ ప్రతి యేటా హైదరాబాదు లో జరిగే అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనలోను ఢిల్లీ లో జరిగే రైతుల ఫోరం లోను కూడా పాల్గొంటున్నది.

## vi రేడియో ప్రసంగాలు

వ్యవసాయ శాఖ అధికార్లు ప్రతినెలా ఆలిండియా రేడియో కేంద్రంనుంచి ప్రసంగిస్తూ, ఆపై నెలలో అనుసరించ దగు వుత్తమ వ్యవసాయ పద్ధతుల్ని గురించి తెలియ జేస్తారు. వ్యవసాయం, దానికి చెందిన యితర విషయాలకి సంబంధించిన ప్రభుత్వ అభివృద్ధి పథకాలపై ప్రభుత్వ పౌరసంబంధాల శాఖ డైరెక్టరు యేర్పాటు చేసిన యితర ప్రసంగాలు కూడా అప్పుడప్పుడు చేయబడుతూ వుంటాయి.

## vii ఆంధ్ర వ్యవసాయ పత్రిక

ఆంధ్ర వ్యవసాయ పత్రిక రెండు నెలల కొకసారి బాపట్ల వ్యవసాయ విద్యార్థుల యూనియన్ చే ప్రకటింప బడుతుంది. రాష్ట్రంలో జరిగే పరిశోధనకి సంబంధించిన వివిధాంశాలు, యితర శాస్త్రీయ పత్రికలలోని ముఖ్యమైన భాగాలు యిందులో ప్రకటింప బడతాయి. ఇది శాస్త్రీయమైన పత్రిక అయినప్పటికీ దీని భాష సులభ శైలిలో వుండి చదువుకున్న రైతులకి సులువుగా అర్థం అవుతుంది. దీని సంవత్సర చందా రూ. 6/- విడిప్రతి వెల ఒక రూపాయి.

వ్యవసాయ శాఖ ముఖ్యమైన ప్రభుత్వ శాఖ. జాతి నిర్మాణ కార్యక్రమాలలో యిది సలిపే ప్రచారానికి చాలా ప్రాధాన్యత వున్నది. కాబట్టి

యీ శాఖ ప్రచురణ విభాగాన్ని ద్వితీయ పంచవర్షక కాలంలో పటిష్ఠమైన పద్ధతిలో యేర్పాటు చేయాలని సంకల్పించ బడింది. మొత్తం రాష్ట్రావసరాలను యెరుగ్గొన్న దానికి అవసరమైన ప్రచార సాధన సంపత్తికల ఎనిమిది ఎగ్జిబిషన్ వాన్‌లను తీసుకోడానికి సంకల్పించ బడింది. ఇది పూర్తి అయిన పిమ్మట ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని గురించి రాష్ట్రంలో మారుమూలవున్న గ్రామాలకి కూడా తెలియ చేయడం సాధ్య మవుతుంది.

## iii వ్యవసాయ ఇంజనీరింగు

వ్యవసాయ ఇంజనీరింగు విభాగం ట్రాక్టర్లు, బుల్‌డోజరు, ఆయిల్ ఇంజన్లు, విద్యుత్ మోటార్లను అదె కొనుగోలు పద్ధతిపై రైతులికి అంద జేస్తూ వుంటుంది. ఒక్క విద్యుత్ మోటర్లనుతప్ప పరికరాలలో మిగిలిన వాటి నన్నిటినీ అది రైతులికి అద్దెకి కూడా యిస్తుంది. ఈ విభాగంలో జరిగే పని వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి.

### 1. ట్రాక్టరు వర్కుషాపు

రాష్ట్రంలో, బాపట్ల, ఆదోనిలలో రెండు ట్రాక్టరు వర్కుషాపులు పని చేస్తున్నాయి. అవి ఆయా అసిస్టెంటు వ్యవసాయ ఇంజనీర్ల అధ్వర్యంలో నడుస్తున్నాయి. ఇవి గాక తెలంగాణా అవసరాల నిమిత్తం హైదరాబాదులో ఒక ట్రాక్టరు వర్కుషాపు వున్నది. ఈ వర్కుషాపులలో ముఖ్యంగా ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు, శకటాలు, పరికరాలకి మరమ్మతు మున్నగు పనులు చేయ బడతాయి. విడిభాగాలు కూడా తయారు చేయ బడతాయి.

### 2. పెట్రోలు పంపుసెట్లు

1956-57 లో వ్యవసాయ శాఖకి 19 పెట్రోలు పంపుసెట్లు వున్నాయి. అవి రైతులికి అద్దెకు యివ్వబడినవి.

### 3. ఆయిల్ ఇంజన్లు, విద్యుత్ మోటార్లు

1956-57 లో యీ శాఖకి 276 ఆయిల్ ఇంజన్లు వున్నాయి. అవి రైతులికి లిఫ్టు ఇరిగేషన్‌కై అద్దెకు యివ్వబడినవి. 16 హా. ప. లోపున గల సెట్లు రోజులో 8 గంటలు వాడుకోడానికి డ్రైవరుతో సహా అయితే రూ. 4/- డ్రైవరు లేకుండా అయితే రూ. 2/- అద్దెవసూలు చేయబడుతుంది. 16 హా.ప. అంతకు యెక్కువ శక్తిగల సెట్లకి రోజులో 8 గం. వాడకానికి డ్రైవరుతో సహా అయితే రూ. 5/- డ్రైవరు లేకుండా అయితే రూ. 3/- వసూలు చేయబడుతుంది.

ఆయిల్ ఇంజన్లు, విద్యుత్ మోటార్ల సరఫరా పథకం క్రింద 1956-57 లో 358 యూనిట్లు పంపిణీ అయినవి. అవి కావల న వారికి ప్రసిద్ధమైన ఫర్మ్ముల ద్వారా సరఫరా చేయబడినవి. డబ్బు నేరుగా ఆ ఫర్మ్ములకి చెల్లించ బడింది. ఒక్కొక్కరికి యివ్వదగు అప్పు గరిష్ఠ పరిమితి ఆయిల్ ఇంజన్ల విషయంలో రూ. 4,000/-, విద్యుత్ మోటార్ల విషయంలో రూ. 2,000/- అది వడ్డీ సగా 7, వార్షిక వాయిదాలలో చెల్లించ బడాలి. 1956-57 లో అద్దె కొనుగోలు పథకం క్రింద రైతులికి మొత్తం రూ. 4.56 లక్షల విలువగల 122 ఆయిల్ ఇంజన్లు, 99 విద్యుత్ మోటారు పంపుసెట్లు పంపిణీ చేయబడినవి. తెలంగాణా ప్రాంతంలో రైతులికి ఆయిల్ ఇంజన్లు తక్కావీ నిబంధనావళి ననుసరించి సరఫరా చేయబడతాయి. ప్రభుత్వ రెవిన్యూశాఖ అప్పుల్ని మంజూరు చేస్తుంది. వ్యవసాయశాఖ, ఆయిల్ ఇంజన్ల సరఫరా, వాటి స్థాపన మున్నగు పనుల ద్వారా వాటిని అమలు జరుపుతుంది.

## ఫిల్టర్ పాయింట్ గొట్టపు బావుల పథకం

ఈ పథకంక్రింద ఫిల్టర్ పాయింట్ల త్రవ్వకానికై రైతులికి రూ. 2,500 వరకూ అప్పులు యివ్వబడతాయి. వీటిపై 5 1/2% వడ్డీ విధించ బడుతుంది. వీటిని 5 సమానమైన వార్షిక వాయిదాలలో తీర్చవలసి వుంటుంది కొనుక్కునే వారు తమకి నచ్చిన ఆయిల్ ఇంజన్ లేక విద్యుత్ మోటారును యెన్నుకోవచ్చును. 1956-57 లో పంపిణీ యంత్రాల రూపంలో మొత్తం రూ. 2.74 లక్షల విలువగల 115 అప్పులు యివ్వబడినవి. వీటితో

11,50 ఎకరాలలో పని జరుగుతుందనీ, 575 టన్నులు అదనంగా వుత్పత్తి కాగలవని భావించ బడుతున్నది.

## 5. అద్దె కొనుగోలు పద్ధతిపై ట్రాక్టర్ల సరఫరా

1956-57లో పై పద్ధతి క్రింద మొత్తం రూ. 6.89 లక్షల విలువగల 41 ట్రాక్టర్లు సరఫరా చేయబడినవి. తొలి పంచ వర్ష ప్రణాళిక కాలంలో 229 ట్రాక్టర్లు సరఫరా చేయ బడ్డాయి.

## 6. ట్రాక్టర్లు, ట్రాక్టర్లతో భూమి దున్నడం

1956-57 లో వ్యవసాయ శాఖ ట్రాక్టర్లు 106, బుల్ డోజర్లు 92 జిల్లాల్లో పని చేశాయి. ఇవి భూమిని బాగు చేయడానికి దున్నడానికి అ కివ్వబడినవి.

## 7. భూసార పరిరక్షణ

1956-57 లో దిగువ భూసార పరి రక్షణ పథకాలు అమలులో వున్నాయి. (1) నల్ల రేగడ భూముల భూసార పరి రక్షణ పథకం. (2) అనంతపురం జిల్లాలోని యెర్ర నేల భూసార పరి రక్షణ పథకం. (3) తుంగ భద్ర ప్రాజెక్టు ప్రాంతపు మాగాణి ఆయకట్టు లెవెల్ సర్వే. (4) ప్రదర్శన ప్లాట్ల నిర్మాణం, భూసార పరి రక్షణ పద్ధతుల ప్రదర్శనకై పథకం. 5. తెలంగాణా ప్రాంతపు 9 జిల్లాల్లోను కాంటూర్ బండింగు పథకం. ఈ పథకాల క్రింద 1956-57 లో మొత్తం 1,857 యెకరాల విషయంలో పని జరిగింది.





*ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ నెహ్రూనగర్ కాలనీలోని ఒక కోయవానితో మాట్లాడు తున్నారు*

నెహ్రూనగర్ :

# కొత్త ఆది వాసి కాలనీ

మిస్టర్ టి. డబుయు. లాటూష్.

భారతదేశం గిరిజనులకి కొత్త సమస్యలు యేర్పడ్డాయనీ "ఒక విధంగా వారు మనకొక సవాలు" అని ఒకసారి ఇండియా ప్రధాన మంత్రి శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ పేర్కొన్నారు. ఈ సమస్యల్ని పరిష్కరించే టప్పుడు యీ ఆదివాసుల ప్రత్యేక లక్షణాల్ని కాపాడాలని కూడా ఆయన అదే సమయంలో హెచ్చరించారు. మైదానాలలోని ప్రజలతోను, ఆధునిక ఆర్థిక వ్యవస్థతోను సన్నిహితులు కావడంవల్ల గిరిజనులకి అపకారం జరిగిందని ఆయన అన్నారు. ధనాపేక్షులు తమ స్వలాభానికై వారిని వుపయోగించు కుంటున్నారని, అందువల్లనే భారత రాజ్యాంగంలో గిరిజన ప్రాంతాలకి ప్రత్యేకమైన వసతులు కల్పించ బడినవనీ ఆయన అన్నారు.



కొండరెడ్డి బాలిక



కాయిదా కాలనీలోని సహకార స్టోరు ముందర బారుతీరి నిలుచున్న కోయలు, కొండరెడ్లు.
వారి చేతిలో వున్నవి పాస్ పుస్తకాలు



*అడవి తోపులో వెదుళ్లు కొడుతున్న కోయమనిషి*

అవిభాజ్య హైదరాబాదు రాష్ట్రంలో దగ్గరగా యేడులక్షల మంది గిరిజనులున్నారు. గోండ్లు, చెంచులు, కోయలు, కొండరెడ్లు, కలములు, అంధాలు, భిల్లులు, పర్ధాను, తోటీలు అని వారు 9 జాతులుగా విభజింప బడ్డారు. ప్రధాని పేర్కొన్న యీ "సవాలు" ని యెదుర్కోడానికి మొట్ట మొదట పని ప్రారంభించిన రాష్ట్రం అవిభాజ్య హైదరాబాదు రాష్ట్రమే. గిరిజనులు, వెనుక బడిన తరగతుల పునరావాస కార్యక్రమాన్ని చేపట్టి, శాస్త్రీయ సిద్ధాంతాలు, మానవతా దృక్పధ ల ననుసరించి ఒక పద్ధతి ప్రకారం పనిచేయడం జరిగింది. ఈ పని 1946 లో ప్రారంభ మయింది. అప్పుడు ఆ ప్రముఖ మానవ శాస్త్రవేత్త బేరన్ క్రిస్టోవోన్ ఫ్యూరర్-హెమిన్‌డోర్ఫ్ ఆదేశం ప్రకారం ఒక సోషల్ సర్వీసు కేడర్ యేర్పాటు చేయబడింది. చాలా సంవత్సరాలపాటు ఆయన భార్యాసమేతుడై గిరిజనుల మధ్యకు వెళ్లి వారి జీవిత విధానాలు మున్నగు వాటన్నిటిని పరిశీలించారు. ఆ తరువాత సాంఘిక సేవా శాఖ యేర్పాటయింది. దాని మంత్రి కేవలం సాంఘిక సేవల బాధ్యతనే వహించేవారు.

## నమూనా కాలనీలు

అప్పటినుంచి గిరిజనులు, వెనుకబడిన తరగతుల అభివృద్ధికై పెక్కు పథకాలు అమలు జరప బడినవి. కొత్తగా యేర్పడిన ఆంధ్రప్రదేశ్‌లో ఆపని ద్విగుణీకృతోత్సాహంతో కొనసాగించ బడుతున్నది. ఇప్పుడు వివిధ ఆదివాసి జాతులకి ఆధునిక పద్ధతులలో నిర్మించబడిన ప్రత్యేకమైన కాలనీలు చాలా వున్నాయి. దేశంలోని యితర రాష్ట్రాలలో యిటువంటి కాలనీల నిర్మాణానికివి నమూనాలుగా వుపకరిస్తున్నాయి. ఇప్పుడు కొత్తగా నిర్మించబడే యిటువంటి కాలనీకి ప్రధానమంత్రి పేరిట నెహ్రూనగర్ అని పేరు పెట్ట బడింది. దీనికి ఆయన పేరు పెట్టడం యెంతో సముచితంగా వున్నది. ఎందుచేతనంటే, గిరిజనులు, వెనుకబడిన తరగతుల అభివృద్ధిపట్ల ఆయ



వెదుళ్లు గోదావరీ నదీతీరానికి రవాణా అవుతున్నాయి



కొయిదా సహకార స్టోరులో తిండివస్తువుల్ని కొనుక్కున్న కొందరు కోయలు, కొండరెడ్లు

నికి అమితమైన శక్తిసామర్థ్యాలున్నాయి. ఇది సుస్పష్టమైన విషయమే.

నెహ్రూనగర్ కాలనీ నిర్మాణం కొన్ని నెలల క్రిందట ప్రారంభమైనది. పని నిలకడగా కొనసాగుతున్నది. ఖమ్మం జిల్లా కొత్తగూడెం కోల్-టౌన్ నుంచి యించుమించు 6 మైళ్ల దూరంలో వున్న రాతిచెరవు గ్రామం సమీపాన గల 80 ఎకరాల స్థలంలో యిది నిర్మిత మవుతున్నది. ఇది వున్న రోడ్డుమీదుగా ప్రతి సవత్సరం భద్రాచలం శ్రీరామాలయానికి వేలాది యాత్రికులు ప్రయాణం చేస్తూ వుంటారు. నెహ్రూనగర్ కోయలు, హరిజనుల సమిష్టి కాలనీ. కేవలం ప్రభుత్వ కృషి తమ పరిస్థితుల్ని చక్కదిద్ద లేదని వారిలో చాలమంది గ్రహించి, కాలనీ కవసరమైన భూమికి తమ పట్టా హక్కుల్ని స్వచ్ఛందంగా స్వాధీనం చేశారు. పూర్తయే సరికి మొత్తం దీనిలో 40 కోయ, 40 హరిజన కుటీరాలుంటాయి. పాఠశాల, చేతివృత్తుల కేంద్రం, సహకార స్టోరు వంటి యితర సౌకర్యాలు కూడా వుంటాయి.

కోయలకి జాత్యభిమానం యెక్కువ. ఎంత యెక్కువంటే తాము హరిజనుల కంటే కాక బ్రాహ్మణుల కంటే కూడా అధికుల మనుకుంటారు! అందుచేత యీ రెండు జాతుల వారికి కాలనీలో ప్రత్యేకంగా వసతి కల్పించవలసి వస్తున్నది. మంచినీటి బావులు యెవరికి వారికి విడిగా యేర్పాటు చేయబడుతాయి. పూర్వం ఒక చోట నుంచి ఒక చోటికి తిరుగుతూ అరణ్యాన్ని తగలబెట్టి వ్యవసాయం చేసుకునే కోయలు యిప్పుడు భూములు గల రైతులుగా స్థిరపడ్డారు. హరిజనులలో మాత్రం అధిక సంఖ్యాకులు వ్యవసాయ కూలీలుగా కోయ భూస్వాముల క్రింద పని చేసారు. ఇప్పుడు వారు నెహ్రూనగర్ నిర్మాణానికి సమష్టిగా తోడ్పడ్డారు కనుకనూ, ఒకరి



కోయవారి 'బైసన్ హెడ్' నృత్యం

కొకరు దగ్గిరగా నివసిస్తారు కనుకనూ పరస్పరం బాగా అర్థం చేసుకుంటారనీ, జాతి వైషమ్యాలను విస్మరించి, సమష్టి కాలనీ తమకి గర్వకారణమనే భావంతో కలిసి మెలిసి జీవిస్తారనీ ఆశించ వచ్చును. సాంఘిక సేవా శాఖ హరిజన సంక్షేమ విభాగం కాలనీదార్లకి భూముల్ని ప్రత్యేకమైన మినహాయింపు షరతులపై కేటాయించింది సంవత్సరం క్రితం అరణ్య ప్రాయమై కొట్టు మిట్టాడుతున్న ప్రదేశం యిప్పుడు జీవ చైతన్యంతో కళ కళలాడుతున్నది. దీనికి చక్కని భవిష్యత్తు వున్నది

## గవర్నరు ఆగమనం.

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన సచార్ యీ సంవత్సరం జనవరి నెహ్రూనగర్ ని సందర్శించారు. అప్పుడు రమారమి 2,000మంది కోయలు, హరిజనులు కలిసి ఆయనకి ఘనమైన స్వాగతమిచ్చారు. కోయిలు మనోహరమైన గిరిజన నృత్య ప్రదర్శనం జరపారు. మద్య పానాన్ని విసర్జించి, తమ ఆర్థిక పరిస్థితి అభివృద్ధికై తయారు చేయబడిన పథకాల అమలుకై కృషి చేయమని గవర్నరు వారిని ప్రోత్సహించారు. ఏక కుటుంబీకుల లా కలిసి మెలిసి శాంతియుతంగా జీవించమని కూడా వారికి విజ్ఞప్తి చేశారు. ఆయన వారితో కలిసి మెలిసి సంచరిస్తూ నెహ్రూ నగర్ నిర్మాణానికి భూమి విరాళ మిచ్చినవారిని అభినందించారు.

ఇటీవల జరిగిన అగ్నిప్రమాదంలో గాలి చెరువు గ్రామంలో పెక్కుగృహాలు దగ్ధమైపోయాయి. అప్పుడు ఆ గ్రామ కోయ పెద్ద (హెడ్ మాన్) శ్రీ రాజ కన్నప్ప 8 యెకరాల భూమిని విరాళమిచ్చారు. గవర్నరు అభినందించిన వారిలో యీయన ప్రముఖుడు. తమ దర్శనార్థం 60 మైళ్లు నడచి వచ్చిన కోయలకి గవర్నరు, ప్రశంసా సూచకంగా, కొంత డబ్బును



*వయోజనులైన కోయవారు వ్రాత నేర్చుకుంటున్నారు*



*కోయ, కొండ రెడ్డి పిల్లలు పాడుతూ నృత్యం చేస్తున్నారు*

పంచిపెట్టారు. గవర్నరు సతి శ్రీమతి లలితా సచార్ కోయ, హరిజన స్త్రీ శిశువుల సమస్యలను, అవసరాలను గురించి తెలుసుకున్నారు. వారు ఆమెకు వినోద కాలక్షేపం సమకూర్చారు.

నెహ్రూనగర్‌కి యించుమించు 50 మైళ్ల దూరంలో వున్న కొయిదాలో గోదావరి లోయ సహకార గ్రామీణ అభివృద్ధి సంఘం అనే సంఘం ఒకటి వున్నది. గిరిజన అభ్యుదయ రంగంలో యిది మరొక ముఖ్యాంశం. ఇది 1947లో స్థాపించ బడింది. భారతదేశంలో యిటువంటి సంస్థ మరొకటి లేదట. అది కొయిదా గిరిజన కాలనీకి వుపకరిస్తున్నది. ఇక్కడ కోయలు, కొండరెడ్లు సమాన ప్రతిపత్తిపై నివసిస్తున్నారు. ఈ కాలనీవిస్తృతమైన వెదురు, కలప అడవుల మధ్య వుంది. ఈ సహకార సంఘం యేర్పడ్డానికి పూర్వం రాజమండ్రి కలప వ్యాపారుల జట్టు ఒకటి వెదుళ్లు, కలప కొట్టే వ్యాపారాన్ని గుత్తకు తీసుకొని, తద్వారా యీగిరిజనుల్ని అక్రమంగా తమ స్వలాభానికై వుపయోగించుకొనడం జరిగేది. ఈ సంఘం యేర్పడిన తరువాత యిదంతా కట్టుబడి పోయింది. ఇక్కడ వెదురుతోపుల్ని ప్రభుత్వం యీ సంఘానికి 5 సంవత్సరాలకి కౌలుకి ఇచ్చింది. ఈ కౌలును కావలిస్తే ప్రతి 5 సంవత్సరాలకి ఒకసారి పునరుద్ధరించుకోవచ్చును. ఈ సంఘంలో యిప్పుడు యించుమించు 400 మంది వాటాదార్లు సభ్యులుగా వున్నారు. దీనికి దాదాపు రూ. 60,000 పెట్టుబడి వున్నది.

ఆధునిక పద్ధతిలో ఆరోగ్యావసరాలకి తగిన సదుపాయాలతో నిర్మించ బడిన కొయిదా గిరిజన కాలనీలో 88 కుటీరాలున్నాయి. ఇది యిక్కడికివచ్చిన ప్రముఖుల ప్రశంసల నందుకున్నది. "భారతదేశంలో యెన్నో సాంఘిక సేవాకేంద్రాలను, ఇతర స్థలాలను దర్శించాను. కాని వాటన్నిటికంటె నాకు యిది చాలా నచ్చింది. దీనిలో నాకు యెక్కువ

విశ్వాసం కూడా యేర్పడింది. భారత దేశంలోని మరే ప్రదేశము యిది తెచ్చినట్టుగా నాకు డేనిష్ సహకార కేంద్రాల్ని స్ఫురణకి తేలేదు. మనోహరమైన యీ పచిక బయళ్లలో బాగా పాలిచ్చే జాతి ఆవులు యింకా యెక్కువగా వుండాలని మాత్రం నాకు వుంది" అని కోపెన్ హేగన్‌నుంచి వచ్చిన సీనియరు డబ్ల్యు. హెచ్. ఓ. ఆఫీసరు డా. హెచ్. కైజర్ నైల్సన్ యీ కాలనీని పరిశంసించారు. ఈ కాలనీ వాస్తవ్యులు వెదుళ్లను కొట్టి, యెడ్ల సహాయంతో గోదావరీనది తీరానికి చేరుస్తారు. ఇక్కడ నుంచి వాటిని ప్రవాహం వాలులో రాజమండ్రీకి పంపుతారు.

ఈ కాలనీ వాస్తవ్యుల జీవన ప్రమాణం బాగా హెచ్చింది. ఇప్పుడు వారు గ్రామంలోని యితర ప్రజలతో సమానంగా నిలవగలుగుతున్నారు. ఇందుకు రాష్ట్ర సాంఘిక సేవా శాఖ తోడ్పాటు, కోయలు, కొండరెడ్ల వుత్సాహము మూలకారణమై వున్నవి. వారికి కృతజ్ఞత. ఈ కాలనీ వాస్తవ్యులలో గ్రామోద్యోగులు, వుపాధ్యాయులు, అడవి గార్డులు, పోలీసు కానిస్టేబుళ్లు అంతా వున్నారు. వారిలో పెక్కురు మంచి రైతులు. ఎంతోమంది సింగరేణి, కొత్తగూడెం బొగ్గుగనులలో పని చేస్తున్నారు. వారికిప్పుడు తమహక్కులు అలాగే బాధ్యతలను గురించి చక్కగా తెలుసును. పూర్వంలా వారినిప్పుడెవరూ తమ స్వలాభానికై వినియోగించుకోలేరు.



23-2-1958 న హైదరాబాదులోని జూబిలిహాలులో రాష్ట్ర సమాజాభివృద్ధి కార్యక్రమాలపై చర్చాగోష్ఠి జరిగింది. ఆ సందర్భంలో కేంద్ర సమాజాభివృద్ధి శాఖామాత్యులు శ్రీ ఎస్. కె. డే ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తున్న దృశ్యం

# అభివృద్ధి కార్యక్రమ రంగంలో

అభివృద్ధి కార్యక్రమాల ద్వితీయ గోష్ఠి హైదరాబాదులోని జూబిలీహాల్లో 22-2-58 న జరుగవలసిన రాష్ట్ర సమాజాభివృద్ధి కార్యక్రమాల ద్వితీయ చర్చాగోష్ఠి స్వర్గీయ మౌలానా అబుల్ కలాం ఆజాద్ పట్ల గౌరవ సూచకంగా ఆ మరు నాటికి వాయిదా వేయబడింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభోపన్యాసం చేయ వలసి వుండెను. కానీ, అందరూ దుఃఖసాగరంలో మునిగివున్న తరుణంలో ప్రసంగాల ప్రసక్తి పనికి రాదంటూ ముఖ్య మంత్రి స్వర్గీయ మౌలానా ఆజాద్‌కి శ్రద్ధాంజలి ఘటిస్తూ ప్రవేశ పెట్టిన తీర్మానం యేకగ్రీవంగా ఆమోదించబడింది. సభ్యు లందరూ రెండు నిమిషాలపాటు మౌనం పాటించి లేచి నుంచున్నారు. వినోద కార్యక్రమాలు, విందులు వగైరా అన్ని రద్దుచేయబడి నట్లు ప్రణాళికల మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రకటించారు. చర్చలకై ఏర్పడిన గ్రూపుల కార్యనిర్వాహక పదవులలో కొన్ని చిన్నమార్పులను ప్లానింగ్ కార్యదర్శి శ్రీ సి. నరసింహంగారు ప్రకటించారు.

23 ఆదివారం నాడు ప్రారంభోత్సవ లాంఛనా లేమీ లేకుండా వివిధ గ్రూపులు చర్చలను ప్రారంభించినవి. సా. 4 గంటల తర్వాత చర్చలు

ముగిసిన కొద్ది సేపటికి సమాజాభివృద్ధి కేంద్రమంత్రి శ్రీ ఎస్. కె. డే ప్రతినిధుల సమావేశంలో ప్రసంగించారు. ఇకముందు యిటువంటి చర్చాగోష్ఠులు జరగవనీ, కొన్ని ముఖ్య విషయాలను చర్చించడానికై యేటా ఏదో నెలలో అభివృద్ధి కమిషనర్ల సమావేశాలు మాత్రం మామూలుగా జరుగుతాయనీ ఆయన పేర్కొన్నారు. సమాజాభివృద్ధికై ఆంధ్రలో శక్తివంచనలేకుండా కృషి జరుగుతున్నదని చెబుతూ, డబ్బు యింకా కొంచెం యెక్కువ ఖర్చు పెట్టబడాలన్నారు. ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విషయంలో బల్వంతరాయ్ కమిటీ చేసిన సిఫార్సుల్ని మినహాయింపులు లేకుండా తొలుదొల్త అంగీకరించినందుకు ఆంధ్రను ఆయన అభినందించారు. అభివృద్ధి కార్యక్రమాలలో వస్తున్న నూతన రీతులను అమలు పరుచుటలో వివిధ రాష్ట్రాల మధ్య సామ్యత సాధించాలని ప్లానింగ్, అభివృద్ధి శాఖామాత్యులు శ్రీ వి. బి. రాజుగారు చేసిన సూచనకు సమాధానమిస్తూ, బ్లాకు అభివృద్ధి యూనిట్‌గా వుండటం, బడ్జెట్ విధానము, బహుళార్థ సాధక కార్యక్రమాలు, సిబ్బంది వ్యవస్థ మొదలగు ప్రాథమిక సూత్రాలు ఒకటిగా ఉన్నంతవరకు, ఆచరణలో విభిన్నత్వం వున్నా రాష్ట్రాలలో ఏకలక్ష్యసాధన చైతన్యం వుండనే వుంటుందని శ్రీ డే తెలిపిచ్చారు.

24 సోమవారం ఉదయం ప్రణాళికల మంత్రి అధ్యక్షతన జరిగిన సాధారణ సమావేశంలో వివిధ గ్రూపుల నివేదికలు చర్చించ బడినవి. ఈ సందర్భంలో స్థానిక పరిపాలన మంత్రి శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి కూడా హాజరయారు.

అధికోత్పత్తి:- 1 వ గ్రూపు వ్యవసాయ అధికోత్పత్తిని, 2వ గ్రూపు పశుపోషణ, సహకారం, కుటీర పరిశ్రమలను, 3 వ గ్రూపు సాంఘికవిద్య, ఆరోగ్య పారిశుద్ధ్యాలు, సిబ్బంది శిక్షణలను, 4 వ గ్రూపు పోస్టు ఇంటెన్సివు బ్లాకులు, బహుళార్థ సాధక ప్రాజెక్టులు, అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు పాల్గొనడం, గ్రామదానాలను, 5 వ గ్రూపు బ్లాకు కౌన్సిళ్లను గురించి చర్చలు కొనసాగించినవి.

మొదటి గ్రూపు నాయకుడు శ్రీ ఎమ్. టి. రాజు వ్యవసాయాభివృద్ధి విషయంలో కొన్ని సూచనలు చేశారు. ప్రస్తుతం రైతులకు యిస్తున్న సాంకేతిక సహాయం వారిలో విశ్వాసాన్ని పెంపొందించేదిగా లేదనీ, వ్యవసాయ సంబంధమైన ఎక్స్టెన్షన్ ఆఫీసరుకు అవసరమైన యంత్రపరికరాలన్నీ సమకూర్చబడాలనీ, భూమి అభివృద్ధి ఒక్క రసాయనిక ఎరువుల పంపకం వంటి కార్యక్రమంలోనే గాక, అన్ని అంశాలలోనూ జరుగాలనీ ఆయన నివేదికలో పేర్కొన బడింది.

యిటువంటి చర్చాగోష్ఠులలో రెండు మూడు ముఖ్యాంశాల మీదనే దృష్టి కేంద్రీకరించాలనీ, తద్వారా ప్రజల దృష్టిని కూడా వాటి మీదికి మరలించటానికి సాధ్యమవుతుందనీ ప్లానింగ్‌మంత్రి పేర్కొన్నారు. ఏటేటా వందలాదిగా సిఫార్సులు చేసుకుంటూ వుంటే దానివల్ల ఆట్టే ప్రయోజనం వుండదన్నారు. శ్రీ ఎం. బాపినీడు రైతులకి అప్పులు శీఘ్రంగా యివ్వబడాలనీ, రసాయనిక యెరువుల నిరంతర వాడకం వల్ల భూమి బలహీనమయి పోతున్నది. కాబట్టి వ్యవసాయశాఖ దీనికి విరుగుడు కనిపెట్టాలనీ సూచించారు. పండ్లతోటలు, కూరగాయల తోటలను కూడా, రవాణా మార్కెటింగ్, నిలువ సౌకర్యాలు కల్పించి అభివృద్ధి పరచాలని పేర్కొన్నారు. మొక్కల సంరక్షణకై బ్లాకులన్నింటికీ కలిపి సాధారణ నిధిని ఏర్పాటు చేయాలని మరొకవ్యక్తి సూచించారు.

ఇప్పటిలాగా వ్యవసాయశాఖ ద్వారా కాకుండా, రసాయనిక ఎరువుల పంపిణీ ప్రైవేటు ఏజెన్సీల ద్వారా జరిగితే బాగుంటుందని కూడా సూచన జరిగింది. ప్రతి గ్రామ సేవకునికీ రెండు స్ప్రేయర్లు యివ్వాలనీ, వాటిని వినియోగించుటలో వారికి శిక్షణ యివ్వాలని, బీద రైతులకు అప్పులిచ్చుటకై ప్రతి జిల్లా కలెక్టరు వద్ద ఒక లక్ష రూపాయల మొత్తం వుంచాలని, సెక్యూరిటీ నిమిత్తం లేకుండా అవసరం వున్న రైతులకు సుమారు రూ. 200 లు అప్పుగా ఆయన యివ్వాలనీ కూడా సూచనలు చేయబడినవి.

సమిష్టి బాధ్యత మీద రైతులకు అప్పులు యిచ్చే మధ్య ప్రదేశ్ విధానిమును గురించి యీ సందర్భంలో పరిశ్రమల శాఖ డైరెక్టరు శ్రీ అనిల్‌డే ప్రస్తావించారు.

అడవులలో లభ్యమయ్యే పచ్చి ఎరువును స్వేచ్ఛగా తోలుకు పోనివ్వాలని చేసిన సూచనకు జవాబుగా అటవీశాఖ చీఫ్ కన్సర్వేటర్ ప్రసంగిస్తూ రైతులు తమకు అవసరమైన వాటిని మాత్రం తీసుకుని యితర మొక్కలను కొట్టకుండా, ఆవిధంగా అటవీ సంపద భద్రత విషయంలో జాగ్రత్త వహించ గలరేమో పరిశీలించాలని సూచించారు.

మైనర్ యిరిగేషన్, వ్యవసాయ పరికరాలు వగైరా అవసరాలకు సంబంధించి, తెలంగాణా లోని రెండు మూడు బ్లాకులలో సర్వే పరిశీలనలు జరగాలని ప్లానింగ్ మంత్రి సూచించారు.

గ్రూపులు చేసిన సిఫార్సులు మొత్తం మీద ఆమోదింపబడినవి. ఆ సిఫార్సులు ఇవి: సాధారణ లోపాలుగల భూముల విషయంలో విపులతరమైన, సమన్వితమైన పథకాలు తయారు చేయబడాలి. వాటి తయారీలో పురోగాములైన రైతుల అభిప్రాయాలను తీసుకోవాలి. సమాజాభివృద్ధి కార్యక్రమంలో వ్యవసాయోత్పత్తికి అధికతమ ప్రాధాన్యత యివ్వబడాలి. లైసెన్సు పొందిన ఉత్పత్తిదారుల ద్వారా విత్తనాల సప్లయికి చర్య తీసుకోబడాలి. ఆంధ్రలో రసాయన యెరువుల ఫ్యాక్టరీ స్థాపన అవసరాన్ని గురించి కేంద్ర ప్రభుత్వానికి మరొకసారి నొక్కి చెప్పాలి. రిజర్వు అడవుల నుంచి పచ్చియాకు యెరువు తెచ్చుకోడానికి పర్మిట్లు యిచ్చే అధికారాన్ని స్థానిక పంచాయతీ బోర్డులికి యివ్వాలి. నిర్బంధంగా పెంట యెరువు తయారీని చేపట్టడానికై పంచాయతీలకి, మునిసిపాలిటీలకి ఆర్థిక సహాయం చేయవచ్చు. జపాను పద్ధతి వరిసాగులో సన్నకారు రైతులకి ప్రోత్సాహాన్నివ్వడానికై తక్కావీ అప్పులు, రసాయన యెరువుల సప్లయిలో ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలి. మొక్కల రక్షణకై, మందులు, మందులు జల్లే సాధనాలు వగైరా రైతులకి సప్లయి చేయడానికై పంచాయతీలకి సహాయం చేయాలి. అభివృద్ధి కేంద్రాలు త్వరగా అప్పులు యివ్వడానికి వీలుగా అప్పులు యిచ్చే ప్రస్తుతపు విధానాన్ని సంస్కరించాలని సూచించబడింది. అభివృద్ధి కేంద్రాలలో విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమాన్ని శీఘ్రతరంగా నడపడానికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడాలనీ, తెలంగాణా ప్రాంతంలో ఆహారోత్పత్తితో సంబంధం గల గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా పనులకి చిన్న రకం నీటి పారుదల క్రింద వసతి లభింపజేయాలనీ సూచించబడింది.

జిల్లా కోళ్ల పెంపకం కేంద్రాలు :- 2వ గ్రూపు నాయకుడు శ్రీ జె. పి. ఎల్. గ్విన్. కొత్త అభివృద్ధి కేంద్రాలలో గుడ్లు పొదిగే కేంద్రాలకి బదులు జిల్లా కోళ్ల పెంపకం కేంద్రాలను ప్రారంభించాలని యీ గ్రూపు సూచించింది. జాతీయ వికాస సేవా కేంద్రాల బడ్జెటు క్రింద ప్రస్తుతం వ్యవసాయ ప్రయోజనాలకిచ్చే అప్పులు పాడి ఆవుల కొనుగోలుకి కూడా యివ్వబడాలని పశుపోషణ శాఖ డైరెక్టరు చేసిన సూచనని యీ గ్రూపు అంగీకరించింది. మత్స్య సంపద విషయంలో, మోటారు బోట్లు, నైలాన్ వలలు వగైరా వాడకాన్ని ప్రవేశ పెట్టాలని యీ గ్రూపు అభిప్రాయపడింది. చిరు చేపల పంపిణీలో జా. వి. వా, సమాజాభివృద్ధి బ్లాకులకు ప్రాధాన్యమివ్వాలని కూడా అభిప్రాయం వెలిబుచ్చబడింది. సహకారం విషయంలో తెలంగాణాలో సెక్యూరిటీల మీద అప్పులిచ్చే పద్ధతిని ఆంధ్ర పద్ధతికి సవరించాలనే ప్రతిపాదన పరిశీలించి, యీ సౌకర్యం తక్షణమే కలుగజేయబడాలని యీ గ్రూపు సూచించింది.

కుటీర పరిశ్రమలలో పనివారికి శిక్షణ యిచ్చుటలో లోగడ యీ పనులు చేస్తున్న వారి బిడ్డలకు ప్రాధాన్య మివ్వాలని, పరిశ్రమలు బాగా పెరిగిన ప్రదేశాల నుండి వారిని తీసుకోవాలని సూచన జరిగింది.

పై సూచనలను, యింకా మరి కొన్నిటిని సాధారణ సమావేశం ఆమోదించింది. చేపలు పట్ట డానికి ఉద్దేశించ బడిన చెరువులు సాధ్యమైనంత వరకూ పంచాయతీలకి అప్పగించ బడాలనీ, చిరు చేపలు శీఘ్రంగా పంపిణీ చేయబడాలనీ స్థానిక పరి పాలన మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి సమా వేశంలో ప్రసంగిస్తూ అన్నారు.

కుటీర పరిశ్రమల విషయంలో యెక్కువ అభి వృద్ధి జరుగలేదని అంటూ ప్రణాళికల మంత్రి శ్రీ వి. బి. రాజు శిక్షణా కేంద్రాల్ని సహకార సంస్థలకి అప్పగించాలన్నారు. పరపతి, మార్కెటింగ్, నిలువ సౌకర్యాలు బ్లాకు స్థాయిలో సమన్వయ పరచ బడాలని కూడా ఆయన సూచించారు.

బ్లాకు కౌన్సిళ్లు :- ఆ తరువాతి సమావేశం ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విషయంలో 5వ గ్రూపు చేసినసిఫార్సుల్ని పరిశీలనకి తీసుకున్నది. బ్లాకు అభివృద్ధి అధికారిని.అభివృద్ధి కేంద్రపు తదితర సిబ్బంది పూర్తిగా, సంక్రమించబడిన యీ బ్లాకు కౌన్సిలు క్రింద పని చేయాలని యీ గ్రూపు సూచించింది. బ్లాకు అభివృద్ధి అధికారి, అతని ద్వారా పనిచేసే జిల్లా సాయి సాంకేతిక సిబ్బంది క్రింద విస్తరణ సిబ్బంది పని చేయాలి.

ఈ కౌన్సిళ్లకి భూమి శిస్తులో తగినంత భాగం యివ్వబడాలని, పన్నులు వేయడానికి కూడా వాటికి కొన్ని అధికారాలుండాలనీ,పంచాయతేతర ప్రాంతా లకి, వెనుకబడిన తరగతులకి వీటిలో ప్రాతినిధ్యం యివ్వబడాలనీ సూచించ బడింది. జిల్లా కౌన్సిళ్ల విషయంలో రెండు రకాల అభిప్రాయం వ్యక్తం చేయబడింది. అభివృద్ధి కేంద్రేతర ప్రాంతాల నిర్వ హణ యధాప్రకారం ఆంధ్ర ప్రాంతంలో ప్రత్యే కాధికారుల క్రిందా, తెలంగాణా ప్రాంతంలో జిల్లాబోర్డుల క్రిందా కొనసాగాలనేది ఒక అభి ప్రాయం. అభివృద్ధి కేంద్రాలు, తదితరమైన ప్రాంతాలు రెండిటి విషయంలోను కూడా జిల్లా కౌన్సిలు పనిచేయాలనీ, దానిలో అభివృద్ధి కేంద్రే తర ప్రాంతాల ప్రతినిధులు కూడా వుండాలనేది రెండవ అభిప్రాయం.

నిర్ణయాలు చేయడానికీ, వాటిని అమలు జరప డానికీ కూడా కొత్తబ్లాకు కౌన్సిళ్లకి అధికారా లుంటాయని యీ సిఫార్సులపై సాధారణ సమా వేశంలో ప్రసంగిస్తూ స్థానిక పరిపాలన మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అన్నారు. పంచాయతేతర ప్రాంతాల్లో నైనా కూడా ప్రతినిధులను నామినేట్ చేయటం ప్రభుత్వం చేయదగిన పని కాదన్నారు. భూమి శిస్తులో 12 శాతం పంచాయతీలకు యిచ్చి, దానిని తిరిగి కేంద్రం నుండి రాబట్టుకోవాలని ఆయన సూచిం చారు. జిల్లా కౌన్సిళ్లకు పన్నులు విధించే అధి కారాలు ఎక్కువగా యివ్వాలని కూడా ఆయన పేర్కొన్నారు.

కొత్త కౌన్సిళ్లు ఏర్పడ్డానికి, గ్రామ సేవకుల, బి. డి. ఒ. ల బాధ్యతలు సంస్థపరం చేయబడాలనీ, ఒక్కొక్క బ్లాకుకు రూ. 6 లక్షల బడ్జెట్ వరకు వుండవచ్చుననీ శ్రీ వి. బి. రాజుగారు సూచించారు.

జిల్లా సాంకేతిక అధికారులకు తమ సిబ్బందిపై బి. డి. ఒ. ల ద్వారా అజ్మాయిషీ చేయటం సాధ్యం కాదని పశు పోషణ శాఖా డైరెక్టరు వెలిబుచ్చిన అభిప్రాయానికి సమాధానం చెప్తూ బి. డి. ఒ. ల ద్వారా ఉత్తర ప్రత్యుత్తరాలు మాత్రమే జరుగుతుంటవనీ, అంతకు మించి ఏమీ ఉండదనీ ప్లానింగ్ కార్యదర్శి అన్నారు. సిఫా ర్సులో అవసరమైతే తగు మార్పులు చేసుకో వచ్చునని ప్లానింగ్ మంత్రి పేర్కొన్నారు.

పంచాయతీలు సక్రమంగా పని చేస్తుండ నప్పటికీ, వాటిని ఏదో విధంగా అభివృద్ధిలోకి

తీసుకురావలసిన అవసరం కలదని స్థానిక పరి పాలన శాఖ ఇనస్పెక్టరు జనరల్ తమ ప్రసంగంలో పేర్కొన్నారు. సాంఘిక విద్య, ప్రచారం, పారిశుధ్యం, శిక్షణమున్నగు విషయాలలో 3 వ. గ్రూపు చేసిన సిఫార్సులు పరిశీలించ బడినవి. ప్రచార మివ్వాలని శ్రీ రాజుగారు సూచించారు. జిల్లాల్లోని పబ్లిసిటీ అసిస్టెంట్లు స్థానికంగా సాధించిన విజయాలకి 4 వ గ్రూపు చేసిన సిఫార్సులు ఆమోదించ బడినవి. 25 శాతం ప్రజల విరాళం సూత్రం కూడా కష్టంగా వున్న ప్రాంతాలు వున్నాయనీ, యీ సూత్రాన్ని సడలించాలని యీ గ్రూపు అభిప్రాయపడింది

## జిల్లా కలక్టర్ల సమావేశం

24-2-1958 మధ్యాహ్నం 3.30 గం.కి జూబ్లీ హాలులో ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి గారు కలక్టర్ల సమావేశాన్ని ప్రారంభించారు. కలక్టర్లు ముఖ్యంగా అధికాహారోత్పత్తి, చిన్న మొత్తాల పొదుపు ఉద్యమము, పొదుపు, అవినీతి నిర్మూలనకి ఉత్తమ మార్గం, యీ నాలుగు విషయాల్ని చర్చించాలని ఆయన తమ ప్రసంగంలో పేర్కొన్నారు. ఆంధ్రప్రదేశ్ ఆహార విషయంలో లోటు ప్రదేశం కాదని,అయితే యీవిషయం ప్రాంతీయ దృక్పథంతో కాకజాతీయ దృక్పథంతో పరిశీలింపబడాలనీ ఆయన అన్నారు. ద్వితీయ ప్రణాళిక పెట్టుబడి కవసరమైన ధన సేకరణ రెండవ సమస్య అన్నారు. ప్రభుత్వం ప్రతి సంవత్సరము బడ్జెటులో లోటును ఉంచ లేదనీ, అందువల్ల అవకాశంవున్న యితరవిధాలరాబడి పెంచ బడుతుందనీ అన్నారు. రాష్ట్రంలో చిన్న మొత్తాల పొదుపు ఉద్యమముద్వారా సుమారు గరిష్ఠం 8కోట్లు రావాలని నిర్ణయించబడిందనీ, అయితే ఆదిలాబాదు



*24-2-1958 న. జూబిలీహాలులో జిల్లాకలక్టర్ల సమావేశంలో ప్రసంగిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి*

చిత్తూరు జిల్లాలవంటి వెనుకబడిన జిల్లాల్లో నిర్ణీతమైన గరిష్ఠ మొత్తాలకు పూర్తిచేయడమో లేక ఆమొత్తాలకి మించి వసూలు చేయడమో జరగ్గా, పురోగాములనబడే కోస్తా ఆంధ్ర జిల్లాలు యీవిషయంలో బాగాపని చేయలేదని అన్నారు. ఇందుకు ప్రజల సహకారం లేదనే కారణం చెప్పబడుతోంది. దీనికి కారణమేమిటో కలెక్టర్లు ఆలోచించాలి. ఒక వేళ పరిపాలనా పద్ధతులలో యేమైనా మార్పులు అవసరమైతే, వాటిని చేయాలి అని ఆయన అన్నారు.

పరిపాలనలో వృధా ఖర్చును జరుగనీయరాదన్నారు. తెలంగాణా కలెక్టర్లకి మరికొంత సిబ్బంది కావాలని ఆయన అంగీకరించారు.

అవినీతి కొందరు అన్నంత ఎక్కువగా లేకపోయినప్పటికీ అసలు అది ఉన్నదని, దానిని తొలగించాలని కూడా ముఖ్యమంత్రి పేర్కొన్నారు. రెవెన్యూ బోర్డు రెండవ సభ్యుడు శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యం, ఐ. సి. ఎస్. మాట్లాడుతూ చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంపట్ల ప్రజలకి శత్రుత్వం లేదుగాని నిర్లక్ష్యభావమున్నట్టు ఆసందర్భంలో తాముజరిపిన పర్యటనలో తమకు బోధపడిందని వివరించారు. ప్రస్తుత వసూళ్ల పరిస్థితి ప్రకారం 1958 మార్చి నెలాఖరుకి మొత్తం రూ. 5 కోట్లు వసూలు కావచ్చన్నారు. 'ధనిక జిల్లాలు' సాంఘికంగా వెనుకబడి ఉన్నాయని, అంటూయీవిషయంలో ప్రచారం ప్రభుత్వసిబ్బంది ద్వారాకాక ప్రజానాయకులచే జరుపబడాలన్నారు. ఒకటి రెండు జిల్లాల్లోతప్ప, ప్రస్తుతం అనధికారులెవరూ యీ ఉద్యమంలో కృషి చేయటంలేదని ఆయన పేర్కొన్నారు.

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంలో డబ్బు వసూలు చేయడంలో తాము ఎదుర్కొనే కష్టాలను చాలామంది కలెక్టర్లు వివరించారు. సహకార సంఘాల రిజిస్ట్రారు యీ విషయంలో కొంతవరకు బాగా కృషి చేయవచ్చునని ప్లానింగ్ కార్యదర్శి సూచించగా, ప్రజలనుండి ఎక్కువగా డబ్బు వసూలు చేసే తమ శాఖకుకూడా ఇబ్బందులు వున్నవనిఆయనసమాధానమిచ్చారు. ఈ విషయంలో సహకారశాఖ కృషిచాలా తక్కువగా ఉందని ముఖ్యమంత్రి అభిప్రాయం వెలిబుచ్చారు.

## ప్రత్యేక కమిటీల ఏర్పాటు సూచన

ఈ ఉద్యమప్రచారానికి కలెక్టర్లు ప్రత్యేక కమిటీలు ఏర్పాటు చేసుకొని కృషిచేయాలని సహకార మంత్రి సూచించారు. అడిగిన వారినేపదేపదే అడగటం మంచిదికాదనీ వసూళ్లరంగాన్ని విస్తరించుకోవాలనీ స్థానిక పరిపాలన శాఖామంత్రి సూచించారు. ప్రజానీకాన్ని ఉద్యమంలోనికి ఆకర్షించటానికివిశ్వైన ఏజెన్సీలను కలెక్టర్లు ఏర్పాటుచేసుకోవాలనికూడా ఆయన పేర్కొన్నారు. ఈ సందర్భంలో వివిధ ప్రభుత్వశాఖాధిపతులకున్కూడా గరిష్ఠ మొత్తాలను నిర్ణయించి పనిచేయించాలని కొందరు కలెక్టర్లు సూచించారు. అంతేకాక పోస్టల్ శాఖ ద్వారా ఇంకా ఎక్కువ సౌకర్యాలు కల్పించుకోటానికి, కేంద్రప్రభుత్వాన్ని కోరాలనికూడా వారు సూచించారు.

తరువాత మైనర్ ఇరిగేషన్ సమస్యలు చర్చించబడినవి. పి. డబ్ల్యు. డి ప్రమాణాలతో నిమిత్తంలేకుండా తెలంగాణాలోని చెరువులకు చౌకగానూ, త్వరగానూ మరమ్మతులు చేయించవచ్చునని ఇరిగేషన్ చీఫ్ ఇంజనీరు సూచించారు.

చెరువులుబాగుచేయించటానికి ఎస్టాబ్లిష్మెంటు ఖర్చులు ఇతరచోట్ల 11 శాతం మాత్రమే అవుతూ వుండే తెలంగాణాలో 25 శాతం అవుతున్నవనీ 200 ఎకరాలలోపు ఆయకట్టుగల చెరువులను ఆంధ్రలోవలెనే రెవిన్యూశాఖకు బదిలీ చేయవచ్చుననీ రెవిన్యూమంత్రి సూచించారు. ఇప్పటికంటే త్వరగా చెరువుల మరమ్మతు జరగటం తెలంగాణా ప్రాంతంలో అత్యవసరమని ఆయన పేర్కొన్నారు.

## సహకార వ్యవసాయ క్షేత్రాలు

సహకార వ్యవసాయంవిషయంలో, ప్రభుత్వ భూములన్నీ సహకార వ్యవసాయానికై నిర్దేశించ

బడాలని సహకార మంత్రి సూచించారు. ఈ విషయంలో స్థానిక పరిపాలన, పరిశ్రమల మంత్రులు కూడా సూచనలు చేశారు. సమిష్టి వ్యవసాయ విధానానికి మన దేశం ఇంకా తయారుగా లేదని స్థానిక పరిపాలన మంత్రి అన్నారు. సహకార క్షేత్రాలలో చేరాలంటే రైతులకు ప్రోత్సాహకరమైన లాభం కనిపించాలని, మార్కెటింగ్, పరపతి సౌకర్యాలు, నిలవ సౌకర్యాల ఏర్పాటుకు ప్రతి ఇంటెన్సివ్ బ్లాకులో ఒక సహకార సంస్థ నిర్మించబడాలనీ ప్లానింగ్ మంత్రి పేర్కొన్నారు. తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాల్లో ట్రాక్టరు రేట్లు సమానం చేయాలనే, సూచన రాగా రూ. 18 లక్షలు కేటాయించటానికి ప్రయత్నం జరుగుతున్నదని వ్యవసాయ శాఖ డైరెక్టరు తెలియజేశారు.

స్థానికాభివృద్ధి విషయంలో, ఆఖరికి 11 ఆంధ్ర జిల్లాల్లో జరిగిన కృషి కూడా సంతృప్తికరంగా లేదని ప్లానింగ్ శాఖ కార్యదర్శి అన్నారు. వచ్చే రెండు నెలల్లో పనులు త్వరగా చేయించాలని ఆయన కలెక్టర్లకు విజ్ఞప్తి చేశారు. కేటాయింపులను మించి రూ. 10 లక్షలైనా ఎక్కువ ఖర్చు చేయవచ్చునని ఆయన సూచించారు.

కమతాల ఏకీకరణ విషయంకూడా చర్చించబడింది. ముఖ్యమంత్రి శాసన సభకి వెళ్లిన తరువాత అధ్యక్షత వహించిన రెవిన్యూ మంత్రి అక్కడ సమావేశమైన కలెక్టర్లు, తదితర ఆఫీసర్లకి కృతజ్ఞత తెలిపి, యీ చర్చల ఫలితంగా కొన్ని కార్యక్రమాలు శీఘ్రగతిని కొనసాగగలవని ఆశించారు.

**ఆశాజనకమైన ఆర్థిక పరిస్థితి :**

# మిగులు బడ్జెట్టు

**"1954-55 లో రూ. 19.82 కోట్ల రెవిన్యూ రాబడితో ఆంధ్రరాష్ట్రం ప్రారంభ మయినది. ఈ సంవత్సరం, ఆంధ్రప్రదేశ్‌లో అది రూ. 63.66 కోట్లకి మించగలదని భావిస్తున్నాం. అయితే యిందులో తెలంగాణా ప్రాంతం నుంచి వచ్చిన రాబడి కూడా, చాలా పెద్దభాగం చేరివున్నది. పారిశ్రామిక వస్తూత్పత్తి యింకా కొంచెం హెచ్చి, గనుల త్రవ్వకం పనులు అనుకున్న ప్రకారం సాగిపోయినట్లయితే, వచ్చే మూడు లేక నాలుగు సంవత్సరాలలో మనం ఒక నూరుకోట్ల రెవిన్యూబడ్జెటును లక్షించక పోవడానికి కారణమేమి కనబడదు". అని 26-2-1958 న ఆంధ్రప్రదేశ్ శాసన సభలో మిగులు బడ్జెటును సమర్పిం చిన ఆర్థికశాఖామాత్యులు డా. బి. గోపాలరెడ్డి అన్నారు.**

ఆయన యింకా యిలా అన్నారు: "గడచిన సారి నేను బడ్జెటు ప్రసంగం చేసినప్పుడు మన ఆర్థిక పరిస్థితిని నిరుత్సాహకరంగా చిత్రించాను. కాని వచ్చే సంవత్సరానికి మిగులు బడ్జెటును సమర్పించడం వల్ల యిప్పుడు నాకు కొంచెం వుత్సాహంగా వున్నది. ఆంధ్ర రాష్ట్రం యేర్ప డినది మొదలు బడ్జెటులో యెప్పుడూ లోటు వస్తున్నది. ఈ సంవత్సరం మొట్టమొదటి సారిగా మిగులు బడ్జెటును సమర్పిస్తూ ఆశాజనకమైన రీతిలో చేసే ప్రసంగాన్ని మీరు వింటున్నారు. మన పన్నుల విధానం మొత్తం మీద బాగున్నది. ఆర్థిక విచారణ సంఘం సిఫార్సులు కూడా మన చిక్కుల్ని తొలగించుకోడానికి బాగా తోడ్పడ్డాయి. అయితే మన లావాదేవీల (వేస్ అండ్ మీన్సు) పరిస్థితి మాత్రం యెప్పటిలా అధ్వాన్నంగానే వున్నది. అప్పులు లేక స్వల్ప మొత్తాల పొదుపు ద్వారా తగినంత సొమ్ము లభిస్తేనే అన్నిరకాల ఆందోళనలనుంచి మనకి విముక్తి లభిస్తుంది. మన ప్రణాళిక కాలంలోని ఆఖరి రెండు సంవత్సరాల లోను మళ్లీ మనకి కొన్ని కొత్త చిక్కులు యేర్పడితే యేర్పడ వచ్చును. కాబట్టి తాత్కా లికమైన యీ మిగులుతో సంతృప్తి చెందక, సమీప భవిష్యత్తులోని అవసరాల విషయంలో జాగ్రత్త వహించాలని గౌరవ సభ్యులికి చెబు తున్నాను. మన కష్టాలను అర్థం చేసుకుని, యీ అయిదు సంవత్సరాలలోను భారత రాజ్యాం గం 275 (1) ఆర్టికల్ క్రింద సంవత్సరానికి నాలుగు కోట్ల రూపాయల చొప్పున గ్రాంటు యిన్ ఎయిడ్‌గా యివ్వాలని ఆర్థిక విచారణ సంఘం కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేసినది. ఇందుకు, యీ అవకాశాన్ని పురస్కరించుకుని, ఆ సంఘం అధ్యక్షుడు శ్రీ కె. సంతానానికి, ఆయన సహచరులికి కృతజ్ఞత తెలుపుతున్నాను.

"రాబడి పన్ను (కార్పొరేషను పన్ను, రాబడి పన్ను మీద సర్‌ఛార్జి మినహా) విభజన యోగ్య మైన నిధినుంచి రాష్ట్ర ప్రభుత్వానికి వచ్చేవాటా 55 శాతంనుంచి 60 శాతానికి హెచ్చించ బడింది. ఆంధ్రప్రదేశ్ వాటా రాష్ట్రాలకి కేటాయించబడే సొమ్ములో 8.12 శాతంగా నిర్ణయించబడింది. ఇంతకు ముందు యిది 8.01 శాతంగా వుండేది. రాష్ట్రాలకి వాటా యివ్వవలసిన కేంద్ర యెక్సైజు సుంకాలు విధించబడే సరుకుల జాబితా విస్తరింప చేయబడినది. దానిలో యిప్పుడు పొగాకు, అగ్గిపెట్టెలు, పంచదార, తేయాకు, కాఫీ, కాగితం, వనస్పతి నాన్ యెసెన్షియల్ నూనెలు కూడా చేర్చబడినవి. అయితే యీ

వసూళ్లలో రాష్ట్రాలికి వచ్చే శాతం మాత్రం 40 నుంచి 25కి తగ్గించబడింది. ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌కి దీనిలో 9.33 శాతం వస్తుంది. పూర్వం యిది 8.9 శాతంగా వుండేది.

తరచు తలంపుగా వచ్చే వరదలు, కరువులు మున్నగు ప్రకృతి సహజమైన ప్రమాదాలను యెదుర్కోడానికి యేర్పాటు చేయబడగల నిధికి ప్రతి రాష్ట్రము తగినంత సొమ్మును (ఆంధ్ర ప్రదేశ్ విషయంలో సంవత్సరానికి రూ 75 లక్షలు సూచించబడింది) కేటాయించాలని కూడా ఆర్థిక విచారణ సంఘం సూచించింది.

ఎస్టేటు సుంకం ద్వారా వచ్చేరాబడి పంపకం విషయంలో ఆర్థికవిచారణ సంఘం స్పష్టమైన సూత్రాలను నిర్ణయించింది;

1. ప్రతి రాష్ట్రం లోనుగల స్థిరాస్తి మొత్తం విలువ ప్రాతిపదికపై,

2. రాబడి స్థిరాస్తి కాని ఆస్తికి సంబంధించినంత వరకూ జన సంఖ్యా ప్రాతిపదికపై.

రైలు ఛార్జీలమీద పన్నుద్వారా వచ్చేరాబడి, మిల్లువస్త్రాలు, పంచదార, పొగాకుల మీద యింతవరకు అమ్మకం పన్నుకి బదులు అదనంగా విధించబడిన కేంద్రయెక్సైజు సుంకాల ద్వారా వచ్చే రాబడులను రాష్ట్రాల మధ్య పంపకం చేయడంలో వర్తించే సూత్రాలను కూడా యీసంఘం నిర్ణయించింది. అయితే యీఅదనపు కేంద్రఎక్సైజు సుంకాల వల్ల వచ్చే రాబడి అమ్మకం పన్నురద్దువల్ల యేర్పడే నష్టాన్ని భర్తీ చేసుకోడానికి సరిపోతుంది.

"ద్వితీయ ఆర్థిక విచారణ సంఘం సిఫార్సుల వల్ల రాష్ట్ర ఆర్థిక పరిస్థితిలో మొత్తం మీద కలిగే అభివృద్ధి దిగువ విధంగా వుంటుంది.

| | కోట్ల రూపాయలలో 1957-58 బడ్జెట్టు | 1957-58 సవరించిన | 1958-59 బడ్జెట్టు |
|---|---|---|---|
| 1. రాబడి పన్నులో వాటా ... | 4.88 | 5.95 | 6.25 |
| 2. కేంద్ర ఎక్సైజు సుంకాలలో వాటా... | 1.71 | 2.69 | 2.79 |
| 3. గ్రాంటు యిన్ ఎయిడ్ ... | 0.24 | 4.00 | 4.00 |
| 4. రైలు ఛార్జీల మీద పన్ను ... | ... | 0.46 | 0.86 |
| మొత్తం ... | 6.83 | 13.10 | 13.88 |

"15-8-1947, 31-3-1956 మధ్య కేంద్రప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకిచ్చిన అప్పులలో నిర్వాసితుల పునరావాసానికై యిచ్చిన అప్పులు, వడ్డీలేని అప్పులు మినహా మిగిలిన వాటన్నిటిలో 31-3-1957 నాటికి బాకీవున్న వాటిని రెండు రకాలుగా యేకీకృతం చేసి వాటిపై ½ శాతం 3 శాతం వడ్డీవిధించి, వాటిని 15 సంవత్సరాలు, 30 సంవత్సరాల తరువాత తీర్చడానికి అవకాశం కల్పించాలని ద్వితీయఆర్థిక విచారణసంఘంసిఫార్సు చేసింది. కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలకి యిచ్చే అప్పుల్ని తిరిగి చెల్లించవలసిన కాలం, వడ్డీ రేట్ల విషయంలో గల యేర్పాట్లను సులభంచేసి, ఆ అప్పుల పై రాష్ట్ర ప్రభుత్వాలు చెల్లించవలసిన వడ్డీ భారాన్ని తగ్గించటానికై పై సిఫార్సు చేయబడింది. కేంద్ర ప్రభుత్వం మొదట కేంద్ర ఋణాల యేకీకరణకి సంబంధించినపై యేర్పాట్లతో సహా ఆర్థిక విచారణ సంఘం చేసిన సిఫార్సులన్నిటిని తాను అంగీకరించినట్టు ప్రకటించింది. అయితే, ఆ తరువాత మళ్లీ యీ ఒక్క సిఫార్సు యింకా పరిశీలించబడుతున్నదని, యీ విషయంలో తుది నిర్ణయం జరిగే వరకూ, కేంద్ర ఋణాల విషయంలో గల ప్రస్తుతపు యేర్పాట్ల ప్రకారం అసలు వడ్డీలు యథాప్రకారం చెల్లించబడాలని

తెలియ చేయబడింది. కాబట్టి వడ్డీ తగ్గింపు వల్లను, అసలు చెల్లించక పోవడం వల్లను మిగుల గలదని భావించిన సొమ్మును 1957-58 సవరించిన అంచనాలలో కాని 1958-59 బడ్జెటు అంచనాలలో కాని లెక్కవేయ లేదు. పునఃపరిశీలన తరువాత కేంద్ర ప్రభుత్వం యీ విషయాన్ని రాష్ట్రాలకి అనుకూలంగా నిర్ణయిస్తుందని ఆశిద్దాం.

"మొత్తం మీద ఆర్థిక విచారణ సంఘం సిఫార్సులు మనకి బాగా తోడ్పడ్డాయి.

"కాని దురదృష్టవశాత్తూ, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల మెట్ట జిల్లాల్లో కాలమాన పరిస్థితులు బాగా లేవు. వర్షాభావంవల్ల పంటలు పండలేదు. అందుచేత, అవసరమైన చోట్లల్లా రెమిషన్లు ఇవ్వడానికి, తక్కావి, భూమి శిస్తు బకాయిల వసూళ్ళను వాయిదా వేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. పంటపెరుగుదల్ని పరిరక్షణ చేయించడం ద్వారా రక్షణ చర్యల్ని కూడా తీసుకుంటున్నాం.

"తెలంగాణా ప్రాంతీయ సంఘం :- త్వరలో తెలంగాణా ప్రాంతీయ సంఘం యేర్పడుతుంది. ప్రభుత్వ చట్టాలు, పరిపాలనా వ్యవహారాల వల్ల తెలంగాణా జిల్లాలకి అపకారం జరుగదనే విషయాన్ని ఆ ప్రాంతీయ సంఘం స్వయంగా తెలుసుకోవచ్చును. ఈ సంఘం తెలంగాణా ప్రజల న్యాయమైన హక్కుల్ని రక్షిస్తూ, యీ రెండు ప్రాంతాల ప్రజలలో భావైక్యతను సాధించడానికి కూడా కృషి చేయాలి.

"ఎగువ సభ :- ఆంధ్రప్రదేశ్‌కి త్వరలోనే 90 మంది సభ్యులు గల ఎగువ శాసన సభ యేర్పడుతుంది. వివిధ ఎన్నికల అనంతరం 1-7-1958 నాటికి యిది రూపం దాలుస్తుందని భావిస్తున్నాం."

కొత్త ఆర్థిక సంవత్సరపు (1958-59) బడ్జెటు అంచనాలను గురించి మాట్లాడుతూ ఆర్థిక మంత్రి యిలా అన్నారు :

"1958-59 బడ్జెటు అంచనాలలో రూ. 63.06 కోట్ల రాబడికి, రూ. 62.87 కోట్ల ఖర్చుకి వసతి కల్పించబడింది. 1957-58 పునర్విమర్శితమైన అంచనాలలో రాబడి, ఖర్చులకి వరుసగా రూ. 61.08 కోట్లు, రూ. 57.96 కోట్లు వసతి కల్పించబడింది. ఈ విధంగా 1957-58 పునర్విమర్శితమైన అంచనాలలో రూ. 3.12 కోట్లుగా వున్న మిగులు రాబడి 1958-59 లో రూ. 79 లక్షలువుండ గలదని అంచనా వేయబడింది.

"దిగువ పద్దుల క్రింద హెచ్చు, తగ్గుల పర్యవసానంగా రాబడిలో రూ. 2.58 కోట్ల హెచ్చుదల వచ్చింది:-

| | | లక్షల రూపాయలలో |
|---|---|---|
| 1. | వస్త్రాలు, పొగాకు, పంచదారలమీద అమ్మకం పన్నుకి బదులు విధించబడిన అదనపు కేంద్ర ఎక్సైజు సుంకాలు | 202 |
| 2. | రాబడి పన్ను .... | 22 " |
| 3. | రైలు ఛార్జీలమీద పన్ను ... | 41 " |
| 4. | భూమి శిస్తు ... | 76 " |
| 5. | రాష్ట్ర ఎక్సైజు సుంకాలు | 41 " |
| 6. | అడవులు ... | 17 " |
| 7. | మోటారు శకటాల మీద పన్ను ... | 19 " |
| 8. | ఇతర పన్నులు, సుంకాలు. | -131 " |
| 9. | వ్యవసాయం ... | 34 " |
| 10. | విద్యుచ్ఛక్తి పథకాల నుంచి వచ్చే రాబడి ... | -33 " |
| 11. | రోడ్డు రవాణా పథకాల నుంచి వచ్చే రాబడి ... | -10 " |
| 12. | సమాజాభివృద్ధి కేంద్రాలు వగైరా ... | -21 " |
| 13. | ఇతర పద్దులు ... | - 9 " |
| | | 258 " |

లేక రూ. 2.58 కోట్లు.

"1957-58 పునర్విమర్శితమైన అంచనాలతో పోల్చినప్పుడు 1958-59 లో రెవిన్యూ ఖర్చు రూ. 4.91 కోట్లు హెచ్చింది. వివరాలు యివి :-

| | కోట్ల రూపాయలలో | | |
|---|---|---|---|
| | 1957-58 పునర్వి మర్శితమైన అంచనా | 1958-59 బడ్జెటు అంచనా | హెచ్చుదల |
| ప్రణాళిక | 7.91 | 9.30 | 1.39 |
| ప్రణాళికేతర మైనది | 50.05 | 53.57 | 3.52 |
| మొత్తం | 57.96 | 62.87 | 4.91 |

"ప్రణాళికా పథకాల కేటాయింపుల పరిస్థితిని గురించి యిప్పుడే వివరిస్తాను. దిగువ పద్దుల క్రింది మార్పుల వల్ల ప్రణాళికేతరమైన అంశాలకి రూ. 3.52 కోట్లు యెక్కువ లభించాయి:-

లక్షలరూపాయలలో

| | | | |
|---|---|---|---|
| 1. | భూమి శిస్తు | ... | 22 |
| 2. | [illegible] | ... | 9 |
| 3. | [illegible] | .. | 65 |
| 4. | [illegible] | ... | 16 |
| 5. | విద్య | ... | 64 |
| 6. | వైద్యం, ఆరోగ్యం | ... | 63 |
| 7. | సివిలు పనులు | ... | 77 |
| 8. | [illegible] పద్దులు, యితర పద్దులు | .... | 36 |
| | మొత్తం | | 352 |

లేక రూ. 3.52 కోట్లు.

"1958-59 బడ్జెటుపై ఆర్థిక శాఖ కార్యదర్శి తయారుచేసిన మెమోరాండంలో యీ మార్పులు వివరించబడినవి. ప్రణాళిక పరిధికి అవతల నున్న 2 వ. భాగం పథకాల కేటాయింపు రూ 21. 37 లక్షలకి మాత్రమే పరిమితమై వున్నది.

"పెట్టుబడి ఖర్చు:-వచ్చే సంవత్సరం బడ్జెటులో పెట్టుబడి ఖర్చుకై రూ 21.29 కోట్లు కేటాయించ బడినవి. వివరాలు యివి:—

లక్షల రూపాయలలో

| | | |
|---|---|---|
| జమీందారీల రద్దుతో భూస్వాములకిచ్చే నష్ట పరిహారం. | ... | 18.75 |
| సాగు నీటిసరఫరా పథకాలు | ... | 429.16 |
| ప్రజా రోగ్యాభివృద్ధి | ... | 27.21 |
| వ్యవసాయాభివృద్ధి, పరిశోధన | ... | 49 35 |
| పారిశ్రామికాభివృద్ధి | ... | 87.60 |
| బహుళార్థ సాధక నదీ లోయ ప్రాజెక్టులు. | ... | 715.00 |
| సివిలు పనులు | ... | 365.71 |
| విద్యుచ్ఛక్తిపథకాలు | ... | 356 70 |
| రెవిన్యూ శాఖ పరిధికి వెలుపల వున్న రాష్ట్రపు యితరపనులు | ... | 60.13 |
| కమ్యూట్ చెయబడిన పెన్షన్ల విలువ | ... | 9.43 |
| చిల్లర విషయాలు | ... | 9.53 |
| మొత్తం. | | 2128.76 |

లేక రూ 21.29 కోట్లు.

"1958-59బడ్జెటు అంచనాలలో దిగువ ముఖ్యమైన సాగు నీటి సరఫరా, విద్యుచ్ఛక్తి పథకాల కేటాయింపు కూడా చేరివున్నది:—

సాగునీటిసరఫరా: లక్షల రూపాయలలో

| | | |
|---|---|---|
| 1 | నాగార్జునసాగర్ సాగునీటి ప్రాజెక్టు | 700.00 |
| 2 | రాజోలిబండ మళ్లింపు పథకం | 36 06 |
| 3 | కృష్ణా రెగ్యులేటరు-రోడ్డు వంతెన | 23.07 |
| 4 | ఖైర వాని తిప్ప ప్రాజెక్టు | 28.67 |
| 5 | తుంగభద్ర దిగువ కాలువ | 55.70 |
| 6 | తుంగభద్ర యెగువ కాలువ | 40.00 |
| 7 | కర్నూలు-కడప కాలువ పునర్నిర్మాణం, అభివృద్ధి | 26.08 |

విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| 8 | మచ్ఖండు జల-థెర్మల్ పథకాలు | 173.94 |
| 9 | తుంగభద్ర జల-థెర్మల్ పథకాలు | 81.64 |
| 10 | తెలంగాణా జల-థెర్మల్ పథకాలు | 55.12 |

"అప్పులు, అడ్వాన్సులు:-1958-59 బడ్జెటు అంచనాలలో అప్పులు, అడ్వాన్సులికి, వసతి కల్పించ బడిన ముఖ్యాంశాలు దిగువ సూచించ బడినవి:—

| లక్షల రూపాయలలో | |
|---|---|
| 1 నీటిసరఫరా, మురుగుపారుదల, రోడ్లు మున్నగు పనులకి మునిసిపాలిటీలకి అప్పులు ... | 119.79 |
| 2 రైతులికి అడ్వాన్సులు : | |
| అ. అమ్మోనియం సల్ఫేటు సరఫరా కిస్వల్పకాలిక ఋణాలు ... | 160.65 |
| ఆ. విత్తనాల అధికోత్పత్తి, పంపిణీ పథకాలు ... | 23.51 |
| ఇ. ఇతర తక్కావీ అడ్వాన్సులు ... | 31.12 |
| ఈ. వ్యవసాయ అప్పుల చట్టం క్రింద అప్పులు ... | 47.00 |
| 3 సమాజాభివృద్ధి, జాతీయవికాస సేవా పథకాల క్రింద అప్పులు ... | 72.92 |
| 4 చిన్నరకం, కుటీర పరిశ్రమలకి అడ్వాన్సులు ... | 14.60 |
| 5 పారిశ్రామిక, తక్కువ రాబడివర్గాల గృహ నిర్మాణ పథకాలు ... | 68.35 |
| 6 సహకార భూమితనఖా బ్యాంకులకి స్వల్పకాలిక ఋణాలు ... | 42.00 |
| 7 సహకార మార్కెటింగు అభివృద్ధి పథకం క్రింద సహకార సంస్థలకి అప్పులు ... | 22.45 |
| 8 ఇతర చిన్నరకం పథకాలకి అప్పులు | 69.26 |
| మొత్తం | 691.65 |

"ప్రభుత్వ ఋణం:- 1958-59 బడ్జెటు అంచనాలలో, కేంద్ర ఋణసహాయం రూ. 17.63 కోట్లు, వచ్చే సంవత్సరంలో స్వల్ప మొత్తాల పొదుపు, మార్కెటు ఋణాలద్వారా సేకరించదలచిన రూ. 6.00 కోట్లుకూడా లెక్క వేసుకోబడినవి.

పంపిణీల వైపున, వివిధ ప్రయోజనాలకై కేంద్ర ప్రభుత్వం వగైరానుంచి తీసుకున్న అప్పుల చెల్లింపుకై రూ. 6.22 కోట్లు కేటాయించ బడినవి. ముఖ్యమైన అంశాలు యివి:-

| లక్షల రూపాయలలో | |
|---|---|
| 1 రసాయన యెరువుల కొనుగోలు నిమిత్తం తీసుకున్న స్వల్పకాలిక ఋణాలు ... | 60.00 |
| 2 సమీకృత చెల్లింపు పద్ధతిపై తీర్చవలసిన అప్పుల అసలు వాయిదాలు ... | 42:.10 |
| 3 మద్రాసు ప్రభుత్వం అప్పులో యీ ప్రభుత్వం తీర్చవలసిన వాటా ... | [illegible]6.86 |
| మొత్తం | 5[illegible] |

## ప్రణాళిక ఖర్చు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం రూ. 175 కోట్లు ఖర్చుచేయాలని సంకల్పం. ప్రణాళిక తొలిసంవత్సరం అనగా 1956-1957 లో రూ. 29.78 కోట్లకి వసతి కల్పించగా రూ. 24.96 కోట్లు మాత్రమే ఖర్చుచేయబడినవి. 1957-58 లో ప్రణాళిక పథకాల ఖర్చు నిమిత్తం బడ్జెటులో రూ. 35.2 కోట్లు కేటాయించబడినవి. ఇంతవరకూ జరిగినపని స్థాయినిబట్టి యీ కేటాయింపులో రూ. 31 లేక 32 కోట్లకి మించి ఖర్చు చేయబడుతుందని అనుకోలేం.

1958-59 కి ప్లానింగు కమిషన్ ఆమోదాన్ని పొందిన ప్రణాళిక ఖర్చు, క్రిందివిధంగా రూ. 30.02 కోట్లుగా వున్నది.

| కోట్ల రూపాయలలో | |
|---|---|
| రెవిన్యూ ఖాతా ... | 9.31 |
| పెట్టుబడి ఖాతా ... | 18.42 |
| అప్పులు, అడ్వాన్సులు ... | 2.29 |
| మొత్తం | 30.02 |

"1958-59 సంవత్సరపు ఖర్చుకి నిర్ణీతమైన యీ సొమ్ము గరిష్ఠపరిమితి అంత యెక్కువగా లేనందుకు నాకు ఆశాభంగంగానే వున్నది. సభవారుకూడా

న్నా ఆశాభంగంలోపాలు పంచుకుంటారనడానికి సందేహంలేదు. కాని యీ గరిష్ఠపరిమితి నిర్ణయంలో ప్లానింగు కమిషన్ ముఖ్యంగా మూడు రకాల చిక్కుల్ని గురించి ఆలోచించినది. మొదటిది విదేశ మారకం, రెండవది యెక్కువ డబ్బును ప్రణాళిక ప్రధానభాగంపై ఖర్చు పెట్టవలసిన అవసరం. మూడవది. ఖర్చులో తన వాటాను యివ్వడానికి మన రాష్ట్రానికి గల స్తోమత. ఇది గాక మరొక రూ. 2.61 కోట్లకి, తాను తలపెట్టిన కార్యక్రమాలకై, కేంద్రప్రభుత్వం వసతికల్పిస్తుంది.

"ప్రణాళికకాలం తొలి రెండు సంవత్సరాలలోను ప్రణాళికా పథకాలపై చేసిన ఖర్చునుబట్టి, 1958-59 లో వాటిపై ఖర్చు చేయదలచుకున్న సొమ్మునుబట్టి రూ. 175 కోట్ల గరిష్ఠ పరిమితిని అందుకోవాలంటే ఆఖరి రెండు సంవత్సరాలలోను ఖర్చును హెచ్చించాలి.

"1958-59 కి నిర్ణీతమైన ప్రణాళిక ఖర్చులో రూ. 18 కోట్లను గ్రాంట్లు, అప్పులద్వారా యివ్వడానికి కేంద్రప్రభుత్వం వాగ్దానం చేసింది. మిగిలిన రూ. 12.02 కోట్లను రాష్ట్ర ప్రభుత్వం దిగువ విధంగా సేకరించవలసి వున్నది.

కోట్ల రూపాయలలో

| | | |
|---|---|---|
| 1 | రెవిన్యూలో మిగులు ... | 6.69 |
| 2 | రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలచే అదనపు పన్నుల విధింపు ... | 1.00 |
| 3 | ప్రభుత్వ ఋణం, స్వల్పమొత్తాల పొదుపు ... | 6.00 |
| 4 | ప్రావిడెంటు ఫండు, యితర అప్పుల వసూలునుంచి వచ్చిన రకాల పెట్టుబడి రాబడి ... | 4 55 |
| 5 | కేంద్ర ప్రభుత్వం అప్పులబాకీ చెల్లు | 6 22 |
| | మొత్తం | 12.02 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

"సమాజాభివృద్ధి, జాతీయ వికాససేవా కార్యక్రమాలు రాష్ట్రంలో 1952-53 నుంచి అమలు జరుగుతున్నవి. ప్రస్తుతం మనకి 185 అభివృద్ధి కేంద్రాలు (47 సమాజాభివృద్ధి కేంద్రాలు, 112 జాతీయ వికాససేవా కేంద్రాలు, 22 అనంతర తీవ్రకృషి కేంద్రాలు, 4 బహుళార్థక సాధక ప్రాజెక్టులు) వున్నాయి. వీటి క్రింద 43,886 చదరపు మైళ్ల ప్రదేశం, 12,917 గ్రామాలు, 136 లక్షల జనసంఖ్య వున్నాయి. 65 కొత్త జాతీయ వికాస సేవా కేంద్రాలనుప్రారంభించి, 18 జాతీయ వికాస సేవా కేంద్రాల్ని సమాజాభివృద్ధి కేంద్రాలుగా మార్చి, తద్వారా వచ్చేసంవత్సరం యీ కార్యక్రమం విస్తృతీకరించ బడుతుంది. 1955-56 సిరీస్ లోని 17 సమాజాభివృద్ధి కేంద్రాలు 1958 ఏప్రిల్ ప్రారంభానికి అనంతర తీవ్రకృషి స్థాయి నందుకుంటాయి. దానితో అనంతర తీవ్రకృషి కేంద్రాల సంఖ్య మొత్తము 39 కి హెచ్చుతుంది.

"అభివృద్ధి కేంద్రాలన్నిటిలోను 1957-58 లో సాధించవలసిన లక్ష్యాలు జిల్లా అధికార్లతో సంప్రదించి నిర్ణయించబడినవి. ఆయా కేంద్రాలలో అభివృద్ధికి జరిగే కృషిబాగా గమనించబడుతున్నది. అది ప్రతి నెలా జిల్లా, రాష్ట్రస్థాయిలలో సమీక్షించ బడుతున్నది. కూడా. ఆహారోత్పత్తిని అధికం చేయడానికై వ్యవసాయ కార్యక్రమాలకి యెక్కువ ప్రాధాన్యత యివ్వబడుతున్నది. 1-4-57 నుంచి 31-12-57 వరకూ వ్యవసాయం, సాగునీటి సరఫరా, భూమి బాగుల క్రిందం సాధించవలసిన లక్ష్యాలు చాల సందర్భాలలో సిద్ధించినవి.

"ఈ కేంద్రాలన్నిటిలోను వివిధ అభివృద్ధి కార్యక్రమాలపై యించుమించు రూ. 151 లక్షలు ఖర్చు చేయబడినవి. ఈ సందర్భంలో ప్రజలు యించుమించు రూ. 76 లక్షలు యిచ్చారు.

"కేంద్ర ప్రభుత్వం చెరిసగం ఖర్చును భరించే స్థానికాభివృద్ధి పనుల కార్యక్రమం గడచిన నాలుగు సంవత్సరాల నుంచి అమలు జరుగుతున్నది. జరిగే సంవత్సరంలో కేంద్రప్రభుత్వం రూ. 49 72 లక్షల గ్రాంటును యిచ్చినది. మరంత సొమ్ముస్థానికంగా ప్రజలు, స్థానిక సంస్థలు వగైరా నుంచి వసూలు చేయబడినది. ఖర్చు మొత్తం మీద సంతృప్తికరంగానే సాగుతున్నది. కాని తెలంగాణాలోని కొన్ని

జిల్లాల్లో మాత్రం ప్రజాసహకారం తగినంతగా లేక అది వెనుకబడుతున్నది. ఈ సందర్భంలో, స్థానికాభివృద్ధి పనుల్ని అమలు జరపడానికి ప్రత్యేక ఇంజనీరింగు సిబ్బంది లేక పోవడం వంటి యితర చిక్కులు కూడా వున్నాయి. ఇందు నిమిత్తం ప్రత్యేకం ఇంజనీరింగు సిబ్బందిని నియమించడానికి యిప్పుడు ప్రభుత్వం అంగీకరించింది. ఈ కార్యక్రమం అమలులో ప్రత్యేకశ్రద్ధ గైకొనవలసినదిగా కలక్టర్లు, రెవిన్యూ ఆఫీసర్లకి కూడా ఆదేశాలివ్వబడినవి.

## లావాదేవీలు

"1957-58 సంవత్సరం రూ 16 లక్షల రొఖ్ఖం నిల్వతో ప్రారంభమైనది. అయితే ఇండియా రిజర్వు బ్యాంకిలో రూ. 3.71 కోట్లకి ఓవర్ డ్రాఫ్టు వున్నది. కాబట్టి నిజమైన రొఖ్ఖం నిల్వ మైనస్ రూ. 3.55 కోట్లు. 1957-58 పునర్వి మర్శితమైన అంచనాలలో రెవిన్యూలో రూ. 3.12 కోట్ల మిగులు తేలగా, పెట్టుబడి ఖాతాలో రూ. 10.74 కోట్ల లోటు వచ్చింది. అంటే మొత్తంమీద రూ. 7.62 కోట్లలోటు వచ్చివున్నమాట దీనిని ప్రారంభ నిల్వకి కలిపి నట్లయితే, 1957-58 సంవత్సరం మైనస్ రూ. 11.17 కోట్ల రొఖ్ఖం నిల్వతో ముగుస్తుంది. అయితే యీ పై అంకెలకి ప్రాతిపదిక, ఆయా శాఖలు ప్రణాళిక ఖర్చుకి కాగలవని వూహించి లెక్కవేసిన రూ. 33.11 కోట్లు అయి వున్నవి. ప్రస్తుతం జరుగుతున్న పని స్థాయిని బట్టి ప్రణాళికా పథకాల పై ఖర్చు రూ, 31 కోట్లకి మించక పోవచ్చును. కాబట్టి ముగింపు రొఖ్ఖం నిల్వమైనస్ రూ. 9.06 కోట్లు మాత్రమే వుండ వచ్చును.

"1958-59 విషయంలో, దిగువ సంక్షిప్తంగా యివ్వబడిన వ్యవహారాల పర్యవసానంగా, అది రూ. 11.75 కోట్ల రొఖ్ఖం నిల్వతో ముగియ వచ్చును:-

| | | లక్షల రూపాయలలో |
|---|---|---|
| 1. ప్రారంభ నిల్వ | (—) | 1117.11 |
| 2. రెవిన్యూలో మిగులు | ... | 78.52 |
| 3. పెట్టుబడి ఖర్చు | ... | 2128.76 |
| 4. కేంద్రప్రభుత్వం నుంచి అప్పులు | ... | 1783.33 |
| 5. మార్కెటు ఋణం,స్వల్ప మొత్తాల పొదుపు వసూళ్లలో వాటా | ... | 600.00 |
| 6. కేంద్ర, మద్రాసు ప్రభుత్వాల బాకీలచెల్లు | ... | 621.96 |
| 7. రాష్ట్రప్రభుత్వం యిచ్చే అప్పులు, అడ్వాన్సులు (నికరం పంపిణీలు) | ... | 6.07 |
| 8. ఇతర అప్పులు, డిపాజిట్లు పద్దులు వగైరా(నికరం) | ... | 237.49 |
| 9. ముగింపు నిల్వ | (—) | 1174.54 |

## ప్రభుత్వ ఋణం

"ప్రభుత్వ ఋణం 1957 మార్చి నెలాఖరి నాటికి రూ. 129.11 కోట్లు వున్నది. రిజర్వు బ్యాంకి యిచ్చిన తాత్కాలికపు అడ్వాన్సులు యిందులో చేరలేదు. ప్రణాళికా పథకాలకి, యితర ప్రయోజనాలకి మామూలు ప్రకారం కేంద్రప్రభుత్వం నుంచి అప్పు లభిస్తుందని, అదిగాక రాష్ట్ర ప్రభుత్వం రూ. 5 కోట్లను అప్పుద్వారా సేకరించ గలదని, ఆ పైన మరొక రూ. 89 లక్షలు స్వల్ప మొత్తాల పొదుపు వసూళ్లలో రాష్ట్రపు వాటాగా రాగలవని వూహించి, ఆ వూహతోనే 1957-58 బడ్జెటు అంచనాలు తయారు చేయబడినవి. అయితే మొత్తం మీద దేశపు డబ్బు పరిస్థితుల వల్లను, విశేషించి రాష్ట్ర అప్పుల ధరలు తక్కువగా వుండడం వల్లను ప్రభుత్వం అప్పు తీసుకోడానికి వీలులేక పోయింది. అందుచేత స్వల్ప మొత్తాల పొదుపు వుద్యమంలోనే బాగా కృషి చేయడానికి నిశ్చయించ బడింది. రాష్ట్రాలకి యికముందు నుంచి స్వల్ప మొత్తాల పొదుపు వసూళ్ల నికరంలో మూడింట రెండు వంతులు తననుంచి అదనపు అప్పులుగా లభించ గలవని కేంద్రప్రభుత్వం కూడా సూచించినది. ఈ పద్దుక్రింద రూ. 6 కోట్లను పొందడానికి వీలుగా స్వల్ప మొత్తాల పొదుపు క్రింద రూ. 9.25 కోట్లు వసూలు కావాలని లక్ష్యం నిర్ణయించ బడింది. 1957-58 లో స్వల్ప మొత్తాల పొదుపు వసూళ్లలో

రాష్ట్రపు వాటా, వెనుకటి సంవత్సరాల బకాయి లతో సహా రూ. 4 కోట్లు వుంటుందని యిప్పుడు అంచనా వేయబడినది. వివిధ పద్దులక్రింద కేంద్ర ప్రభుత్వం నుంచి మొత్తం రూ. 17.85 కోట్ల అప్పు లభించ గలదని భావించ బడుతున్నది. రూ. 6.50 కోట్లతో కేంద్రప్రభుత్వం పాత బాకీలను తీర్చాలి. ఈ విధంగా 1958 మార్చి నెలాఖరి నాటికి ప్రభుత్వ ఋణం రూ. 144.46 కోట్లు వుంటుందని భావించ బడు తున్నది. 1958-59 విషయంలో, కేంద్ర ప్రభుత్వం నుంచి, దిగువ పద్దులక్రింద, రూ. 17.83 కోట్లు అప్పు లభించగలదని అంచనా వేయబడినది.

| | | కోట్ల రూపాయలలో |
|---|---|---|
| 1. ప్రణాళికా పథకాలకై చేసే ఋణసహాయం | — | 14.60 |
| 2. రసాయన యెరువుల కొనుగోలు, పంపిణీలకై యిచ్చే స్వల్పకాలిక ఋణాలు | — | 1.60 |
| 4. వరద నివారణ పథకాలకై యిచ్చే అప్పు | — | 0.51 |
| 3. నీటి సరఫరా పథకాలకి యిచ్చే అప్పు | — | 0.80 |
| 5. గృహనిర్మాణ పథకాలకిచ్చే అప్పు (ప్రణాళిక పరిధికి వెలుపల) | — | 0.26 |
| 6. ఇతర చిల్లరరకాల అప్పులు | — | 0.06 |
| | మొత్తం రూ. | 17.83 |

"వచ్చే సంవత్సరం స్వల్ప మొత్తాల పొదుపు, మార్కెటు ఋణాలద్వారా యించుమించు రూ. 6 కోట్లు లభించ గలవని భావించ బడుతున్నది. కేంద్రప్రభుత్వం వగైరాలకి అప్పులు తీర్చడానికై రూ. 6.22 కోట్లు కేటాయించ బడుతున్నవి. ఈ విధంగా 1958-59 లో ప్రభుత్వ ఋణం రూ. 17.61 కోట్లు తేలి, 1959 మార్చి నెలాఖరి నాటికి రూ. 162.07 కోట్లు వుంటుందని భావించ బడుతున్నది. ప్రభుత్వ ఋణంపై వడ్డీకూడా 1957-58 లో రూ. 5.45 కోట్లనుంచి 1958-59 లో రూ. 6.66 కోట్లకి హెచ్చింది.

## స్వల్ప మొత్తాల పొదుపు

"ద్వితీయ ప్రణాళికకి పెట్టుబడి రాబడి ఆధారాల పథకంలో స్వల్ప మొత్తాల పొదుపు వుద్యమానికి చాలా ముఖ్యమైన స్థాన మివ్వబడినది. రాష్ట్ర ప్రభుత్వాలు ఋణసేకరణకై బ్యాంకులు, భీమాకంపెనీల వంటి భారీ పెట్టుబడి సంస్థలపై యిక ఆధారపడి వుండలేవు. దానికి బదులు, అది యెక్కువగా యితరరాబడి ఆధారాలు ముఖ్యంగా పల్లె ప్రాంతాలలోని వాటిమీద ఆధారపడాలి. వీటిని స్వల్ప మొత్తాల పొదుపు ద్వారా వుపయోగం లోనికి తేవచ్చును.

"ప్రజలలో అన్ని వర్గాలకి పొదుపులో ఆసక్తిని కలిగించి తద్వారా పొదుపు వుద్యమాన్ని విస్తృతం చేసి, ఆవిషయంలో కృషిని తీవ్రతరం చేయడానికి అవసరమైన వివిధ యేజన్సీ పద్ధతులు రాష్ట్రంలో ప్రవేశపెట్టబడినవి. మొదటిది, ప్రభుత్వ కార్యాలయాలు, ఫ్యాక్టరీలు, షాపులు, విద్యా సంస్థలు వగైరాలో పనిచేసే వారికై వుద్దేశించబడిన ఇంటర్నల్ యేజన్సీపద్ధతి. రెండవది. వుపాధ్యాయులకై వుద్దేశించబడిన ప్రాథమిక పాఠశాలా యేజన్సీ పద్ధతి. మూడవది, ప్రజలలో తదితరులు, గ్రామోద్యోగులకై వుద్దేశింపబడిన జనరల్ ఆథరైజుడు యేజన్సీ పద్ధతి. ఒక సంవత్సరం క్రిందటివరకూ అమలులోవున్న పంచాయతీ అధ్యక్షుల యేజన్సీ పద్ధతిని తిరిగి ప్రవేశపెట్టే విషయం పరిశీలనలో వున్నది.

"శిస్తు వసూలుకి బాధ్యతవహించే గ్రామోద్యోగులు జనరల్ ఆథరైజుడు యేజన్సీని తీసుకోదలిస్తే, వారు ఒక సంవత్సరంపాటు రొఖ్ఖం లేక వ్యక్తి సంబంధమైన హామీ యివ్వనవసరంలేకుండా మినహాయింపు యివ్వబడుతుంది.

"ఆయా జిల్లాలలో యీపని బాధ్యతను కలెక్టర్లు వహిస్తారు. కేంద్రప్రభుత్వపు ప్రాంతీయ జాతీయ పొదుపు అధికారి, వివిధజిల్లాలలో కలక్టర్లు సల్పిన

కృషిని సమన్వయపరచడానికై రెవిన్యూ బోర్డులో ఒక కాంప్లిమెంటరీ సంస్థ యేర్పాటు చేయబడింది. రెవిన్యూబోర్డు మొదటి సభ్యుడు దానికి ఎక్స్ అఫీషియో డైరెక్టరు (స్వల్పమొత్తాల పొదుపు)గా వున్నారు. రెవిన్యూబోర్డు యితర సభ్యులు, జిల్లాల్లో పర్యటించే సమయాలలో మంత్రులుకూడా స్వల్పమొత్తాల పొదుపు వుద్యమ వ్యాప్తికి దోహదం చేస్తూవుంటారు. జాతీయ పొదుపు రాష్ట్ర సలహా సంఘంకూడా శాసనసభ్యులు, ప్రముఖ సాంఘిక సేవా కార్యకర్తలు మున్నగువారి నియామకంతో పునర్నిర్మించబడింది. రాష్ట్ర మంతటా ఫిబ్రవరి 15 వ, తేదీనుంచి పొదుపు పక్షం జరుపబడుతున్నది.

"సొమ్ము యింతవరకూ అనుకున్న ప్రకారం వసూలుకాలేదు. ప్రభుత్వోద్యోగులు, సాంఘిక సేవా కార్యకర్తలుకూడా యింకొంచెం గట్టిగా కృషిచేస్తే వచ్చే సంవత్సరం యెక్కువ సొమ్ము వసూలు కావచ్చును.

## తక్కావీ, వగైరా బకాయిలు

"వ్యవసాయ, రెవిన్యూ తక్కావీలు, భూమి శిస్తు, ఎక్సైజు బకాయిలు రూ. 10 కోట్లకి మించి వున్నవి. ఇటీవల తెలంగాణాలో తక్కావీ బకాయిల గ్రాంటుకి సంబంధించిన పరిస్థితిని సమీక్షించిన పిదప ప్రభుత్వం దిగువమినహాయింపులను యివ్వడానికై నిశ్చయించినది :-

1. 1-4-52 నాటికి బాకీవున్న వడ్డీ బకాయిలన్నీ కొట్టివేయబడతాయి. వడ్డీక్రింద యిదివరకే చెల్లించబడిన సొమ్ముమాత్రం వాపసు యివ్వబడదు.
2. 1366 ఫసలీలో భూమిశిస్తు రూ. 100 లోపున వున్న వారందరికీ 1-4-52 కి పూర్వం యిచ్చిన అప్పులు పూర్తిగా కొట్టివేయబడతాయి.
3. 1-7-57 నాటికి వున్న తక్కావీ బకాయిలన్నీ ఆరు సంవత్సర వాయిదాలలో చెల్లించబడవచ్చును. బాకీ తేలిన అప్పుల చెల్లింపుకి ఆరు లేక అంతకంటె యెక్కువ వాయిదాలు యిదివరకే నిర్ణీతమైనట్లయితే అటువంటి వాయిదాలలో మార్పు యేమీవుండదు.

"నిజంగా కష్టాలుగల సందర్భాలను పరిశీలించి పరిస్థితినిబట్టి అవసరమైన మినహాయింపుల్ని యివ్వడానికి ప్రభుత్వం సర్వదా సంసిద్ధమైవున్నది. అయితే ప్రభుత్వం ఆర్థికమైన చిక్కుల్ని యెదుర్కొంటున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింది లక్ష్యాల సాధనకై అందుబాటైన ప్రతి రూపాయను సేకరించి, ఆయ వ్యయాలమధ్యగల వ్యత్యాసాన్ని తొలగించవలసివున్నది. ఈ పరిస్థితులలో భూమి శిస్తు, ఎక్సైజు, తక్కావీ వసూళ్లను బకాయి పడనివ్వడంలో అర్థంలేదు. వచ్చే సంవత్సరంలో వీటి వసూలుకై ప్రత్యేకమైన కృషిచేయాలని సంకల్పించబడింది. కాబట్టి వచ్చే సంవత్సరం బడ్జెటులో యీ పద్దుక్రింద రూ. 2 కోట్ల రాబడి లెక్క వేసుకోబడింది.

## గ్రామీణ పరపతి

"రాష్ట్రంలోని ఎపెక్సు సహకార బ్యాంకులు, భూమి తనఖాబ్యాంకులు గ్రామీణ పరపతి సౌకర్యాల విస్తరణకి ప్రధాన సాధనాలుగావున్నాయి. ఇవి చక్కని కృషిచేస్తున్నాయి. ఇండియా రిజర్వు బ్యాంకి మున్నగు సంస్థలనుంచి యివి తీసుకునే అప్పులకి హామీలను యివ్వడంద్వారా ప్రభుత్వం కూడా వీటికి తోడ్పడుతున్నది. ఉదాహరణకి, జరిగే సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వం దిగువ హామీలను యిచ్చింది :-

| ఆశయం | హామీయివ్వబడిన సొమ్ము లక్షల రూపాయలలో |
|---|---|
| **ఆంధ్రరాష్ట్ర సహకార బ్యాంకి, లిమిటెడ్, విజయవాడ.** | |
| 1. ఆయా కాలాలలో జరిగే వ్యవసాయ పనులకై ప్రత్యేక పరపతి పరిమితి | — 150 |
| 2. వ్యవసాయపనుల పెట్టుబడికై మధ్య కాలిక ఋణం | — 50 |
| 3. రసాయన యెరువుల పంపిణీ పెట్టుబడికై అప్పు | — 100 |
| 4. నేతపనివారి సహకార సంఘాల పెట్టుబడికై అప్పు | — 75 |
| **హైదరాబాదు సహకార అపెక్సు బ్యాంకి** | |

వ్యవసాయ పనుల పెట్టుబడికై మధ్య
కాలిక ఋణం — 25

2. ఆయా కాలాలలో జరిగే వ్యవసాయ
పనులకై స్వల్పకాలిక ఋణాలు — 100

3. నేతపనివారి సహకార సంఘాల పెట్టు
బడికై అప్పు —. 47

"ఆంధ్రరాష్ట్ర సహకార బ్యాంకి జరిగే సంవత్సరంలో వ్యవసాయం పనులకి రూ 11 కోట్లవరకూ పెట్టుబడి పెట్టగలనని భావిస్తున్నది. వీటిలో స్వల్ప కాలిక ఋణాలు (రూ. 7 కోట్లు) మధ్యకాలిక ఋణాలు (రూ. 1 కోటి), మార్కెటింగు పెట్టు బడికై సరుకు అప్పులు (రూ. 3 కోట్లు) చేరి వున్నాయి. 1958-(59) కి దాని కార్యక్రమంలో మొత్తం రూ. 12.50 కోట్ల అప్పుల వ్యాపారం తల పెట్టబడింది. ఈ వ్యాపారం స్వల్ప కాలిక ఋణాలు (రూ. 8.8 కోట్లు), మధ్యకాలిక ఋణాలు (రూ. 1 కోటి), సరుకు అప్పుల (రూ, 3.2 కోట్లు) రూపంలో జరుగుతుంది. హైదరాబాదు సహకార యెపెక్సు బ్యాంకి జరిగే సంవత్సరంలో యించు మించు రూ. 1.4 కోట్లను, వచ్చే సంవత్సరంలో రూ. 3.4 కోట్లను పై ప్రయోజనాలకే పంపిణీచేస్తుంది.

"భూమి తనఖాబ్యాంకుల సందర్భంలో, ఆంధ్ర సహకార కేంద్రభూమి తనఖాబ్యాంకి 1956-57లో రూ, 71 లక్షల వరకూ అప్పులు యిచ్చింది. 1957-58 లో రూ 92 లక్షలు పంపిణీ చేయగలనని భావిస్తున్నది. 1958-59 కి దాని కార్యక్రమం ప్రకారం రూ1.10 కోట్లు పంపిణీకావాలి. వచ్చే సంవత్సరం రూ 23 లక్షలను పంపిణీచేసే కార్యక్రమం ఒకటి హైదరాబాదు సహకార కేంద్ర భూమి తనఖాబ్యాంకుకికూడా వున్నది.

## ప్రభుత్వ జీవిత భీమానిధి

"పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో ప్రభుత్వోద్యోగులకి జీవితభీమానిధి ఒకటి వుండేది. 1-11-56 న మైసూరు రాష్ట్రానికి బదిలీ అయిన వుద్యోగులకి సంబంధించిన భీమాపనిని మైసూరు ప్రభుత్వ భీమా శాఖ స్వాధీనం చేసుకున్నది. బొంబాయి రాష్ట్రానికి వెళ్ళిన పోలసీదారులు ప్రీమియం సొమ్మును ఆంధ్రప్రదేశ్ జీవిత భీమానిధికే చెల్లిస్తున్నారు. ప్రస్తుతం వారిపేర్లు మన పుస్తకాలలోనే వున్నాయి. ఇప్పుడు బొంబాయి ప్రభుత్వపు వుద్యోగులుగా వున్న పోలసీదారులు శీఘ్రంగా పనిజరిపించుకోడానికి వీలుగా యీ నిధిలోని తన వాటాను స్వాధీనం చేసుకుని 1-4-58 నుంచి దానిని తానే నిర్వహించడానికి బొంబాయి ప్రభుత్వం నిశ్చయించుకున్నది. జీవిత భీమానిధి లాభాలను ఆంధ్రరాష్ట్రానికి కూడా వర్తింపచేసే విషయాన్ని ప్రభుత్వం పరిశీలించింది. అక్కడి ప్రభుత్వోద్యోగులకి కంట్రిబ్యూటరీ పెన్షన్ ప్రావిడెంటు ఫండు నిబంధనలు వర్తించేవి. వాటి క్రింద, వారు తమ జీవితాలను నిర్ణీతమైన మొత్తాలకి జీవిత భీమా కార్పొరేషను లేక పోస్టల్ జీవిత భీమానిధిలో భీమా చేయించుకోవాలి. ఇక ముందునుంచి ఆంధ్రోద్యోగులు తమపోలసీలను పైన పేర్కొన్న రెండు సంస్థలలోను కాక రాష్ట్ర ప్రభుత్వపు ప్రభుత్వ జీవిత భీమానిధిలో తీసుకోవాలని నిశ్చయించబడినది. భీమానిమిత్తం వారు నిర్బంధంగా చెల్లించవలసిన డబ్బు ప్రస్తుతపు రేటు (మూల వేతనంలో 2 శాతం) ను వారి మూల వేతనములో 4 శాతానికి పెంచాలని కూడా నిశ్చయించబడినది. వారికి భీమా సొమ్ము యింకా యెక్కువగా రావాలనే ఆశయంతో యీ నిర్ణయం తీసుకోబడినది. ఆ పైన యింతవరకూ నిర్బంధ భీమా లేని వుద్యోగులందరికీ కూడా అది నిర్బంధం చేయబడుతున్నది.

"ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భీమానిధి నిల్వలు రాష్ట్ర ప్రభుత్వం వద్ద డిపాజిట్టు చేయబడతాయి. ప్రభుత్వం వాటిపై వడ్డీ చెల్లిస్తుంది

## ట్రెజరీ, అకౌంట్ల సర్వీసు

"ట్రెజరీల నిర్వహణను అభివృద్ధి పరచడానికై ఆంధ్ర ప్రభుత్వం 1956 లోనే ట్రెజరీలను జిల్లాలలోని యితర రెవిన్యూ సంస్థలనుంచి విడదీయాలని నిశ్చయించినది. క్రింది తరగతిలో యీ విభజన పూర్తి అయినా, ట్రెజరీ డిప్యూటీ కలక్టర్లు మాత్రం యింకా రెవిన్యూ డిప్యూటీ కలక్టర్ల తరగతినుంచే

తీసుకోబడుతున్నారు. తెలంగాణా ప్రాంతంలో మాత్రం యిందుకు సంబంధించిన యేర్పాట్లు కొంచెం భిన్నంగా వున్నాయి. పూర్వ హైదరాబాదు రాష్ట్రంలో ఒక అక్కౌంట్ల సర్వీసు సంస్థ యేర్పాటు చేయబడింది. దానిలో జిల్లా ట్రెజరీ ఆఫీసర్లు, వివిధ ప్రభుత్వ శాఖల అక్కౌంట్ల ఆఫీసర్లు వుండేవారు. తెలంగాణాలో యీ యేర్పాటు యిప్పటికీ వున్నది. పరిపాలనా విషయంలో అది ఆర్థికశాఖ అజమాయిషీ క్రింద పని చేస్తుంది, అయితే, ఆంధ్ర, తెలంగాణా జిల్లాల్లోని సబ్ ట్రెజరీలు మాత్రం తహశీలుదార్లచే నిర్వహించబడతాయి. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని ట్రెజరీ, అక్కౌంట్ల సంస్థలను యేకంచేసి, అక్కడి వుద్యోగులికి ఒకేరకమైన జీతము యిస్తూ, ఒకేరకమైన వుద్యోగ నిబంధనలను వర్తింపజేయాలని యిప్పుడు సంకల్పించబడినది. ఇకముందు యీ సంస్థ ప్రభుత్వ శాఖాధిపతుల కార్యాలయాలు, ప్రభుత్వ యితర కార్యాలయాలలో చేరివున్న ట్రెజరీలు, అక్కౌంట్ల శిక్షణ అవసరాలకి ఆదుకుంటుంది. ట్రెజరీలు, అక్కౌంట్లకి పూర్తికాలం పనిచేసే డైరెక్టరు, డిప్యూటీ డైరెక్టర్లు, ట్రెజరీ ఆఫీసర్లు, అక్కౌంట్ల ఆఫీసర్లు మున్నగువారు వుంటారు. స్థానిక నిధి అక్కౌంట్ల పరిశీలకుడు, జీవిత భీమానిధి ఆఫీసర్ ఇన్‌చార్జి, కొత్తపేరు యివ్వబడగల ట్రెజరీ అక్కౌంట్ల ఇనస్పెక్టరు, జిల్లా ట్రెజరీ ఆఫీసర్లు, అక్కౌంట్ల ఆఫీసర్లు మున్నగు ప్రస్తుతపు వుద్యోగాలన్నీ యీ కొత్త కేడర్‌లో వుంటాయి.

"ఇప్పుడు హైదరాబాదులో ఒక అక్కౌంట్ల శిక్షణా పాఠశాల వుంది. ట్రెజరీలు, సబ్ ట్రెజరీలు, వివిధ అక్కౌంట్ల కార్యాలయాలకి అవసరమైన అక్కౌంటెంట్లు, అక్కౌంటు గుమాస్తాలకి ఇక్కడ శిక్షణ ఇవ్వబడుతుంది. ఆంధ్రప్రాంతంలో ఇటువంటి సంస్థలేదు. ఇందునిమిత్తం గుంటూరులో ఒక పాఠశాలను యేర్పరచాలని సంకల్పం."

"అక్కౌంట్ల సర్వీసు పునర్వ్యవస్థీకరణ, యేర్పాటులకయిన అదనపు ఖర్చుకై, 2వ భాగం పథకాల క్రింద, వచ్చే సంవత్సరం బడ్జెటులో రూ 2.26 లక్షలు చేర్చబడినవి.

## రోడ్డు రవాణా సంస్థ

"1958 జనవరి 11 వ తేదీనుంచి రోడ్డు రవాణా కార్పొరేషను యేర్పాటు చేయబడినది. మొట్టమొదట యిది తెలంగాణా రోడ్డు రవాణా సంస్థను స్వాధీనము చేసుకున్నది. 1958 ఏప్రిల్ నుంచి తన కార్య రంగాన్ని కృష్ణాజిల్లాకి విస్తరింపచేయాలని ఆలోచిస్తున్నది. ఈ కార్పొరేషను పెట్టుబడిని ప్రస్తుతం పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వమే సమకూరుస్తున్నది. పెట్టుబడిలో నాలుగోవంతును రైల్వే నిధులనుంచి తాను ఇవ్వగలనని కేంద్రప్రభుత్వం తెలియజేసింది.

"ఈ కార్పొరేషను వ్యవహారాలను స్వతంత్రమైన ఒక సంఘం నిర్వహిస్తుంది. దానిలో రాష్ట్ర ప్రధాన కార్యదర్శి (అధ్యక్షుడు), మరి నలుగురు ప్రభుత్వోద్యోగులు, కేంద్ర ప్రభుత్వం నియమించిన వారు యిద్దరు, యిద్దరు అనధికారులు వుంటారు.

"పరిపాలనా విషయంలో జరిగిన ఈ మార్పు వల్లను, కేంద్ర ప్రభుత్వం చేసే ధనసహాయం వల్లను యీ కార్పొరేషను త్వరలోనే రాష్ట్రమంతటా సమన్వితమై సమర్థవంతమైన రోడ్డురవాణా సౌకర్యాలను కలిగిస్తుందని ఆశించబడుతున్నది.

## పొదుపు సంఘం

"పరిపాలనని పొదుపుతో సమర్థంగా నడిపేందుకై పరిపాలనా వ్యవస్థ పునర్వ్యవస్థీకరణకి సిఫార్సులు చేయడానికి కొంతకాలం క్రితం గౌరవ స్థానిక శాఖా మాత్యులు అధ్యక్షుడుగా ప్రభుత్వం ఒక పొదుపు సంఘాన్ని యేర్పాటు చేసింది.

"సెక్రటేరియట్ పునర్వ్యవస్థీకరణ విషయంలో ఆ సంఘం యిదివరకే తననివేదికను సమర్పించింది. ప్రభుత్వం యీ నివేదికను పరిశీలించి. అధిక భాగం సిఫార్సులను ఆమోదించడానికి నిశ్చయించింది. ఇందువల్ల సాలీనా రూ 10 లక్షలకి పైగా ఖర్చు తగ్గుతుంది. ఈ నిర్ణయాల్ని 1-4-58 నుంచి ప్రారంభించి రెండు అంచెలలో అమలు జరపాలని సంకల్పం. ఇప్పుడు యీ సంఘం ప్రభుత్వ శాఖల అధిపతుల కార్యాలయాల నిర్వహణను పరిశీలిస్తు

న్నది. ఆ తరువాత, జిల్లా, తాలూకా కార్యాలయాల విషయం కూడ పరిశీలిస్తుంది.

## వేతనపు స్కేళ్ల సవరింపు

"ప్రస్తుతం ఆహార ధాన్యాలు, తదితర వస్తువుల ధరలు హెచ్చుగా వున్నవి. ఇందుకు మాకందరికీ ఆందోళనగా వున్నదని సభ వారికి తెలియజేస్తున్నాను. ఇందువల్ల తక్కువ వేతనాలు కల ప్రభుత్వోద్యోగులు కష్టపడతారనడంలో సందేహం లేదు. పని, అర్హతలు మున్నగు అన్ని విషయాలలోను సమానులైన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల వుద్యోగుల వేతనాలలో చాలా వ్యత్యాస మున్నది. తక్కువ వేతనాల ప్రభుత్వోద్యోగుల పరిస్థితిని చక్క జేయడానికి, అవకాశం వుంటే మొట్టమొదట రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల పరిస్థితిని చక్క జేయాలి. రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల వుద్యోగ పరిస్థితులను స్థూలంగా పరిశీలించమని కేంద్ర వేతన నిర్ణాయక సంఘాన్ని అడగక పోవడం దుర దృష్టకరం. రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల వేతనపు స్కేళ్ల విషయంలో యేమీ సిఫార్సులు చేయక పోయినప్పటికీ, కేవలం కేంద్ర ప్రభుత్వోద్యోగుల వేతనపు స్కేళ్లను కాక మొత్తం దేశ ప్రయోజనాలను దృష్టిలో పెట్టు కోమని వేతన నిర్ణాయక సంఘానికి విజ్ఞప్తి చేయబడింది. కేంద్ర ప్రభుత్వోద్యోగుల వేతనాల నిర్ణయంలో రెండు అంశాలు లెక్కలోకి తీసుకోబడాలి. మొదటిది, దేశం మొత్తం మీద గల రాబడి ఆధారాలు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నాన్ గెజిటెడ్ వుద్యోగుల కోరికలను తీర్చడానికి దానికి గల స్థోమత. రెండవది, దేశంలో అన్ని చోట్ల ఒకేరకమైన వేతనాలు ఉండరాదు. ఖర్చు తక్కువయే ప్రాంతాల వేతనాలను ప్రాతి పదికగా తీసుకొని, ఖర్చు అధికంగా వుండే ప్రాంతాలలో స్థానిక లేక ప్రాంతీయ మైన చేర్పులు చేయ వచ్చును. అటువంటి ప్రాతి పదిక లేక ప్రాతిపదికలనిర్ణయంలో, ఆయారాష్ట్ర ప్రభుత్వాలు యిచ్చేవేత నాలను పరిశీలించి స్థానిక మైన వ్యత్యాసాలను తొలగించాలి. మామటుక్కి మేము వుద్యోగుల వేతనాలు హెచ్చించ లేదంటే, అందుకు కారణం కేవలం ప్రస్తుతపు ఆర్థిక పరిస్థితే. అయినప్పటికీ కూడా కేంద్ర ప్రభుత్వం, కొంత భారం వహిస్తుందని తెలియగానే, కరువు భత్యంలో రూ 6 హెచించడానికి మేము వెనుకాడలేదు.

"కేంద్ర ప్రభుత్వం మొదట సూచించిన పద్ధతి ప్రకారం, రూ. 12 గరిష్ఠ పరిమితి గల కరువు భత్యం అడ్ హాక్ హెచ్చింపుకయేవ్యయంలో కేంద్ర ప్రభుత్వం, నెల జీతం మొత్తం రూ. 60 మించని వారి సందర్భంలో 66 2/3 శాతాన్ని, నెల జీతం మొత్తం రూ. 100 మించని వారి సందర్భంలో 33 1/3 శాతాన్ని భరించవలసి వుంది. అయితే మేము యింకొక్క అడుగు ముందుకు వెళ్లి నెలజీతం మొత్తం రూ. 106 మించని వారందరికి కూడా రూ. 6 కరువు భత్యం వర్తింపును అనుమతించాం. ఈ సందర్భంలో అవసరమైన మార్జినల్ సర్దుబాట్లు చేయబడినవి. మళ్లీ 1958 జనవరిలో ప్రభుత్వం యీ పరిస్థితిని సమీక్షించి, నెలకి రూ. 100 వరకూ వేతనం గల వారికి మరొక రూ. 6 హెచ్చింపును ప్రకటించింది. అది గాక హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో నివసిస్తూ నెలకి రూ. 100 పైన రూ. 200 లోపున వేతనం తీసుకునే వుద్యోగులకి కూడా రూ. 6 లు కరువు భత్యాన్ని, మార్జినల్ సర్దుబాట్లకు లోబడి, హెచ్చించాలని నిశ్చయించబడినది. ఈ హెచ్చింపుల వల్ల మొత్తం రూ. 178 లక్షలు వ్యయం కాగలవని అంచనా దీనిలో కేంద్ర ప్రభుత్వం వాటా రూ. 78 లక్షలు. మిగిలిన రూ. 100 లక్షల్ని రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చవలసి వున్నది. ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం మొదట సూచించిన పద్ధతి సవరించ బడినది. ఈ కొత్త పద్ధతి ప్రకారం కేంద్ర ప్రభుత్వం, హెచ్చింపు తరువాత వేతనం నెలకి రూ. 100 మించని వుద్యోగుల సందర్భంలో అట్టి హెచ్చింపుకి (ప్రతి సందర్భంలోను రూ. 12 మించకుండా) కాగల అదనపు వ్యయంలో మూడింట రెండు వంతులను భరిస్తుంది. ఇందువల్ల యీ విషయంలో రాష్ట్ర ప్రభుత్వానికి కొంత వెసులు బాటు లభిస్తుంది.

"గ్రామోద్యోగుల విచారణ సంఘం సిఫార్సులపై, గ్రామోద్యోగుల వేతనాలలో కూడా దిగువ హెచ్చింపులను 1-1-1958 నుంచి ప్రభుత్వం మంజూరు చేసింది.

గ్రామ కరణాలు ... నెలకి రూ. 5
విలేజ్ హెడ్‌మెన్ ... " " 3
గ్రామ నౌకర్లు ... " " 2

"ఈ సందర్భంలో సంవత్సరానికి రూ 15 లక్షలు వ్యయం కాగలవు.

"ప్రాథమిక, సెకండరీ పాఠశాలల వుపాధ్యాయులకి కూడా ఆడ్‌హాక్ హెచ్చుదలను మంజూరు చేయాలని నిశ్చయించ బడినది. ఇందు నిమిత్తం వచ్చే సంవతరం బడ్జెటులో రూ. 34 లక్షలు కేటాయించ బడినవి. ఈ వ్యయంలో కొంత భాగాన్ని కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది.

"ప్రసంగాన్ని ముగించే ముందు, ఆర్థిక పరిస్థితి విషయంలో సంతృప్తి పడి వూరుకోడానికి అవకాశం లేదని మరొక మారు చెబుతున్నాను. వివిధ రంగాలలో మనం నిలకడగా పురోగమిస్తున్నాం. అయినా ప్రజలకి యింకా యెక్కువగా సంతృప్తిని కలుగజేయాలంటే యింకా యేమి చేయాలో మనకి తెలుసును. ప్రజల కోర్కెలు యింకా చాలా వున్నవి. వాటికి యీ సంవత్సరం బడ్జెటులో గాని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో గాని వసతి లేదు. మన రాబడిని అధికం చేసుకోడానికి కొత్త ఆధారాలను అన్వేషించవలసి వున్నది. పెట్టుబడి వ్యయానికై మనం యెక్కువ అప్పుకూడా చేయవలసి వున్నది. స్వల్ప మొత్తాల పొదుపు వుద్యమం, యేమాత్రం సడలింపు లేకుండా నిరంతరం కొనసాగించ బడాలి. డబ్బును పొదుపుగా వాడి, వెనుక వేసి పెట్టుబడి పెట్టమని మనం ప్రజలను వుద్బోధించాలి. మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కేవలం రెండవస్పుత్నిక్ వంటిది. దాని తరువాత యింకా యెన్నో రావలసి వున్నవి. 1958-59లో ప్రణాళిక వ్యయానికై రూ. 12 కోట్లకి పైగా యివ్వగలమని మనం ప్లానింగు కమిషన్‌కి చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలి.

"అవసరమైతే మన స్టాకులను విక్రయించైనా రిజర్వు బ్యాంకి బాకీని తీర్చివేయాలి. 4 శాతం వడ్డీ చెల్లిస్తూ పెద్ద మొత్తం ఓవర్ డ్రాఫ్టును వుంచుకొనడం మంచిది కాదు, వాంఛనీయమూ కాదు. మన స్టాకు మీద సగటున మనకి 2 3/4 శాతం వస్తుంది.

అగ్రశ్రేణి వ్యవసాయ విద్యా సంస్థ

# బాపట్ల వ్యవసాయ కళాశాల

బాపట్ల ప్రసక్తి వచ్చినప్పుడు ఇప్పుడు అక్కడి వ్యవసాయ కళాశాలను గురించి ఆలోచించకుండా వుండడం ఆంధ్రులికి సాధ్యం కాదు. ఒక విధంగా యీ కళాశాలలేని బాపట్ల శాంతినికేతనం లేని బోల్పూర్ లా వుంటుందని చెప్పవచ్చు. 18 సంవత్సరాలలో యీ సంస్థ భారతదేశంలోని వ్యవసాయ కళాశాలల్లో ప్రప్రథమమైన వాటిలో ఒకటిగా అభివృద్ధి చెందింది. ఇంటర్మీడియేటు పరీక్షలో వుత్తీర్ణులైన విద్యార్థులు జట్టు తరువాత జట్టు యిక్కడ వ్యవసాయ శాస్త్రాన్ని అభ్యసించి ఆంధ్ర విశ్వవిద్యాలయపు బి. ఎస్. సి. డిగ్రీని పొందుతున్నారు.

1945 లో యుద్ధానంతర పునర్నిర్మాణ సంఘం సమిష్టి మద్రాసు రాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాన్ని సూచిస్తూ, ఆ రాష్ట్రంలో రెండవ వ్యవసాయ కళాశాల ప్రారంభానికి అగ్రతమ ప్రాధాన్యత యిచ్చినది. అప్పటికే ఒకటి కోయంబత్తూరులో వున్నది. రెండవదాని స్థాపనకి బాపట్ల నిర్ణయమైన తరువాత, మద్రాసు గవర్నరికి అప్పుడు సలహాదారుగా వున్న శ్రీ ఎస్. వి. రామమూర్తి, ఐ. సి. ఎస్., 16-7-1945న దానికి ప్రారంభోత్సవం జరిపారు. ఇది వసతి సౌకర్యం గల కళాశాల. విద్యార్థులందరూ దానికి అనుబంధించబడిన వసతి గృహాలలో నివసించాలి.



బాపట్ల వ్యవసాయ కళాశాలలో కాయగూరల ప్రదర్శనం.



*కళాశాలలోని గ్రంథాలయం.*

మొదట అతిసామాన్యంగా ప్రారంభమైన యీ కళాశాల క్రమేణా బాగా అభివృద్ధి చెందింది. ప్రయోగశాలలు, లెక్చరు హాళ్లు, ఇన్స్పెక్టరీ, వసతి గృహం బ్లాకులు, ఆటస్థలాలు, విద్యార్థుల మండప వేదిక, ఆచరణకి పనికివచ్చే తగినన్ని పొలం భూములు, వృక్ష శాస్త్రపు తోటలు, పాడి పరిశ్రమ కేంద్రం, కోళ్ల పెంపక కేంద్రం, పశువైద్యశాల, కళాశాలా పురావస్తు ప్రదర్శనశాల, గ్రంథాలయం వంటి అనేకమైన కొత్త భవనాలు దీనికి చేర్చబడినవి.

ఇటీవలి వరకూ బి. ఎస్‌సి. (వ్యవసాయం) తొలి సంవత్సరంలో 98 మంది విద్యార్థులు మాత్రమే చేర్చుకోబడేవారు. కాని ద్వితీయ ప్రణాళిక క్రింద పరిశోధన, విస్తరణలకి సంబంధించిన అనేకమైన వ్యవసాయ పథకాల అమలుకి చాలమంది వ్యవసాయ

రమారమి 50 యెకరాల విస్తీర్ణంగల పొలం ఒకటి 1945 లో తాత్కాలికంగా కౌలుకి తీసుకోన బడింది. 1950 లో యిది ఒదిలి వేయబడి, యించుమించు 440 యెకరాల విస్తీర్ణంగల శాశ్వతపొలం సంపాదించ బడింది. ఇది కళాశాలకి వుత్తరాన 1 1/2 మైళ్ల దూరంలో వున్నది. ఆయా పద్ధతులకి ప్రాతినిధ్యం వహించే రకాల సాగుబడికి యిక్కడ స్థానమున్నది. ఈ పొలంలో 275 యెకరాల మెట్టభూమి, 50 యెకరాల తోట భూమి, 115 యెకరాల మాగాణి భూమి వున్నాయి. ఇంచుమించు 20 యెకరాల భూమిలో నిమ్మజాతి చెట్లు, జామ, సపోటా, మామిడి మున్నగు ఫలవృక్షాలు నాటబడినవి.

## పాడి పరిశ్రమ, కోళ్ల పెంపకం కేంద్రాలు

ఆధునిక పద్ధతులలో వెన్న, నెయ్యి వంటి పాడి వస్తువుల తయారీలో విద్యార్థులకి శిక్షణ యివ్వడానికి తగిన సాధన సంపత్తి కళాశాలా పాడి పరిశ్రమ కేంద్రంలో వున్నది. ఇక్కడ శిక్షణ ప్రయోజనాని కవసరమైనన్ని పాడిపశువులు పోషించ బడుతున్నవి. ఒంగోలు, సింధీ జాతుల ఆబోతులు, ఆవులు, ముర్రా బర్రెలు, దేశవాళీ రకాలుకూడా పోషించ బడుతున్నవి. కోళ్ల పెంపక కేంద్రంలో రోడ్ ఐలెండు రెడ్, వైట్ లెగ్ హారన్, ఆస్ట్రిలార్ప్, బార్డు ప్లిమౌత్ రాక్, బ్లాక్ మినోర్కా రకాలు పెంచబడు తున్నాయి.

## వృక్షశాస్త్రపు తోటలు

కళాశాల ఆవరణలో వృక్ష శాస్త్రపు తోట వున్నది. ఇది కళాశాలా విద్యార్థుల విద్యాబోధనకి పరిశోధనకి, కూడా వినియోగించ బడుతుంది. ఇక్కడ వృక్ష శాస్త్రానికి, వ్యవసాయానికి సంబంధించిన అనేక రకాల మొక్కలు పెంచ బడుతాయి. వీటిలో చెట్లు, పువ్వులుపూసే రకం, పుయ్యాని రకం పొదలు, పాకు మొక్కలు, తీగలు, కంచెమొక్కలు వగైరా అన్ని రకాలు వుంటాయి. పర్ణియమైన మొక్కలను పెంచే స్థలంకూడా ఒకటి విడిగా వున్నది. రెండు పెద్దపెద్ద దొరువులలో నీటి మొక్కలు పెంచబడతాయి. ఈ దొరువులలో గురామి, కట్ల, లాబియో వంటి రకాల చేపలు కూడా పెంచబడతాయి. వీటిద్వారా విద్యార్థులకి చేపల పెంపకం గురించి బోధించ బడుతుంది.

## పురావస్తు ప్రదర్శనశాల

కళాశాలకి అనుబంధితమైన పురావస్తు ప్రదర్శనశాలలో వ్యవసాయ సంబంధమైన వస్తువులు ప్రదర్శింప బడతాయి. ఇది విద్యార్థులకి, ప్రేక్షకులకికూడా వుపయోగిస్తుంది. దీని అభివృద్ధికి స్థలం కొరత ముఖ్యమైన ఆటంకంగా వున్నది.

## గ్రంధాలయం

ప్రధాన గ్రంధాలయాన్ని అధికార్లు, అధ్యాపక వర్గం, పరిశోధన విద్యార్థులు వుపయోగిస్తారు. వ్యవసాయ విషయాలలో కొత్తగా వెలువడిన పుస్తకాలు దాదాపు 15,000 వున్నాయి. ఇవికాక వారపత్రికలు, మాసపత్రికలు, (దేశీయ, విదేశీయ) వగైరా 140 కి పైగా తెప్పించ బడతాయి. విద్యార్థుల వుపయోగార్థం ముఖ్యంగా పాఠ్య పుస్తకాలుగల గ్రంధాలయం కూడా విడిగా నిర్వహించ బడుతున్నది. గ్రంధాలయానికి అనుబంధితమై ఒక పఠనాలయ మున్నది, దీనిలో కొత్తగా వెలువడే వార, మాస పత్రికలు వగైరా వుంచబడతాయి. విద్యార్థులకి గ్రంధాలయపు తరగతులు జరుప బడతాయి. కళాశాల వున్న రోజులలో అది మామూలుగా పనిచేసే సమయం లోనే కాక సాయంకాలం 6 గంటల నుంచి రాత్రి 9 గంటల వరకూకూడా పఠనాలయం, పరిశోధకుల సౌకర్యార్థం పని చేస్తుంది.

## కాలేజీ బోర్డు

కళాశాల వివిధ సెక్షన్ల అధిపతులు, సీనియరు డిప్యూటీ వార్డెను సభ్యులుగా గల కాలేజీబోర్డు కళాశాలకి, విద్యార్థులకి సంబంధించిన విషయాలను పరిశీలించి పైకి నివేదిస్తుంది. కళాశాల ప్రిన్సిపాలు యీ బోర్డుకి అధ్యక్షుడుగా వుంటారు. టైము టేబిలుల తయారీ, క్రమశిక్షణ, అప్పుడప్పుడు జరిగే పరీక్షల ఫలితాలు, విద్యార్థుల పురోగమనం వంటి విషయాలు యీ బోర్డు పరిశీలనకి వస్తాయి.

## గౌరవ విజిటర్ల బోర్డు

ఈ కళాశాల నిర్వహణలో గౌరవ హోదాలో అనధికారుల తోడ్పాటుకూడా స్వీకరించ బడుతుంది. ఇందునిమిత్తం గౌరవ ప్రేక్షకుల బోర్డు ఒకటి ఏర్పాటు చేయబడింది. గుంటూరు కలక్టరు దీని అధ్యక్షుడుగాను, కళాశాల ప్రిన్సిపాలు కార్యదర్శిగాను వుంటారు. సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, గుంటూరు జిల్లా పశువైద్య అధికారి, దీని అధికార సభ్యులుగా వుంటారు. అనధికార సభ్యులు 5 మంది వుంటారు. ఈ బోర్డు పనులు కేవలం సలహా యివ్వడానికి సంబంధించినవి. అనధికార సభ్యుల పదవీకాలం పరిమితి 3 సంవత్సరాలు.

## ట్యుటోరియల్ పద్ధతి

విద్యార్థులు, సిబ్బందిమధ్య సన్నిహిత సంబంధం యేర్పరచ డానికై ట్యుటోరియల్ పద్ధతి ప్రవేశ పెట్టబడింది. కళాశాల సిబ్బందిలోని వారందరూ గురువులు. ప్రతి గురువు అజమాయిషీలోను 10-12 మంది విద్యార్థులు వుంటారు. గురువులు సాధ్యమైనంత తరుచుగా విద్యార్థుల్ని కలుసుకుని వారి పురోగమనాన్ని గూర్చి చర్చిస్తారు, వారికి తెలియని విషయాలను వివరిస్తారు కూడా.

విద్యార్థులను అజమాయిషీ చేయడానికి, వారికి తోడ్పడ్డానికి, క్రిమశిక్షణను కాపాడ్డానికి యిద్దరు రెసిడెంటు ట్యూటర్లు వసతి గృహంలో నివసిస్తారు.

## వసతి గృహం

ఈ కళాశాలలో చదువుకునే విద్యార్థు లందరూ దానికి అనుబంధితమైన వసతి గృహాలలో నివసించాలి. ప్రిన్సిపాల్ ఎక్స్ అఫీషియో వార్డెనుగా వుంటారు. సిబ్బందినుంచి ప్రిన్సిపాల్ చే నియుక్తుడైన సీనియరు డిప్యూటీ వార్డెను యీ వసతి గృహాన్ని నిర్వహిస్తారు. వసతి గృహసంఘంలో సీనియరు డిప్యూటీ వార్డెను, విద్యార్థుల ప్రతినిధులు సభ్యులుగా వుంటారు.

ఈ వసతి గృహానికి అనుబంధితమై ఒకఔషధశాల వున్నది. అక్కడ విద్యార్థులికి వైద్య సహాయం లభిస్తుంది. బాపట్ల ప్రభుత్వ ఆస్పత్రి సహాయ శస్త్ర చికిత్సకులు ప్రతిరోజూ సాయంకాలం 5-6 గంటల మధ్య యీ ఔషధశాలకి వచ్చి అస్వస్థులైన విద్యార్థుల్ని చూస్తారు.

## విద్యార్థి సంఘం

ఈ కళాశాల కొక విద్యార్థి సంఘ మున్నది. కళాశాలా విద్యార్థులందరూ దానిలో సభ్యులుగా వుంటారు. ఈ సంఘంలో కసరత్తు, సారస్వతం, సాంఘిక విషయాలలో కృషి చేయడానికి మూడు శాఖలున్నాయి. ఈ సంఘ వ్యవహారాల నిర్వహణ కొకకమిటీ వున్నది. ప్రిన్సిపాల్ దీనికి ఎక్స్ అఫీషియో అధ్యక్షుడుగా వుంటారు. అధ్యాపక సిబ్బందినుంచి ప్రిన్సిపాల్ చే నియుక్తుడైన వ్యక్తి దీనికి వుపాధ్యక్షుడుగా వుంటారు. వీరుకాక దీనిలో వ్యాయామ విద్యా డైరెక్టరు, విద్యార్థుల ప్రతినిధులు సభ్యులుగా వుంటారు.

## సాంఘిక సేవాసంఘం

సాంఘిక సేవాసంఘం వ్యవహారాలను చూసే కమిటీలో అధ్యక్షుడు (ప్రిన్సిపాల్), వుపాధ్యక్షుడు, దాని కార్యదర్శి (విద్యార్థి సభ్యుడు) వుంటారు. దీని కవసరమైన డబ్బు విద్యార్థులు రూ 1/-చొప్పున యిచ్చేచందా ద్వారా సేకరించ బడుతుంది.

## సహకార స్టోర్సు

సిబ్బంది, విద్యార్థుల అవసరాలు తీర్చే నిమిత్తం ఒక సహకార స్టోర్సు నడుపబడు తున్నది. దీనిలో విద్యార్థులు, సిబ్బంది సభ్యులుగా వుంటారు. సిబ్బంది, విద్యార్థుల నుంచి యెన్నుకో బడిన డైరెక్టర్లబోర్డు యీ స్టోర్సు వ్యవహారాలను చూస్తుంది.

## వ్యవసాయ సమితి

ఆంధ్ర వ్యవసాయ సమితి 1954 లో స్థాపించ బడింది. దాని ముఖ్య కార్యాలయం వ్యవసాయ కళాశాలలో యేర్పరచ బడింది. ఈ సంఘంలో వ్యవసాయ శాఖ సభ్యులు, బాపట్ల, కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలల పూర్వ విద్యార్థులు, కళాశాల ప్రస్తుతపు విద్యార్థులందరూ సభ్యులుగా వుంటారు. వ్యవసాయాభివృద్ధికి దోహదం చేయడం,

వ్యవసాయ పరిశ్రమల్ని అభివృద్ధి పరచడానికి కూడా చాలా అవకాశం వున్నది. ఆహారోత్పత్తితో పాటు యీ పనినికూడా కొనసాగించాలి. మనం పంచదార పరిశ్రమలో స్పష్టమైన అభివృద్ధిని సాధించగలిగాం. ఇంకా అభివృద్ధిపరచడానికి ప్రయత్నాలు చేస్తున్నాం. అలాగే వస్త్ర పరిశ్రమ, జనపనార, నూనె పరిశ్రమలు, ఫల పరిశ్రమలను కూడా అభివృద్ధిచేయడానికి అవకాశాలున్నాయి.

ఆహారోత్పత్తిని పెంచి, వ్యవసాయ పరిశ్రమలను విస్తరింపచేయటంతోపాటు మన రాష్ట్రంలోని కొండ ప్రదేశాలలో కాఫీ, తేయాకుతోటల్ని, అక్కడ పెరిగే ఫల వృక్షాల్ని పెంచడానికిగల అవకాశాలనుకూడా పరిశీలించవలసి వున్నది.



కేంద్ర ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ డి. పి కర్మార్కర్ 29-1-1958 న నెల్లూరు లోని టి. బి. బ్లాకులను ప్రారంభించారు. టి. బి. బ్లాకులలో ఒక బ్లాకు దృశ్యాన్ని చిత్రంలో చూడవచ్చును.

# ప్రశ్నోత్తరావళి

**మొదటి ప్రశ్న :** ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం అరణ్య ప్రదేశమెంత వున్నది ?

**జవాబు :** ఇంచుమించు 24,700 చదరపు మైళ్ళు.

**2 వ. ప్రశ్న :** ఆంధ్రప్రదేశ్‌లో యెంత పంచదార వుత్పత్తి అవుతున్నది ? అది అఖిల భారత, ప్రపంచ వుత్పత్తిలో యెన్నోవంతు ?

**జవాబు :** 1955-56 లో ఆంధ్రప్రదేశ్‌లో 1,87,901 టన్నుల పంచదార వుత్పత్తి అయినది. ఇది భారత దేశపు వుత్పత్తిలో యించుమించు 7.4 శాతం లేక ప్రపంచపు చెఱకు పంచదార వుత్పత్తిలో 0.33 శాతం.

**3 వ. ప్రశ్న :** మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో చేనేత మగ్గాలు యెన్ని పనిచేస్తున్నాయి ?

**జవాబు :** నాలుగున్నర లక్షలపై చిలుకి.

**4 వ. ప్రశ్న :** ప్రస్తుతం మన రాష్ట్రంలో వున్న రేడియో లైసెన్సుల సంఖ్య యెంత ?

**జవాబు :** 1957 అంచనా సంఖ్య 29,691.

**5 వ ప్రశ్న :** ఏప్రిల్ నెలనుంచి మెట్రిక్ పద్ధతి తూకాలు, కొలతలు అమలులోకి వస్తాయని అంటున్నారు. ఆ పద్ధతి క్రింద (1) మైలు, (2) గేలను, (3) తులం అన్న పదాలకి సమతుల్యాలేమిటో క్లుప్తంగా తెలుపుతారా ?

**జవాబు :** ఒక మైలు 1.61 కిలో మీటర్లకి సమానం, ఒక యింపీరియలు గేలను 4.55 లిటర్స్‌కి సమానం, ఒక తులం 11.66 గ్రాములకి సమానం.

**6 వ. ప్రశ్న :** గడచిన సంవత్సరంలో భారతదేశం మొత్తంమీద యెంత చేనేత వస్త్రం వుత్పత్తి అయినది ?

**జవాబు :** 1957 జనవరి నుంచి అక్టోబరు వరకూ మొత్తంమీద 13,793.7 లక్షల గజాల చేనేత వస్త్రం తయారైనదని అంచనా.

**7 వ. ప్రశ్న :** మంజీరానది నీటిని హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలకి సరఫరా చేయాలనే ప్రతిపాదన యెప్పటికి కార్యరూపం ధరిస్తుంది ?

**జవాబు :** ఈ ప్రతిపాదన విషయంలో యిప్పుడు పరిశోధనలు జరుగుతున్నవి. ప్రభుత్వానికి నిపుణులు తమ సమాధానాన్ని యీ సంవత్సరం జూలై నాటికి సమర్పిస్తారు.

**8 వ. ప్రశ్న :** ఆంధ్రప్రదేశ్‌లో యెందరికి వ్యవసాయం జీవనోపాధిగా వున్నది ?

**జవాబు :** 210.4 లక్షల పైచిలు మందికి.

**9 వ. ప్రశ్న :** తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో వ్యవసాయంపై యెంత ఖర్చు చేయబడినది ?

**జవాబు :** రూ. 559.78 లక్షలు.

**10 వ. ప్రశ్న :** ద్వితీయ ప్రణాళిక క్రింద వ్యవసాయంపై యెంత ఖర్చు పెట్టబడగలదు ?

**జవాబు :** రూ. 854.24 లక్షలు.

పఠితలు ప్రశ్నల్ని యెప్పుడు అడిగినా సంపాదకుడు సంతోషంతో జవాబు యివ్వగలరు.

సంపాదకుడు
ఆంధ్రప్రదేశ్



1958 జనవరి 28, 29 తేదీలో శ్రీకాకుళం జిల్లాలో మూడవ జిల్లా స్థాయి చర్చా గోష్ఠి జరిగింది. ఆసందర్భంలో జిల్లా అదనపు జడ్జి, సెషన్సు జడ్జి (శ్రీ డి. సుబ్బారావు) పతాకాన్ని యెగుర వేయుట, అప్పుడు అక్కడ వున్న కలెక్టరు సతీమణి శ్రీమతి జయలక్ష్మీసుందరేశన్, శాసనసభ మాజీఅధ్యక్షుడు శ్రీ ఆర్.ఎల్.ఎన్. దొరప్రభృతులనుకూడా చిత్రంలోచూడవచ్చును.

# అభివృద్ధి కార్యక్రమాల కేంద్రాల విశేషాలు

### శ్రీ కాకుళంలో చర్చాగోష్ఠి :

1958 జనవరి 28-29 తేదీలలో శ్రీకాకుళం జిల్లాలో కలెక్టరు కార్యాలయంలో జిల్లా స్థాయిలో తృతీయ చర్చాగోష్ఠి జరిగింది. ఈ సందర్భంలో ప్రణాళికా ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. వివిధ రంగాలలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమ విశేషాలు, అభివృద్ధి బ్లాకులలోని పారిశ్రామిక కేంద్రములలో ఉత్పత్తి అయిన వస్తువులను ప్రతినిధులు, ప్రజలు సందర్శించడానికి వీలుగా యిది యేర్పాటుచేయబడింది. ఈ ప్రదర్శనములో సమాచార, సామాజిక కేంద్రం కూడా యేర్పాటు చేయబడింది.

అభివృద్ధి కార్యక్రమ గోష్ఠికి యిప్పుడు శాసనసభ్యుడు, శాసనసభ మాజీస్పీకరు అయిన

శ్రీ ఆర్.యల్.యన్. దొరగారు ప్రారంభోత్సవం చేస్తూ ప్రస్తుతపు సామాజికాభివృద్ధి పరిపాలనా వ్యవస్థలో మార్పు తీసుకొనిరావడం అవసరమని చెప్పారు. వివిధ అభివృద్ధి కార్యక్రమాలను అమలు పరచడంలో ప్రజలకు తగు స్థానమివ్వాలని ఉద్బోధించారు. జిల్లా ప్లానింగు. అభివృద్ధి కమిటిలో సభ్యుడుగా వున్న ప్రతివ్యక్తి ఏదైనా ఒక గ్రామాన్ని ఎన్నుకొని స్వయంగా దాని సర్వతోముఖాభివృద్ధికి పాలుపడాలని కూడ ఆయన విజ్ఞప్తి చేశారు. ఆసాయంత్రం వ్యవసాయ ప్రదర్శన స్థలంలో సాంస్కృతిక కార్యకలాపాలు ఏర్పాటుచేయబడినాయి. మంచి పంటల పెంపకం, మొక్కల రక్షణ విధానాలకి సంబంధించిన చలన చిత్రం కూడ ప్రదర్శించబడింది.

చర్చాగోష్ఠి రెండవ రోజున ఎజెండాలోని అంశాలను గూర్చి వివిధ గ్రూపులు చేసిన సిఫార్సులు చర్చించబడినవి. ఉత్పత్తి లక్ష్యాలను అధికారులకి బదులు ప్రతి కుటుంబానికి నిర్ణయించవచ్చునని, సాధారణ రాబడికంటె యెక్కువ సాధించిన కుటుంబాలకు భూమిశిస్తులో రిబేటు ఇవ్వవచ్చునని లోకసభ సభ్యుడు శ్రీ బి. రాజగోపాలరావు గారు సూచించారు.

ప్రతి అభివృద్ధి కేంద్రానికి సహకార మార్కెటింగు సంఘం ఉండాలనీ ప్రతి సంఘపు వాటా మూలధనం రు. 5000 లోపున వుండాలనీ సిఫార్సు



1958 జనవరి 28, 29 తేదీలలో శ్రీకాకుళం జిల్లాలో మూడవ జిల్లా స్థాయి చర్చాగోష్ఠి జరిగింది. జిల్లా కలెక్టరు (చర్చాగోష్ఠి అధ్యక్షుడు అయిన) శ్రీ వి. సుందరేశన్, ఐ. ఏ. ఎస్., గోష్ఠి పందిరి రిబ్బన్‌ని కత్తిరించి గోష్ఠిని ప్రారంభిస్తున్నారు.



1958 జనవరి 28, 29 తేదీలలో శ్రీకాకుళం జిల్లాలో మొదటి జిల్లా స్థాయి చర్చాగోష్ఠి జరిగింది. రెండవ ప్లెనరీ సెషన్‌లో గ్రూపులు జరిపిన చర్చల సారాంశాన్ని తెలియ జేస్తున్న కన్వీనరును (జిల్లా ప్లానింగు ఆఫీసరు), ఆసందర్భంలో అధ్యక్షత వహించిన కలెక్టరును, ముందు భాగంలో కూర్చున్న నాయకులను కూడా చిత్రంలో చూడవచ్చును.

చేయుబడింది. ఇది యీ గోష్ఠి సందర్భంలో జరిగిన ముఖ్యమైన సిఫార్సు. ప్రస్తుతం వున్న వయోజన విద్యా కేంద్రాలను వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలుగా మార్చాలని వాటిలో మామూలు విద్యకూడా బోధించబడాలని చర్చానంతరం యీ గోష్ఠి అంగీకరించింది. వయోజన విద్యార్థులు తాము ఇదివరకు చదువుకొరకై వినియోగించే కాలంలో సగం కాలం చదువుకోవాలనీ మిగిలిన కాలంలో ప్రయోజన కరమైన పనులు చేయాలనీ, అందుకై వారికి వేతనం ఇవ్వాలనీ ఈ పథకంలో తల పెట్ట బడింది.

## రైతుల పండుగ.

ఆహోబిల నృసింహస్వామి ఉత్సవ సందర్భంలో ఆళ్లగడ్డ (మల్లారెడ్డి వేదనగర్ అనంతర తీవ్ర కృషి కేంద్రం)లో 1-7-58 నుంచి 3-7-58 వరకు తిరునాళ్లు ఏర్పాటు చేయుబడినవి. ఈ సందర్భములో ఒక పశు ప్రదర్శనం కూడా ఏర్పాటుచేయబడింది. చుట్టు ప్రక్కల నున్న దాదాపు అన్ని గ్రామాల రైతులు ఇందులో పాల్గొన్నారు. శ్రేష్ఠమైన జాతికి చెందిన ఎద్లు, ముర్రాజాతి బర్రెలు, ఆవులు, పొట్టేళ్లు వగైరా యెన్నో యిక్కడికి కొనిరాబడినవి. అనేక విధాల ఇది రైతులకు ఆనంద దాయకమైన పండుగ.

ప్రజలు వీటిని చూచి ఆనందించి, ఉత్తమమైన పశువుల్ని పెంచడానికి తీర్మానించారు.

## తిర్మలాయ పాలెం సమాజాభివృద్ధి కేంద్రం.

బీరోలు గ్రామంలో 1958 జనవరి 29 నుంచి 31 తేదీ వరకు గ్రామనాయకుల శిక్షణ శిబిరం ఒకటి ఏర్పాటు చేయబడింది. ఇక్కడ 42 మంది గ్రామ నాయకులకు వ్యవసాయం, పశుపోషణ, సహకారం, నీటి పారుదల, పంచాయితీలు, విద్య, ఆరోగ్యం, పారిశుధ్యం మున్నగు వాటిలో శిక్షణ ఇవ్వబడింది. పెంట యెరువు తయారీ, పొగరాని పొయ్యిలు, సోకేజి గుంటలు మున్నగు వాటి విషయమై ప్రయోగపూర్వకమైన ప్రదర్శనలు ఏర్పాటు చేయబడినవి. బీరోలు గ్రామానికి చెందిన ఒక అనధికార ప్రముఖుడు శ్రీ వెంకటరామరెడ్డి యీ శిబిరాన్ని ఏర్పాటు చేయడానికి చాల శ్రద్ధగా కృషిచేశారు. అందుకు వలసిన ఖర్చులను భరించుటకై ప్రజలు రూ. 300 లు విరాళమిచ్చారు.

## సంజమల జాతీయ వికాస సేవాకేంద్రం.

కర్నూలు జిల్లా కలెక్టరు 1958 జనవరి 12వ తేదిన సంజమలలో ఒక గ్రంథాలయ సహితమైన సామాజిక కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో లోకసభ సభ్యుడు శ్రీ పి. వెంకట సుబ్బయ్యగారి అధ్యక్షతన ఒక బహిరంగ సభ ఏర్పాటుచేయబడింది. ఆయన రు. 180 లు విలువచేయు ఒక బీరువాను కొన్ని పుస్తకాలను విరాళమిచ్చారు. సామాజిక కేంద్రానికి వసతిని ప్రజలు సమకూర్చారు.

ఆరోజు సాయంత్రం గిద్దలూరు గ్రామంలో కలెక్టరు, 'రామకృష్ణ'. గ్రంధాలయానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ గ్రంధాలయానికి గ్రామస్థులు రూ. 250 ల విలువగల పుస్తకాలను విరాళంగా ఇచ్చారు.

## నూజివీడు సమాజాభివృద్ధి కేంద్రం.

నూజివీడు సముజాభివృద్ధి కేంద్రంలోని ఆగిరిపల్లి గ్రామంలో రథసప్తమి పండుగ సందర్భంలో **26-1-58 నుంచి 28-1-58** వరకు ఒక ప్రదర్శనం జరిగింది ఈ బ్లాకు క్రింద వున్న వివిధ గ్రామాలనుంచి సుమారు పది వేల మంది ప్రజలు ప్రదర్శనాన్ని చూడడానికి వచ్చారు. కుంభకార శిక్షణ కేంద్రం, **కుట్టుపని కేంద్రాలలో శిక్షణ పొందేవారు తయారు** చేసిన వస్తువులన్నీ ప్రదర్శించబడినవి. ప్లానింగు, కార్యక్రమానికి సంబధించిన పుస్తకములు ప్రజలకు సరఫరా చేయబడినవి. ప్రదర్శన హాలు ప్రక్కనే పఠనావకాశాలు కల్పించబడినవి.



ఆంధ్రప్రదేశ్ జిల్లాలు:

# కృష్ణా

కృష్ణా జిల్లా దక్షిణ భారత దేశంలో మిక్కిలి సారవంతమైన ప్రదేశాలలో ఒకటి. దీనికి వుత్తరాన ఖమ్మం. పశ్చిమ గోదావరి జిల్లాలు, దక్షిణాన, తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన కృష్ణానది వున్నాయి. ప్రసిద్ధమైన పూర్వ చరిత్ర గల యీ జిల్లా ప్రస్తుతం వివిధ కార్యక్రమాలకి కార్యరంగమై వున్నది. అభివృద్ధి పంథలో నడిచే ఆధునిక వుద్యమాలన్నిటిలోను ముందున్న యీ జిల్లా ఆంధ్ర ప్రదేశ్ జీవనాడుల వంటి కేంద్రాలలో ఒకటని అంటే అతిశయోక్తి కాదు.

పాత కృష్ణా జిల్లా 1925 లో కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలుగా విభజించబడింది. ప్రస్తుతపు కృష్ణా జిల్లాలో 1. డెల్టా ప్రదేశం. 2. మెట్ట ప్రదేశం అని రెండు రకాల ప్రదేశాలున్నాయి. డెల్టాప్రదేశంలో కృష్ణా తూర్పు డెల్టా యావత్తూ అనగా మచిలీపట్నం, దివి, గుడివాడ, కైకలూరు తాలూకాలు, విజయవాడ, గన్నవరం తాలూకాలలో కొన్ని భాగాలు వున్నాయి. మెట్ట ప్రదేశంలో నందిగామ, తిరువూరు, నూజివీడు తాలూకాలు, విజయవాడ, గన్నవరం తాలూకాలలో కొన్ని భాగాలు వున్నాయి.



శ్రీ శివరామ ప్రసాద్ బహదూర్, యార్లగడ్డ

## పురాణ గాథ

శ్రీరాముడు అరణ్యవాసం చేసే కాలంలో శ్రీరాముని పేర రాజ్యం చేసిన భరతుడు ఇక్ష్వాకుల రాజధాని యైన అయోధ్యా పట్నాన్ని విడిచి నందిగామలో స్థిరపడ్డాడని చెబుతారు. శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై యీ ప్రదేశం గుండా వెళ్లాడని గూడా చెబుతారు. శ్రీరామ చరిత్రతో సంబంధం గల ప్రదేశాలెన్నో యీ జిల్లా మెట్ట ప్రదేశాలలో వున్నాయి. మహాభారత కాలంలో అర్జునుడు పాశుపతాస్త్రం కొరకై విజయవాడకి సమీపంలో వున్న ఇంద్రకీలాద్రిపై తపస్సు చేశాడు. ఇక్కడ భారత గాథతో సంబంధం గల ప్రదేశాలు కూడా చాలా వున్నాయి.

## చరిత్ర

క్రీస్తు శకానికి పూర్వం యిక్కడ చెంచులు, కోయలు, యేనాదుల వంటి ఆటవిక జాతుల ప్రజలు నివసించే వారనీ, ద్రావిడులు ఆ తరువాత వచ్చారని చెబుతారు. క్రీస్తు శకం 200 లో ఆంధ్రులు యీ ప్రాంతంపై తమ ఆధిపత్యాన్ని ప్రతిష్ఠించి, కృష్ణా నదీ తీరంలో పట్టణాలను నిర్మించారు. వారు బౌద్ధమత పోషకులు కావడంవల్ల బౌద్ధ దేవాలయాలు, స్తూపాలు, చైత్యాలను కూడా చాలా నిర్మించారు.



శ్రీ కాకాని వెంకట సత్యనారాయణ, శా. స.

క్రీస్తుశకం 400 నాటికి యీ జిల్లా పల్లవుల పాలనలోకి వచ్చింది. ఆ తరువాత సాలంకాయనులు, విష్ణుకుండినులు దీని పరిపాలకులుగా వుండినారు. తూర్పు చాళుక్యులు క్రీ. శ. 700 నుంచి క్రీ.శ. 1100 వరకూ ఇక్కడ రాజ్యం చేశారు. ఆతరువాత వెలనాటి చోళులు క్రీ శ. 1700 వరకూ రాజ్యం చేశారు. కాకతీయుల పరిపాలన కొంత కాలం సాగింది. 1328 నుంచి 1424 వరకూ కొండవీటి రెడ్డిరాజులు పరిపాలించారు. ఆ తరువాత ఒరిస్సా గజపతి రాజులు తమ సైన్యాలను నెల్లూరు వరకూ నడిపించారు. కృష్ణ దేవరాయలు ఒరిస్సా

రాజుల్ని వుత్తర సర్కారుల నుంచి పారద్రోలిన తరువాత కూడా కొంత కాలం కృష్ణా జిల్లా నైజాం ఆధిపత్యం క్రింద వుండింది. ఆ తరువాత అది ఫ్రెంచివారిని, ఆంగ్లేయుల్ని ఆకర్షించింది ఫ్రెంచివారు మచిలీపట్నంలో ఒక కోటను నిర్మించారు, ఆంగ్లేయులు వారిని తరిమివేశారు. ఆఖరకి యీ జిల్లా ఆంగ్లేయుల స్వాధీనమైంది.

## పుణ్య క్షేత్రాలు

కృష్ణానదీ తీరానగల విజయవాడ కేవలం వాణిజ్య ప్రధానమైన ఆధునిక పట్టణమే కాక పుణ్యస్థలం కూడా. మామూలుగా పర్వదినాలలోను విశేషించి శివరాత్రినాడు పవిత్రమైన కృష్ణానదిలో స్నానము చేయడానికి వేలాది జనులు వస్తారు. కృష్ణానది సమీపంలో కనకదుర్గ ఆలయం వున్నది. శక్తి స్వరూపిణి యైన యీ దేవి దర్శనార్థం సంవత్సరం పొడుగునా యాత్రికులు దూర ప్రదేశాలనుంచి కూడా వస్తూ వుంటారు.


శ్రీ సి. రామకోటయ్య

క్రిందటి సంవత్సరం జూన్ లో జరిగిన కృష్ణా పుష్కరానికి అఖిల భారత ప్రాముఖ్యమున్నది. అప్పుడు లక్షలాది ప్రజలు కృష్ణవేణీ పావన తీర్థాన్ని సేవించారు. మచిలీపట్నానికి మూడు మైళ్ల దూరంలో వున్న చిలకలపూడిలో పాండురంగ దేవాలయము మున్నది. ఎంతో ఆకర్షణీయమైనయీ ఆధునిక దేవాలయం వల్ల యిటీవల యీ ప్రదేశం బాగా ప్రసిద్ధి కెక్కింది. ఇది పండరిపురం దేవాలయంతో సమానంగా వుందని చెబుతారు. ప్రతి సంవత్సరం ఆషాఢమాసంలో యేకాదశి రోజున యిక్కడ గొప్ప వుత్సవం జరుగుతుంది.


శ్రీ కె. అప్పారావు, శాసనసభ్యుడు, కైకలూరు

ఈ జిల్లాలో ఇప్పుడు సామాన్య ప్రదేశమైన శ్రీకాకుళం గ్రామం ఒకప్పుడు ఆంధ్ర సామ్రాజ్యపు రాజధానిగా ప్రకాశిస్తూ వుండేది. అక్కడ ఆంధ్ర విష్ణువు ఆలయం వుంది. ఇతడు రాజర్షి అయి వుండాలి. 1509 లో శ్రీకృష్ణదేవరాయలు యీ ఆలయంలో ఆరాధన జేసాడనీ, ఆదేవత ఆయన కలలో కనబడి తనమీద పద్యాల్లోనుని చెప్పాడని చెబుతారు. ఆ తరువాత మహారాజు వ్రాసిన పుస్తకం ఉద్గ్రంథాలలో ఒకటిగా వున్నది.

కృష్ణా తీరానగల కల్లేపల్లికి దక్షిణకాశి అని పేరు వున్నది. ఇక్కడ శివరాత్రికి గొప్ప వుత్సవం జరుగుతుంది. ఇక్కడ నాగేశ్వరాలయం కూడా వున్నది

ఘంటసాలలో హిందూ, బౌద్ధమత సంబంధమైన రెండు రకాల నిర్మాణాలు వున్నాయి. కాలభైరవ, సరస్వతీ విగ్రహాల విన్యాసం మొహంజొదారో శిల్పాల విన్యాసంతో సమానంగా వుంటుంది. నరసింహస్వామి విగ్రహం అతిలోక రమణీయంగా మలచబడిందని చెబుతారు. సరస్వతీ విగ్రహం ఆంధ్ర శిల్పుల నైపుణ్యానికి ప్రతిబింబం. బౌద్ధ స్తూపాలలో కూడా యిటువంటి శిల్ప నైపుణ్యమే గోచరిస్తుంది.


శ్రీ వి. కూర్మయ్య

జగ్గయ్యపేట కూడా బౌద్ధమత కేంద్రమే. ప్రాముఖ్యంగల ప్రదేశాలు యింకా చాలా వున్నాయి. ఉత్సవాలలో యిక్కడికి జిల్లా నుంచి, పై ప్రదేశాలనుంచి కూడా ప్రజలు వస్తారు.


శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు

## ముఖ్య స్థలాలు

ఘంటసాల (దివి తాలూకా) ఒకప్పుడు ముఖ్యమైన రేవుపట్టణం. వాణిజ్య రంగంలో దానికిగల

ప్రాముఖ్యం సుప్రసిద్ధ మైనది. ఇక్కడినుంచి వజ్రాలు, వస్త్రాలు యీజిప్టు, రోమునగరం వంటి విదేశ వాణిజ్య కేంద్రాలకి యెగుమతి అయేవి. ఇక్కడ గల ఒక బౌద్ధస్తూపం మొత్తం దక్షిణ దేశంలోకెల్లా మిక్కిలి సుందరమైనది. ఆంధ్రులు యీ రేవునుంచే విదేశ యాత్రలకి బయలు దేరారని చెబుతారు. 18 వ. శతాబ్దం వరకూ యిది తన ప్రాముఖ్యాన్ని నిలబెట్టు కున్నది. ఇదికాక మరి రెండు రేవు స్థలాలు కూడా ఇక్కడ వుండేవి.

కృష్ణాజిల్లాలో విజయవాడ, మచిలీపట్నం, గుడివాడ పట్నాలకి మునిసిపాలిటీలున్నాయి. జిల్లా ముఖ్యపట్నమైన మచిలీపట్నంలో సముద్రపు రేవు వున్నది. ఈ రేవుకి మంచి భవిష్యత్తు వుంది. రాష్ట్రంలో ముఖ్యమైన విద్యా కేంద్రాలలో మచిలీపట్నం ఒకటి, ఇక్కడ రెండు కళాశాలలున్నాయి.



శ్రీ పి. విశ్వేశ్వరరావు

డెల్టా అగ్రభాగానవున్న విజయవాడవద్ద కృష్ణా నదికి ఆనకట్ట నిర్మించబడింది. విజయవాడ తన వునికినిబట్టి, ప్రధానమైన రైల్వే కేంద్రం కావడం వల్లకూడా అతి శీఘ్రంగా అభివృద్ధి చెందుతున్నది. కృష్ణాజిల్లాలో విజయవాడ మీదుగాపోయే మద్రాసు-కలకత్తా బ్రాడ్ గేజ్ ప్రధాన రైలుమార్గం ఈశాన్య దిశగా విజయవాడ-యేలూరు కాలవ ప్రక్కనుంచి నిర్మించబడింది. ఒక మీటర్ గేజ్ మార్గం మచిలీపట్నం, విజయవాడలను కలుపుతుంది. ఆంధ్ర సిమెంటుఫ్యాక్టరీ విజయవాడలో వున్నది. ఇక్కడ ఔషధాల తయారీ పరిశ్రమ కూడా వుంది. రెండు కళాశాలలు, పురావస్తు ప్రదర్శనశాల వున్నాయి.



శ్రీ పి. సుందరయ్య

గుడివాడ, జగ్గయ్యపేటలకి కూడా వాణిజ్య ప్రాముఖ్యమున్నది.

కొండపల్లి బొమ్మల పరిశ్రమకి ప్రసిద్ధి. ఇక్కడ చరిత్రాత్మకమైన కోటవున్నది.

తిరువూరులో ఒక వృత్తి విద్యాశిక్షణ కేంద్రమున్నది.

కూచిపూడి గ్రామం కూచిపూడి నాట్యానికి జన్మస్థలం.

## స్త్రీ జనాభ్యుదయం

విజయవాడలో ఒక స్త్రీ జనసంక్షేమ కేంద్రం వుంది. దీనికి ఆడివిన్నాకులం, తిరువూరు, విస్సన్నపేటలలో శాఖలున్నాయి.

## వ్యవసాయం, సాగునీటి సరఫరా

ఇది వ్యవసాయ ప్రధానమైన జిల్లా. ఇక్కడ ముఖ్యమైన సాగునీటి వనరు కృష్ణానది. కృష్ణానది క్రింద 10 లక్షల యెకరాలకి మించిన ఆయకట్టు వుంది. తమ్మిలేరు, బుడమేరు, వుప్పుటేరు. నక్కవాగులు ఇక్కడ ప్రవహించే చిన్న నదులు. 100 యెకరాలు, అంతకు మించిన ప్రదేశానికి నీటి సరఫరా చేసే పంటచెరువులు 362,100 యెకరాల లోపు ఆయకట్టుకి సరఫరా చేసేవి 197 వున్నాయి. 3,261 గొట్టపు బావులున్నాయి. ప్రధానపంట వరి. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో గోదావరిడెల్టా తరువాత మిక్కిలి ముఖ్యమైన ఆహారోత్పత్తి ప్రదేశం కృష్ణాడెల్టాయే.



శ్రీ ఎమ్. రామేశ్వరరావు

ఇటీవల తెరువబడిన కృష్ణా బారేజ్-రెగ్యులేటరు కృష్ణాజిల్లాలో 46,000 యెకరాలకి, గుంటూరు జిల్లాలో 71,000 యెకరాలకి నీటి సరఫరా చేస్తుంది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద కృష్ణాజిల్లాలో ప్రథమ పంట క్రింద 1.5 లక్షల యెకరాలకి, రెండవపంట క్రింద 4.5 లక్షల యెకరాలకి నీరు లభిస్తుంది.



శ్రీ మరుపిళ్ల చిట్టి

## రవాణా సౌకర్యాలు

కాలవలు జిల్లాలోపల రవాణా సౌకర్యాలను కల్పిస్తాయి. ఇటీవల రోడ్డు రవాణా బాగా అభివృద్ధి చేయబడింది. దాదాపు పెద్ద గ్రామాలన్నీ రోడ్ల ద్వారా సమీపములో వున్న పట్టణాలకి జిల్లాగుండా పోయే గ్రాండు ట్రంక్ రోడ్డుతో కలుప బడినవి.



శ్రీ ఎ. కాళేశ్వరరావు (శాసన సభఅధ్యక్షులు)

## పరిశ్రమలు

విజయవాడలో వున్న పరిశ్రమలు కాక మచిలీపట్నంలో శాస్త్రీయ పరికరాల కంపెనీ, రసాయన పరిశ్రమలు వున్నాయి. జిల్లాలో తగినన్ని బియ్యం మిల్లులున్నాయి. వుయ్యూరులో పంచదార ఫ్యాక్టరీ వున్నది. జగ్గయ్యపేటలో తగినంత ముడి ఇనుం వుంది.

ఇది వ్యవసాయ ప్రధానమైన జిల్లాయే అయినప్పటికీ పారిశ్రామికంగా చకచకా అభివృద్ధి చెందుతున్నది. త్వరలోనే యిది ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక పటంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

ఈ జిల్లా వైశాల్యం 3,496 చదరపు మైళ్ళు జన సంఖ్య 17,79,484. దీనిలో పది తాలూకాలున్నాయి. దీని విస్తీర్ణం 22,39,187 ఎకరాలలో అడవులు 2,67,047 ఎకరాలు సాగు లాయకైన భూమి 4,21,848 ఎకరాలు, సాగయే భూమి 2,39,462 ఎకరాలు వున్నది. 1954-55 లో నికరం 13,18,948 ఎకరాలలో విత్తనాలు చల్ల బడినవి.



శ్రీ చంద్రశేఖర్, ఐ. ఎ.ఎస్. వీరు ఇటీవలి వరకూ కృష్ణా జిల్లా కలక్టరుగా వున్నారు.





ఇండియా రక్షణ. శాఖామాత్యులు శ్రీ వి. కె. కృష్ణమీనన్ గౌరవార్థం 2 2.1958 న జరుపబడిన ఎన్. సి. సి. పెరేడు దృశ్యం.



2-2-1958 న వుస్మానియా విశ్వవిద్యాలయం స్నాతకోత్సవ సందర్భంలో రక్షణ శాఖామాత్యులు ప్రసంగిస్తున్నారు



హైదరాబాదు, సికిందరాబాదు నగరాలు 2.2.1958 న శ్రీ వి. కె. కృష్ణమీనన్‌కి పౌరసన్మానం చేస్తున్న దృశ్యం



2.2.1958 న నిజాం కళాశాలలో కాశ్మీర్ నేషనల్ ఫ్రంటు యేర్పాటుచేసిన సమావేశంలో ప్రసంగిస్తున్న శ్రీ వి. కె. కృష్ణమీనన్.



ఆంధ్రప్రదేశ్ సహకార శాఖామాత్యులు నవాబ్ మెహిదీ నవాజ్‌జంగు 19-2-1958 న హైద్రాబాదు చేనేత కేంద్ర సహకార అసోసియేషన్ లిమిటెడ్ అష్టమ వార్షికోత్సవాలను ప్రారంభిస్తున్నారు. ఆసందర్భంలో ధర్మాదాయ, పరిశ్రమల శాఖామాత్యులు శ్రీ ఎ. భగవంతరావు అధ్యక్షత వహించారు.



7-2-1958 న అనంతపురంలో జి. హెచ్. ఆస్పత్రికి శంకుస్థాపన చేసిన పిదప ప్రసంగిస్తున్న



కేంద్ర ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ డి. పి. కర్మార్కర్ 28-1-1958 న ప్రభుత్వ జనరలు ఆస్పత్రి ఫ్లాట్ పేమెంటు శాఖను ప్రారంభించారు.



Statement about ownership and other particulars about news paper (ANDHRA PRADESH) to be published in the first issue every year after the last day of February.

**FORM IV.**

(See Rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | ... | Hyderabad. |
| 2. | Periodicity of its publication | ... | Monthly. |
| 3. | Printer's Name | .. | Sri S. Krishna Rao, Citizen Press. |
| | Nationality | ... | Indian. |
| | Address | ... | Park Lane, Secunderabad. |
| 4. | Publisher's Name | ... | Director of Information and Public Relations. |
| | Nationality | ... | Indian. |
| | Address | ... | Mukkaramjahi Road, Hyderabad-1. |
| 5. | Editor's Name | ... | Sri Narsing Rao Manvi. |
| | Nationality | ... | Indian. |
| | Address | ... | Director of Information and Public Relations, Government of Andhra Pradesh, Mukkaramjahi Road, Hyderabad-1. |
| 6. | Names and Addresses of individuals who own the newspapers and partners or share-holders holding more than one per cent of the total capital | | * * * |

I, Sri Narsing Rao Manvi, Director of Information and Public Relations, Government of Andhra Pradesh, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/- **Narsing Rao Manvi.**

Dated : 28-3-1958.

Signature of Publisher.

---

* The Director, Government Printing Press, Government of Andhra Pradesh, Hyderabad-Deccan, is the official Printer but he may name any other Printer when the Government Press cannot undertake pr inting of this journal.

డా. రావు : వుందండీ. పరిసరాలలో మంచి రకం సున్నపురాయి, బొగ్గు లభిస్తవి కనుక మనం మరికొన్ని సిమెంటు ఫ్యాక్టరీలను నెలకొల్పుకో వచ్చు. ప్రస్తుతం విజయవాడ, మంగళగిరులలో రెండు ఫ్యాక్టరీలున్నవి. మరి 7 నిర్మాణ దశలో వున్నవి.

## పింగాణీ పరిశ్రమ

శ్రీ నాయక్ : పింగాణీ పరిశ్రమ అభివృద్ధి కోండి ?

డా. రావు : అందుకూ వుందండీ. కుండలు, బొమ్మలు, పింగాణీ సామాను మున్నగువాటి తయారీకి పనికివచ్చే మట్టి రాష్ట్రంలో చెక్కు చోట్ల సమృద్ధిగా వున్నది. దీనిని సాధ్యమైనంత యెక్కువగా వుపయోగించుకోవాలి. గూడూరు లోని ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీలో ప్రస్తుతం యెక్కువగా వాడకమవుతున్న పింగాణీ పాత్ర సామాను, శానిటరీ సామాన్లు మాత్రమే తయారవుతున్నవి. టన్నెల్ కిల్న్ స్థాపనతో హై, లో టెన్షన్ ఎలెక్ట్రికల్ ఇన్సులేటర్ల వుత్పత్తి ఆరంభమవుతుంది. ఆ ఫ్యాక్టరీలో ప్రస్తుతం తయారయే సరుకుల వుత్పత్తికూడా హెచ్చుతుంది. చిన్నరకం పరిశ్రమల విషయంలో రాజమండ్రీలో ఒక రాతి గొట్టాల ఫ్యాక్టరీ నెలకొల్పబడుతున్నది. రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో కుంభకార పరిశ్రమ, పింగాణీ పరిశ్రమలలో శిక్షణ-వుత్పత్తి కేంద్రాలు కూడా యేర్పాటు చేయబడతవి.

శ్రీ వామనరావు : పంచదార పరిశ్రమమాట యేమిటండీ మరి ?

డా. రావు : బోధన్ లోని నిజాం షుగర్ ఫ్యాక్టరీ ఆసియాలోని మిక్కిలి పెద్ద పంచదార ఫ్యాక్టరీలలో ఒకటి. ఇది రోజుకి 3,750 టన్నుల చెఱకును ఆడగలదు. ఇదిగాక ఆంధ్ర ప్రాంతంలో మరి 9 పంచదార ఫ్యాక్టరీలు పని చేస్తున్నవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో 6 సహకార పంచదార ఫ్యాక్టరీలను నెలకొల్పాలని కూడా సంకల్పించబడింది.

శ్రీ నాయక్ : మన రాష్ట్రంలో పొగాకు వుత్పత్తి అవుతున్నదాండీ ?

డా. రావు : ఆఁ. ప్రస్తుతం హైదరాబాదులో 4 సిగరెట్టు ఫ్యాక్టరీలున్నవి. అవి యించుమించు 48,000 లక్షల చౌకరకం సిగరెట్లను తయారు చేస్తవి. ఈ ఫ్యాక్టరీలు పొగాకును ఆంధ్ర ప్రాంతం నుంచి తెప్పించుకుంటవి.

శ్రీ వామనరావు : మరి, ప్రత్తి, జనపనార కూడా అటువంటి వ్యవసాయ వస్తువులే కదా. అవి యెలా వుపయోగించబడుతున్న వంటారు ?

డా. రావు : అదీ చెబుతాను. ఆంధ్రప్రదేశ్ లో 14 బట్టల మిల్లులున్నవి. వాటిలో 8 తెలంగాణాలో వున్నవి. వాటిలో పనిచేసే మొత్తం కదుళ్ల సంఖ్య యించుమించు 2,16,882. మగ్గాల సంఖ్య 1,793. ఇవి గాక 12,000 కదుళ్లతో పని చేయు మరొక బట్టల మిల్లు నిర్మితమవుతున్నది. కొంతకాలం క్రితం మూసివేయబడిన హైదరాబాదు నూలు, నేతమిల్లు మళ్లీ సహకార నూలు మిల్లుగా పని ప్రారంభిస్తుందని భావించబడుతున్నది. చీరాలలో మరొక సహకార నూలు మిల్లు నెలకొల్పబడుతున్నది.

జనపనార విషయంలో, నెల్లిమర్ల, చిట్టివలస (విశాఖపట్నం జిల్లా), ఏలూరు (పశ్చిమ గోదావరి జిల్లా), గుంటూరులలో మొత్తం నాలుగు జనపనార మిల్లులున్నవి.

శ్రీ నాయక్ : రాష్ట్రంలో మరికొన్ని ముఖ్య పరిశ్రమల స్థాపనకేమైనా అవకాశాలున్నాయాండీ ?

డా. రావు : ఎందుకు లేవండీ ? ప్రాగాటూల్సు కార్పొరేషన్ కి పెద్ద మెకానికల్ వర్కుషాపు వున్నది. ఆధునిక యంత్ర సామగ్రితో పనిచేసే

ఆ వర్కుషాపు కొలత, మార్కింగు సాధనాలను, వివిధ మెషిన్, చేతి పరికరాలతో సహా, తయారు చేస్తున్నది. రెఫ్రిజి రేటర్లు, బస్సు ప్రధాన భాగాలు, రైల్వే వాగన్లు మున్నగువాటి తయారీకై ఆల్విన్ వర్కుసుకి కూడా ఒక విస్తరణ కార్యక్రమమున్నది. ఇంజన్లు మున్నగువాటిని, విశాఖపట్నం లోని హిందూస్థాన్ నౌకా నిర్మాణ కేంద్రంలో నౌకల నిర్మాణాని కవసరమైన వివిధ విడి భాగాలు మున్నగు వాటిని తయారుచేయుటకై యించుమించు రూ. 4 కోట్ల వ్యయంపై ఒక ఫ్యాక్టరీని నెలకొల్పాలని సంకల్పించబడింది.

శ్రీ వామనరావు : మధ్యలో అడ్డు వస్తున్నందుకు క్షమించాలండి. తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో పరిశ్రమల అభివృద్ధికి తీసుకున్న చర్యలేమిటో తెలియజేస్తారా ?

డా. రావు : ఆంధ్ర రాష్ట్రం 1.10.53న యేర్పడింది. ఆంధ్రపారిశ్రామికంగా యెక్కువ అభివృద్ధి చెందలేదు. కాబట్టి తొలి ప్రణాళిక కాలంలో వ్యవసాయానికి అధికతమ ప్రాధాన్యత యివ్వబడింది. అయితే వ్యవసాయంలో యెక్కువ వున్నవారిని క్రమేణా పరిశ్రమలలోనికి, వుద్యోగాలలోనికి పంపకపోయినట్లయితే ఒక హద్దును మించి వ్యవసాయం అభివృద్ధి చెందలేదు. కార్మికులు వ్యవసాయంలో కంటె పరిశ్రమలలో యెక్కువ సాధిస్తారనే విషయాన్ని పురస్కరించుకుని కూడా పరిశ్రమల్ని శీఘ్రంగా అభివృద్ధి చేయవలసి వున్నది. ప్రభుత్వ విభాగంలో భారీ పరిశ్రమల అభివృద్ధికై, అంకు రార్పణ జరిగింది.

తెలంగాణా ప్రాంతంలో తొలి ప్రణాళిక కాలంలో, సిర్పూరు కాగితం మిల్లులు లిమిటెడ్, సిర్ సిల్కు లిమిటెడ్, సింగరేణి బొగ్గుగనుల కంపెనీ లిమిటెడ్ లకు ఆర్థిక సహాయం చేయబడింది. శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనవుద్దేశించ బడిన కేంద్ర లేబొరేటరీల భవన నిర్మాణ కార్యక్రమానికై రూ 17.00 లక్షలు వెచ్చించ బడినవి.

శ్రీ నాయక్: ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధికై యెంత సొమ్ము కేటాయించ బడిందండి?

డా. రావు: రూ 1,425.95 లక్షలు వీటిలో రూ 292.72 లక్షలు, భారీ పరిశ్రమల కుద్దేశించ బడినవి. ఇదికాక, ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలకు కేంద్ర కేటాయింపుక్రింద మరి రూ 985 లక్షలు కేటాయించ బడినవి.

## సక్రమాభివృద్ధి

శ్రీ వామనరావు: రావుగారూ, యిప్పుడు మాకు తెలియ చేసిన వివరాలను బట్టి, ప్రాంతీయమైన హెచ్చు తగ్గుల్ని నివారించాలని మీరు భావించడం లేదా?

డా. రావు: భావిస్తున్నాను వామనరావుగారూ. పరిశ్రమలు ఒక ప్రాంతంలో తక్కువగాను, మరొక ప్రాంతంలో యెక్కువగాను కాక అంతటా సమానంగా వుండేట్లు చూడటానికి, సమన్వయ పూర్వకమైన పారిశ్రామికాభివృద్ధిని సాధించటానికి ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వ విభాగంలో కొన్ని పరిశ్రమల్ని నెలకొల్పడం అవసరం. ఉదాహరణకి రసాయన యెరువుల ఫ్యాక్టరీ, లోటెంపరేచర్ కార్బొనైజేషన్ ప్లాంటు, డీసిల్ ఇంజన్ ఫ్యాక్టరీ, స్ట్రక్చరల్ వర్కుషాపు, సోడా యాష్ ప్లాంటు, చిన్నరకం వుక్కుప్లాంటు మున్నగునవి.

శ్రీ వామనరావు: కుటీర, లఘు పరిశ్రమల్ని గురించి కూడా యేమైనా కొంచెం చెబుతారా?

డా. రావు: తప్పకుండాను. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కుటీర, లఘు పరిశ్రమలకు విస్పష్టమైన పాత్రవున్నది. అవి చాల మందికి పూర్తికాలం పనిని, సగం కాలం పనిని కల్పిస్తవి. వాటివల్ల చిన్న యెత్తు వస్తుసంపద, పెట్టుబడి, పనికౌశలం వుపయోగానికి వస్తున్నవి. ద్వితీయ పంచవర్ష

ప్రణాళికలో యీ విభాగం అభివృద్ధికై ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వివిధ చర్యల్ని గైకొన్నది. రాష్ట్రంలో పరిశ్రమల శీఘ్రఅభివృద్ధికి చక్కని అవకాశాలున్నవి. ఈ సందర్భంలో ఫలితాలు, ప్రభుత్వ, ప్రైవేటు విభాగాలలో జరిగే యేకీకృతమైన కృషిపై ఆధార పడి వుంటవి.

ఏమండీ, మీరు రాష్ట్ర ప్రభుత్వం అమలు జరుపుతున్న అభివృద్ధి కార్యక్రమాల్ని అర్థం చేసుకున్నందుకు నాకు చాల సంతోషంగావుందండీ. ప్రకృతి మాత ఆంధ్రప్రదేశ్‌కి పుష్కలమైన వస్తు సంపదను ప్రసాదించింది. దానిని సద్వినియోగం చేసుకోవలసిన బాధ్యత మన మీదవుంది. అర్థ, అంగ బలాలను, యంత్ర సామగ్రిని సమీకరించి, అవసరమైతే పెట్టుబడి, యంత్ర సామగ్రి, సాంకేతిక విషయపరిజ్ఞానాల సేకరణలో విదేశ సహాయాన్ని కూడా తీసుకుని పారిశ్రామిక రంగానికి నాయకత్వం వహించే ఒక తరగతి పారిశ్రామికులు మన రాష్ట్రంలో తయారు కావలసి వుంది. మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి పారిశ్రామికీకరణ మొక్కటే శరణ్యం. ఇందువల్ల కొనుగోలు శక్తి, వుద్యోగావకాశాలు హెచ్చుడమే కాక ఆర్థిక వ్యవస్థలో వైవిధ్యానికి కూడా మార్గ మేర్పడు తుంది.

[ఆలిండియా రేడియో సౌజన్యంతో]



# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న (11) : ఆంధ్రప్రదేశ్‌లో బహుళార్థ సాధక పాఠశాలలు యెన్ని వున్నవి ?

జవాబు : 37,479.

ప్రశ్న (12) : జరిగే సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్‌లో విద్యపై యెంత సొమ్ము ఖర్చు చేయబడుతుంది ?

జవాబు : బడ్జెట్టులో రూ. 11,68,98,000 కేటాయించబడినవి.

ప్రశ్న (13) : కర్నూలులోని ప్రభుత్వ స్త్రీల కళాశాల యెప్పటినుంచి పని ప్రారంభిస్తుంది ?

జవాబు : 1958-59 విద్యా సంవత్సరం నుంచి.

ప్రశ్న (14) : తాజా అంచనా ప్రకారం మన దేశం జనసంఖ్య యెంత ? (1951 జనాభా లెక్కలు కావని గమనించ ప్రార్థన). భారతదేశంలో సరిగ్గా యెన్ని గ్రామాలున్నాయి ?

జవాబు : లభ్యమయే తాజా అంచనా అల్లా 1955 అంచనాయే. దాని ప్రకారం జనసంఖ్య యించుమించు 3820 లక్షలు. భారతదేశంలో 5,58,089 గ్రామాలున్నవి.

ప్రశ్న (15) : మన దేశంలో తలసరి సగటు రాబడి అంచనా యెంత ?

జవాబు : 1952-53 అంచనా ప్రకారం రూ. 267.

ప్రశ్న (16) : బోధన్‌లోని పంచదార ఫ్యాక్టరీకి వున్న వ్యవసాయ భూమి యెంత ? అక్కడ సగటు యెకరా వుత్పత్తి యెంత ?

జవాబు : 15,997 యెకరాలు. సగటు యెకరా వుత్పత్తి 46 టన్నులు.

ప్రశ్న (17) : మెట్రిక్ సిస్టంలో యెకరం దేనికి సమానం ?

జవాబు : ఒక యెకరం 4046.856 చదరపు మీటర్లు లేక 0.404 హెక్టర్లకి సమానం.

ప్రశ్న (18) : ఆంధ్రప్రదేశ్‌లో యిప్పుడు వ్యవసాయ పరిశోధన కేంద్రాలు యెన్ని వున్నవి ?

జవాబు : మొత్తం 34 పరిశోధన కేంద్రాలు పని చేస్తున్నవి.

ప్రశ్న (19) : భారతీయ రైలుమార్గాలపై యెంత సొమ్ము పెట్టుబడి పెట్టబడింది ? వాటి ద్వారా యెంత సామాను రవాణా అవుతున్నది ? ఎందరు ప్రయాణీకులు రాకపోకలు జరుపుతున్నారు ? మొత్తం వాటి నిడివి యెంత ?

జవాబు : మొత్తం పెట్టుబడి రూ. 1,00,000 లక్షలకు మించుతుంది. దేశంలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వెళ్లే సామానులో 80 శాతం రవాణా, ప్రయాణీకులలో 70 శాతం ప్రయాణాలు రైళ్ల ద్వారా జరుగుతున్నవి. 1956 మార్చి 31 వ. తేదీనాటికి వున్న రైలుమార్గాల నిడివి 34,705 మైళ్లు.

# మెదక్

మెదక్ జిల్లాకు వుత్తరాన నిజామాబాదు, దక్షిణాన మహబూబునగరం, తూర్పున వరంగల్లు, పశ్చిమాన మైసూరు రాష్ట్ర భూభాగం (బీదర్ జిల్లా) వున్నవి. దాని విస్తీర్ణం 3,851 చ. మైళ్లు. జన సంఖ్య 10,93,985. భాషలు: తెలుగు, వుర్దూ, కన్నడం.



శ్రీ కృష్ణమాచారి, శా. స. (సంగారెడ్డి)

శీతోష్ణస్థితి సంవత్సరంలో చాల భాగం చక్కగా, అహ్లాదకరంగా వుంటుంది. ఇక్కడ భూమి స్థూలంగా మూడు రకాలుగా విభజింపబడింది. 1. ఇసుక బంక మట్టినేలలు 2. ముదురు యెరుపుతో కూడిన బూడిద వర్ణం నేలలు 3. నల్ల రేగడ భూములు.

## వర్షపాతం

వర్షాలు యెక్కువగా జూలై, అగస్టు, సెప్టెంబరు నెలల్లో కురుస్తవి. సగటు వర్షపాతం 36-45 అంగుళాల మధ్య వుంటుంది. వర్షాలు జిల్లా అంతటా ఒకేలా కురియవు.



శ్రీ పి. వి రాజేశ్వర రావు. శా. స. (సిద్దిపేట)

## వ్యవసాయం

బియ్యం, జొన్న, మొక్కజొన్న, సాములు, రాగులు యీ జిల్లా ప్రధాన పంటలయి వున్నవి. పారిశ్రామిక పంటలలో ఆముదాలు, వేరుసెనగ ముఖ్యమైనవి.

## జనాభా



శ్రీ ఆర్. నరసింహా రెడ్డి శా. స. (గజ్వేల్)

జనసంఖ్యలో యించుమించు 80%కి వ్యవసాయం జీవనోపాధియై వున్నది. ఇందులో పని చేసేవారు దాదాపు 50%. నేత పని వారు మొత్తం జనాభాలో 5% వుండగా పరిశ్రమలు, వాణిజ్యంలో వున్న వారు యించుమించు 10% వుంటారు. ఇక్కడ కొన్ని కుటీర పరిశ్రమలు వున్నవి. చాలా గ్రామాలలో కంబళ్లు నేయబడుతవి. సిద్దిపేట, సంగారెడ్డి పట్టణాలు సిల్కు బట్టలకి ప్రసిద్ధి. మెక్కు ప్రదేశాలలో చర్మకార పరిశ్రమ కూడా వున్నది.

## రాకపోకల సౌకర్యాలు

ఈ జిల్లాగుండా మూడు జాతీయ రహదార్లు పోతున్నవి. 1. హైదరాబాదు-షోలాపూరు రోడ్డు 2. హైదరాబాదు - నాగపూరు రోడ్డు 3. హైదరాబాదు - నాందేడు- అకోలా రోడ్డు. ఈ జిల్లా వివిధ భాగాలను కలిపే యితర రోడ్లు (14) వున్నవి. రైలు మార్గం నాలుగు తాలూకాల మీదుగా పోతున్నది.



శ్రీ ఎం. బాగారెడ్డి శా. స. (జహీరాబాదు)

# MEDAK DISTRICT A.P.



1. సంగారెడ్డి, 2. జహీరాబాదు, 3. మెదక్, 4. గజ్వేల్.

## పట్టణాల జనసంఖ్య

| | | |
|---|---|---|
| 1. సంగారెడ్డి | ... | 8,084 |
| 2. అందోలు | ... | 9,458 |
| 3. నరసాపూర్ | ... | 4,009 |
| 4. మెదక్ | ... | 14,934 |
| 5. సిద్దిపేట | ... | 18,109 |
| 6. గజ్వేల్ | ... | 4,551 |
| 7. జహీరాబాదు | ... | 11,891 |
| 8. నారాయణ ఖేడ్ | ... | 5,590 |

## సాగునీటి వనర్లు

పెద్దరకం సాగునీటి వనర్లు యివి :

1. రాయనపల్లి ప్రాజెక్టు 2. ఘనుపూరు ఆనకట్ట 3. గంగకట్వ ప్రాజెక్టు.



శ్రీ జి. వీరయ్య శా.స. (నరసాపూర్)

## దర్శనీయమైన స్థలాలు

మెదక్: మెదక్‌లో ఒక ప్రసిద్ధమైన కోట, ఒక పెద్ద మెథాడిస్టు చర్చి వున్నవి. కాకతీయ వంశపు రాజులలో ఒకడైన ప్రతాప రుద్రుడు మెదక్ కోటను నిర్మించాడని చెబుతారు. చర్చి, యించుమించు 4,5 దశాబ్దాల క్రితం రెవరెండు ఛార్లెస్ పోసెట్‌చే నిర్మించబడింది. ఇది భారతదేశంలో మిక్కిలి పెద్ద చర్చిలలో మూడవదిగా పరిగణించ బడుతున్నది. దీని నిర్మాణ కౌశలం ప్రసిద్ధమైనది.

## కొండాపురం

కొండాపురం సంగారెడ్డి తాలూకాలో ఒక చిన్న గ్రామం. ఇది హెడ్‌క్వార్టర్సుకి 5 మైళ్ల దూరంలో వున్నది. ఒకప్పుడిది సంస్కృతి కేంద్రంగా ప్రాముఖ్యం కలిగి వుండేది. 13 వ. శతాబ్దంలో శాతవాహనుల పరిపాలనా కాలంలో యిది కళా సంస్కృతులకు ఆటపట్టుగా వర్ధిల్లేది. ఇటీవల ప్రభుత్వ పురావస్తు శాఖచే యీ గ్రామంలో త్రవ్వబడిన చరిత్రాత్మక వస్తు విశేషాలు యీ విషయాన్ని విదితం చేస్తున్నవి.



శ్రీ కె బి. లాల్ ఐ.ఎ.ఎస్. కలక్టరు మెదక్

## పార్లమెంటు సభ్యులు

1. శ్రీమతి సంగం లక్ష్మిబాయ్ : వికారాబాద్ హెచ్. పి. నియోజక వర్గంనుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి, పోటీలేకుండా ఎన్నికైనారు. జన్మస్థలం సికిందరాబాదు. హైదరాబాదు ప్రభుత్వంలో విద్యాశాఖ వుపమంత్రిణిగా వుండేవారు. శ్రీమతి లక్ష్మిబాయి సంఘ సేవకురాలు. జిల్లాప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యురాలు.

2. శ్రీ పి. హనుమంతరావు : కాంగ్రెసు పక్షాన నిలచి, మెదక్ హెచ్. పి. నియోజక వర్గం నుంచి, ప్రతిపక్షి పి. డి. ఎఫ్. అభ్యర్థిని ఓడించి యెన్నికైనారు. వీరు హైకోర్టులో న్యాయవాదులు హైదరాబాదు ప్రభుత్వంలో రెవిన్యూశాఖ వుప మంత్రిగా వుండేవారు. ఇప్పుడు జిల్లా ప్లానింగు, అభివృద్ధి సంఘంలో సభ్యులు.



శ్రీ బసవమానయ్య శా.స. (అందోలు)

## శాసన సభ్యులు

1. శ్రీ బాగారెడ్డి: జహీరాబాదు నియోజక వర్గం నుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి, స్వతంత్ర అభ్యర్థిని ఓడించి యెన్ని

కైనారు. వీరు న్యాయశాస్త్ర పట్టభద్రులు. జహీరాబాదు వాస్తవ్యులు. జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు.

2. శ్రీ అప్పారావు : నారాయణ ఖేడ్ నియోజక వర్గంనుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి, స్వతంత్ర అభ్యర్థిని ఓడించి యెన్నికైనారు. వీరి స్వస్థలం నారాయణ ఖేడ్. 1951 నుంచి శాసనసభ సభ్యులుగా వుంటున్నారు. వీరు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ వుపాధ్యక్షులు, జిల్లా బోర్డు సభ్యులు అయివున్నారు.



శ్రీ అంతయ్య, శా. స.

3. శ్రీ బసవమానయ్య: అందోలు నియోజక వర్గంనుంచి, స్వతంత్ర అభ్యర్థిగా, కాంగ్రెసు అభ్యర్థిని ఓడించి, యెన్నికైనారు. స్వస్థలం జోగిపేట. వీరు జోగిపేట పురపాలక సంఘం అధ్యక్షులు. జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు.

4. శ్రీ కె. కృష్ణమాచారి : సంగారెడ్డి ద్విసభ్య నియోజకవర్గంలో సాధారణ స్థానానికి స్వతంత్ర అభ్యర్థిగా, కాంగ్రెసు, తదితర స్వతంత్ర అభ్యర్థులను ఓడించి, యెన్నికైనారు. వీరు జిల్లా బోర్డు సభ్యులు. జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు కూడా.

5. శ్రీ డి. వీరయ్య : నరసాపూరు నియోజక వర్గంనుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి, పి.డి.ఎఫ్., స్వతంత్ర అభ్యర్థుల్ని ఓడించి, యెన్నికైనారు. వృత్తిలో వీరు వ్యవసాయదార్లు, ఆపైన నరసాపూరు పురపాలక సంఘం అధ్యక్షులు.



శ్రీ జె.బి. ముత్యాలు

జిల్లా కాంగ్రెసు కమిటీ వుపాధ్యక్షులుగా ఎన్నికైనారు. వీరు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు కూడా.

6. శ్రీ వెంకటేశ్వరరావు : మెదక్ నియోజక వర్గంనుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి, పి.డి.ఎఫ్., స్వతంత్ర అభ్యర్థుల్ని ఓడించి యెన్నికైనారు. వీరు న్యాయవాదులు. 1951 లో జరిగిన సాధారణ యెన్నికలలో కాంగ్రెసు పక్షాన నిలచి, వీరు యిదే నియోజక వర్గంనుంచి యెన్నికయ్యారు. వీరు జిల్లా ప్లానింగు కమిటీ సభ్యులు.

7. శ్రీ ఆర్. నరసింహారెడ్డి : గజ్వేల్ ద్విసభ్య నియోజక వర్గంనుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి, పి.డి.ఎఫ్, మరిద్దరు స్వతంత్ర అభ్యర్థుల్ని ఓడించి యెన్నికైనారు. వీరు కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా వుండేవారు. ఇప్పుడు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు.



శ్రీమతి సంఘం లక్ష్మీబాయి, ఎమ్ పి.

8. శ్రీ జె.బి. ముత్యాలరావు : గజ్వేల్ ద్విసభ్య నియోజక వర్గం రిజర్వుడు స్థానానికి కాంగ్రెసు పక్షాన నిలచి, ప్రతిపక్షులు పి.డి.ఎఫ్. స్వతంత్ర అభ్యల్ని ఓడించి, యెన్ని కైనారు. స్వస్థలం బొల్లారం. వీరు 1952 నుంచి శాసన సభ్యులుగా వుంటున్నారు. జిల్లాప్లానింగు. అభివృద్ధి కమిటీలోకూడా వీరికి సభ్యత్వ మున్నది.

9. శ్రీ అనంత రెడ్డి: దొమ్మాత్ నియోజక వర్గం నుంచి, పి. డి. ఎఫ్. పక్షాన నిలచి, ప్రతిపక్షులు కాంగ్రెసు, స్వతంత్ర అభ్యర్థుల్ని ఓడించి, ఎన్నికైనారు. వీరి స్వస్థలం సిద్దిపేట. వీరు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు.

10. శ్రీ పి. వి. రాజేశ్వర రావు: సిద్దిపేట నియోజక వర్గం నుంచి, కాంగ్రెసు పక్షాన నిలచి,



మెదక్ చర్చి

పి. డి. ఎఫ్. అభ్యర్థిని ఓడించి, యెన్నికైనారు, స్వస్థలం సిద్దిపేట. వీరు న్యాయ శాస్త్ర పట్టభద్రులు. క్రిందటి సంవత్సరం జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా వున్న వీరు యీ సంవత్సరం కూడా అదే స్థానానికి యెన్ని కైనారు. వీరు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటీ సభ్యులు.

11. శ్రీ అంతయ్య: వీరు సంగారెడ్డి వాస్త వ్యులు. నిమ్నజాతి సమాఖ్య సభ్యులు. సంగారెడ్డి నియోజక వర్గంలో రిజర్వుడు స్థానానికి స్వతంత్ర అభ్యర్థిగా వీరు శాసన సభకు యెన్ని కైనారు. వీరు జిల్లా ప్లానింగు, అభివృద్ధి కమిటి సభ్యులు.

## పరిభుత్వాధికార్లు

I. శ్రీ కె. బి. లాల్, ఐ. ఏ. ఎస్. జిల్లా కలక్టరు



మెదక్ కోట

2 శ్రీ ముర్తుజాఖాన్, సెషన్సు జడ్జి.

3 శ్రీ అఫ్ జల్ హుస్సేన్ ఫరూకీ, జిల్లా మేజస్ట్రేటు.

4 శ్రీ సఫ్ దర్ హుస్సేన్, జిల్లా పోలీసు సూపరింటెండెంటు.

5 డా. సయ్యదలీ, జిల్లా వైద్యాధికారి.

6 శ్రీ జి. బాపూరావు, పబ్లిక్ వర్క్సు శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు (రోడ్లు, భవనాలు)

7 శ్రీ మొహిసినుద్దీన్ హకానీ, ప. వ. శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, (సాగునీటి సరఫరా బ్రాంచి)

8 రఫియుద్దీన్, జిల్లా అడవుల అధికారి.

9 శ్రీ ప్రేమ్ రాజమాథుర్, జిల్లా ప్లానింగు ఆఫీసరు.

10 శ్రీ జి. బి. అప్పలస్వామి, ఎక్సైజు సూపరింటెండెంటు.

11 శ్రీ గోవింద రావు, జిల్లా వ్యవసాయాధికారి.

12 శ్రీ సయ్యద్ మహమ్మద్ ఇజాక్, వాణిజ్యం, పరిశ్రమల సూపరింటెండెంటు.

13 శ్రీ మీర్ మహమ్మదాలీ, సహకార సంఘాల అసిస్టెంటు రిజిస్ట్రారు.

14 శ్రీ ఎస్. శంకరం, వాణిజ్య పన్నుల అధికారి.

15 శ్రీ ఎస్. రామకృష్ణయ్య, జిల్లా విద్యాధికారి.

16 డా. మాణిక్ చందర్, జిల్లా ఆరోగ్యాధికారి.

17 శ్రీ పురుషోత్తమ రావు, జిల్లా పశు వైద్యాధికారి.

---

# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

## నాగార్జున సాగర్‌కి చైనా ఇంజనీర్ల ఆగమనం

భారతదేశంలో పర్యటిస్తూ వివిధ నదీ లోయ ప్రాజెక్టుల్ని సందర్శిస్తున్న నలుగురు నవచైనా చీఫ్ ఇంజనీర్లు 1958 ఫిబ్రవరి 26 నుంచి 28 వరకూ నాగార్జున సాగర్ ఆనకట్ట వద్ద గడిపారు.

ఈ మూడు రోజులలోను వారు ఆనకట్టను, కాలవలను సందర్శించి అక్కడ జరుగుతున్న పనిని శ్రద్ధగా పరిశీలించారు. అధికాహారోత్పత్తికై సువిశాలమైన భూములకు నీటిని అందజేయగల బ్రహ్మాండమైన ఆనకట్ట నిర్మాణాన్ని చూచి వారు హర్షించారు. ఆనకట్ట స్థానికంగా లభ్యమయే నిపుణులు, వస్తు పరికరాలతో నిర్మింపబడుతున్నదని తెలుసుకొని వారు మరీ సంతోషించారు. అందుకు వారు ఆంధ్ర ప్రదేశ్, భారత ప్రభుత్వాలను అభినందించారు.

నాగార్జున కొండను కూడా సందర్శించిన తరువాత వారు 1958 ఫిబ్రవరి 28వ తేదీన హైదరాబాదుకు ప్రయాణమై బయలుదేరారు.

## గ్రామ నాయకుల శిక్షణాశిబిరాలు

కృష్ణా జిల్లా మచిలీపట్నం తాలూకా లోని గూడూరు జాతీయ వికాస సేవాకేంద్రం అధ్వర్యాన 1958 ఫిబ్రవరి 26 నుండి 28వ తేదీవరకూ పొట్లపాలెం గ్రామంలో గ్రామనాయకుల శిక్షణా శిబిర మొకటి ఏర్పాటు చేయబడింది.

1958 ఫిబ్రవరి 26వ తేదీన బ్లాకు అభివృద్ధి అధికారి జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. ఈ సందర్భంలో, ఆ గ్రామం రైతు, గ్రామ నాయకులలో ఒకరు అయిన శ్రీ వి. బాలకోటయ్య అధ్యక్షతవహించారు. అయినగూడూరు పంచాయతీ బోర్డు అధ్యక్షుడు శ్రీ వై.వి. రాఘవరావు శిబిరానికి ప్రారంభోత్సవం జరిపారు. ప్రజలు అభిప్రాయభేదాల్ని విస్మరించి అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనాలని ఉద్బోధించారు. దేశ స్వాతంత్ర్యానంతరము ముఖ్యంగా పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రజలు పొందిన అభివృద్ధి కరమైన వివిధ మార్పులను గురించి కూడా ఆయన శిక్షణ పొందుటకు వచ్చినవారికి వివరించి చెప్పారు. మరుసటి రోజు కార్యక్రమాలకి గూడూరు జిల్లా బ్లాకు ప్లానింగ్ అండ్ డెవలప్మెంటు కమిటీ వైస్ చైర్మన్ శ్రీ బి. నిరంజనరావు అధ్యక్షత వహించారు. మచిలీపట్నం వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు జపానుపద్ధతి సేద్యంలో గల లాభాలను ముఖ్యంగా విత్తనాల తయారీని గూర్చి వివరించి చెప్పారు. గ్రామ పారిశుధ్యాన్ని గూర్చి ఆరోగ్యాన్ని కాపాడుకోడానికి అవలంబించవలసిన పద్ధతులను గూర్చి హెల్తు ఇన్‌స్పెక్టరు మాట్లాడారు. జాతీయ వికాస సేవా కార్యక్రమాల విజయానికి స్త్రీలు వహించవలసిన పాత్రను గూర్చి సాంఘిక విద్యా ఆర్గనైజరు (స్త్రీ,) మాట్లాడారు.

ఆఖరురోజు కార్యక్రమానికి శిక్షణ పొందుతున్న గ్రామ నాయకులలో ఒకరైన శ్రీ వి. రామయ్య అధ్యక్షత వహించారు. మత్స్య పరిశ్రమల శాఖకు చెందిన అసిస్టెంటు ఇన్స్పెక్టరు మంచిచేపల వల్ల కలిగే లాభాలను వివరిస్తూ, చెరువులలోను బావులలోను ఎక్కువగా చిరుచేపల్ని పెంచమని వుద్బోధించారు.

శిబిరంలోని నాయకులు గ్రామస్థుల సహాయంతో ఒక ఫర్లాంగు పొడువున కచ్చారోడ్డు నిర్మించారు. ఇందులో దాదాపు 75 మంది పాల్గొన్నారు.

సముద్ర చేపలు, మంచినీటి చేపల ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేయబడింది.

శిబిర నిర్వహణకైన రు. 194 ఖర్చును పొట్లపాలెం గ్రామస్థులే భరించారు. ఈ బ్లాకులో ఇట్టి కార్యక్రమం జరగడం ఇదే తొలిసారి. ఇక్కడ 7 గ్రామాలకి చెందిన గ్రామనాయకులు మొత్తం 54 మంది శిక్షణ పొందారు.

2. గూడూరు జాతీయ వికాస సేవాకేంద్రం అధ్వర్యాన 1958 మార్చి 6 నుండి 8 వ. తేదీవరకు తరకటూరులో మరొక గ్రామనాయకుల శిక్షణా శిబిరం ఏర్పాటు చేయబడింది. ఈ సందర్భంలో హరిజన సేవక సమాజ్ కన్వీనరు శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ ఆర్. అచ్యుతరామయ్య, పెక్కురు జిల్లా ప్లానింగ్ ఉద్యోగులు శిక్షణపొందే గ్రామనాయకులను ఉద్దేశించి తమతమరంగాలలో జరుగుతున్న కార్యకలాపాలనుగూర్చి మాట్లాడారు. తరకటూరు గ్రూపుక్రింద ఉన్న గ్రామాలనుంచి వచ్చిన గ్రామనాయకులు మొత్తం 50 మంది యీ శిబిరంలో పాల్గొన్నారు. ఈ మూడు రోజులలోను ప్రదర్శనలు, సాంస్కృతిక కార్య కలాపాలు ఏర్పాటు చేయబడినవి.

3. శ్రీకాకుళం జిల్లాలోని బుర్జా జా. వి. సే కేంద్రం బ్లాకుస్థాయి రెండవ మేలా, గ్రామనాయకుల 6 వ. శిక్షణా శిబిరం 1958 ఫిబ్రవరి 11 వ. తేదీనుంచి 13 వ. తేదీవరకూ వెంకటపతిరాజుపేటలో వుచితరీతిని జరుపబడినవి. ఇందుకయిన ఖర్చులో నూటికి నూరుపాళ్ళను గ్రామస్థులు భరించారు. ఇవి 1957-58 లో గ్రామస్థుల పూర్తి ఖర్చుపై జరిగిన మొటమొదటి మేలా,



*తిర్మలాయపాలెం సమాజాభివృద్ధి కేంద్రంలో గ్రామ నాయకుల శిక్షణా శిబిరం ప్రారంభం.*

గ్రామనాయకుల అయిదవ శిక్షణా శిబిరం (ఎప లైజుడు) అయివున్నవి.

ఫిబ్రవరి 13 న పశుప్రదర్శన మొకటి ఏర్పాటు చేయబడింది. ఆటల పోటీలు జరుపబడ్డాయి. వాటిలో చుట్టుప్రక్కల 4 గ్రామాలలోని బడిపిల్లలు 200 మంది పాల్గొన్నారు. పాలకొండ స్కూళ్ళ ఇన్స్పెక్టరు గెలుపొందిన పిల్లలకు బహుమతులు పంచిపెట్టినారు. 12-2-58 న ఒక ప్రదర్శనం యేర్పాటు చేయబడింది. అక్కడ వ్యవసాయ, కుటీర పరిశ్రమల వస్తువులు, చేమగ్గాలు జనపనార, జనపనార వస్తువులు, కుట్టుపని వస్తువులు మున్నగునవి ప్రదర్శించబడినవి.

బ్లాకు గ్రామాలనుంచి గ్రామస్థులు ప్రదర్శన వస్తువుల్ని తెచ్చి, పోటీలలో పాల్గొన్నారు. జిల్లా పశువైద్యాధికారి, ప్రముఖ అనధికారులతో కూడిన ఒక సంఘం ఉత్తమమైన పశువులను, కోళ్ళను నిర్ణయించింది. వాటికి బహుమతులు యివ్వబడినవి. వుత్తమ వ్యవసాయ వస్తువులు, తదితర వస్తువులకు కూడా బహుమతులు ఇవ్వబడినవి. రాత్రిళ్లు బుర్ర కథలు, సమాజాభివృద్ధి కార్యక్రమం పై చలనచిత్ర ప్రదర్శనములు మున్నగు సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహింప బడినవి.

## తిరుమలాయ పాలెం సమాజాభివృద్ధి కేంద్రం

ఖమ్మం జిల్లాలోని తిరుమలాయ పాలెం సి. డి. బ్లాకులోని తీర్థల్ గ్రామంలో 1958 ఫిబ్రవరి 15 నుంచి 17 వరకు ఒక మేలా జరుపబడింది. బ్లాకు సిబ్బందివారు ప్రదర్శించిన వస్తువుల్ని సుమారు 3 వేల మంది ప్రజలు చూచి, ఆనందించారు. పోస్టర్లు, బ్లాకులు, చార్టులు, ప్రత్యక్ష ప్రదర్శనముల ద్వారా బ్లాకులో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలు ప్రజలకు వివరించ బడినవి.

ఇదే బ్లాకులోని వెంకటాయపాలెం గ్రామంలో 1958 ఫిబ్రవరి 23 నుంచి 25 వరకు గ్రామనాయకుల శిక్షణా శిబిరం ఏర్పాటు చేయబడింది. ఆరు గ్రామాలకి చెందిన 40 మందికి ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పశువైద్య్య, సాగునీటి సరఫరా పద్ధతులలో శిక్షణ యివ్వబడింది.

(4) హైదరాబాదు జిల్లా చేవెళ్ల జా.వి.సే. కేంద్రంలోని షహాబాదులో 1958 ఫిబ్రవరి 21 నుంచి 23 వరకు గ్రామనాయకుల శిక్షణా శిబిరం ఒకటి ఏర్పాటు చేయ బడింది. ఈ శిబిరానికి, స్థానిక గ్రామనాయకుడు, బ్లాకు ప్లానింగ్, అభివృద్ధి కమిటీ సభ్యుడు అయిన శ్రీ ఎం. సింగప్ప అధ్యక్షుడుగా ఎన్నుకో బడెను. ఇక్కడ శిక్షణ పొందుటకు షహాబాదు మండలంలోని గ్రామాలనుంచి 50 మంది వచ్చారు. ఈ శిబిరం నిర్వహించబడిన సమయంలోనే స్వల్ప మొత్తాల పొదుపు వుద్యమానికి సంబంధించిన సమావేశం కూడా జరగడం తటస్థించింది. చిన్న మొత్తాల పొదుపు పథకం ప్రాముఖ్యాన్ని గూర్చి డిప్యూటీ కలెక్టరు, తహశీల్దారు, ఇతర స్థానిక నాయకులు మాట్లాడుతూ, ప్రజలు తమ శక్తికొలది దానికి పెట్టుబడి పెట్టాలని విజ్ఞప్తి చేశారు.

(5) కృష్ణాజిల్లాలోని కంచికచెర్ల జా. వి. సే. కేంద్రంలోని మోగల్లు గ్రామంలో 1958 ఫిబ్రవరి 26 నుంచి 28 వరకు గ్రామనాయకుల శిక్షణా శిబిరం (స్పెషలైజుడు) నిర్వహించ బడింది.

(6) అరకు లోయలోని సొవ్వ గ్రామంలో 1958 ఫిబ్రవరి 26 నుంచి 28 వరకు గ్రామనాయకుల ప్రత్యేక శిక్షణా శిబిరం నిర్వహించ బడింది. ఇక్కడ 18 వూళ్లనుంచి వచ్చిన 30 మంది ఆదివాసులకు శిక్షణ ఇవ్వబడింది. శిక్షణ పొందిన గ్రామనాయకుడు శ్రీ బి. బాలాజీ 1958 ఫిబ్రవరి 26 వ. తేదీ ఉదయం 8 గంటలకు జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. ఆ తరువాత ఆ ప్రాంతంలోని పశుసంపద అభివృద్ధికిగల అవకాశాలను గూర్చి చర్చించుటకు ఒక చర్చాగోష్ఠి జరుప బడింది. పశువులకు షెడ్లు వుండాలనీ, పశుపోషణకు ఆరోగ్య కరమైన పద్ధతులు అవలంబించ బడాలనీ ఆది వాసులకు నచ్చ చెప్ప బడింది. పశువులకు వచ్చే వివిధ వ్యాధులు, వాటి నివారణోపాయాలు వారికి వివరించి చెప్ప

బడినవి. పశువుల వ్యాధులు వ్యాపించినప్పుడు ఆ విషయాన్ని తెలియచేసి, వాటిని అరికట్టడానికి వీలు కలిగించాలని శిక్షణ పొందేవారిని కోరడం జరిగింది. గిరిజనులకు పశువుల పాలు పిండే అలవాటు లేదు. కాబట్టి, పాలలోగల ఆహార పుష్టిని గురించి తెలియజేస్తూ, వారికి ఆవుపాలుపిండి చూపించడం జరిగింది. ఆబోతుల ప్రాముఖ్యం గురించి వారికి వివరించ బడింది. అరకులోని సింధీ ఎడ్ల కేంద్రానికి ఆవులను పంపి, మేలుజాతి పశువుల్ని పెంపొందించుకోమని వారు ప్రోత్సహించ బడినారు. అక్కడ పట్టుగడ్డి సాగుబడి, గొర్రెల పెంపకం, కోళ్ల అభివృద్ధి మున్నగు విషయాలు కూడా బోధించ బడినవి.

శ్రీ బి. బాలాజీ తన ముఠా గ్రామాలలో విరాళాలు సేకరించి శిక్షణా శిబిరాన్ని నిర్వహించే బాధ్యతను తనంతటతానే స్వీకరించారు. విరాళాలు సేకరించేందుకై ఆయన పరిసర గ్రామనాయకులతో కూడిన ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. వీరందరూ కలసి రూ. 100 లు సేకరించారు. అంతేగాక పందిళ్లకి కావలసిన సామగ్రి మున్నగు వాటిని కూడా సమకూర్చ గలిగారు. నిస్థానికంగా లభ్యం కానట్టి ఉప్పు,కిరసనాయిల్, నువ్వులనూనె మున్నగు వాటిని కొనుటకై ప్రాజెక్టు నిధినుండి రూ. 20 లు మాత్రమే ఖర్చుపెట్ట బడినవి.

## కొత్త పాఠశాలా భవనం

తిరుమలాయ పాలెం సమాజాభివృద్ధి కేంద్రంలో జీడ్లచెర్వు గ్రామంలో ఖమ్మం జిల్లా కలెక్టరు 1958 ఫిబ్రవరి 28వ తేదీన ఒక క్రొత్త పాఠశాలా భవనానికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో ఉపన్యసిస్తూ తన గ్రామం పిల్లల సంక్షేమం కొరకై పాఠశాలా భవనాన్ని నిర్మించిన శ్రీ రాఘవరెడ్డి గారి మార్గాన్నే అందరూ అనుసరించాలని ఆయన ఉద్బోధించారు.

కలెక్టరు సతీమణి తిరుమలాయ పాలెంలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని తెరిచారు.

# కోయ మహాసభ

ఖమ్మం జిల్లా ఇల్లెందు తాలూకా సుదిమళ్ల గ్రామంలో జిల్లా కోయ మహాసభ జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ జలగం వెంగళరావు గారి అధ్యక్షతన జరుప బడినది. మహాసభ కన్వీనరు శ్రీ దాసరి వెంకట్రాములు గారు అధ్యక్షులకు, సభికులకు స్వాగతం చెపుతూ వెనుక బడిన వర్గాలుగా యింత వరకూ జీవితం గడుపు తున్న కోయ ప్రజల సాధక బాధకాలనూ, ఇబ్బందులనూ వివరించారు.

అనంతరం అధ్యక్షులు సభను ప్రారంభిస్తూ తమ ప్రసంగంలో ఇలా అన్నారు: "స్వాతంత్ర్యం లేని దేశంలో ఆర్థిక, సామాజిక రంగాలలోనేమి, తదితర రంగాలలోనేమి పురోగమనం కుంటు పడుతుంది. నేడు మనం స్వేచ్ఛా జీవులం. పట్టణాలలో, పల్లెలలో, అరణ్యాలలో వుండే ప్రజలందరం మన జీవితాన్ని చక్క దిద్దుకుంటూ ముందుకు సాగిపోవాలి. మన సమాజంలో ఇప్పటికీ పాతుకు పోయిన అన్యాయాలు అనేకం ఉన్నాయి. వాటి వెనుక సంవత్సరాల చరిత్ర దాగివుంది. ఈ అవకతవకల నుండి ప్రజానీకాన్ని తప్పించి వారిని ఐకమత్య మార్గంలో పయనింప చేయాలి. ప్రజా సమస్యలు కేవలం ఉపన్యాసాల వలన, తీర్మానాల వలన తీరేవి కావు. వాటిని కేవలం నిర్మాణ కార్య క్రమం వలననే పరిష్కరింప గలం. ప్రభుత్వం వెనుక బడిన వర్గాల అభివృద్ధికోసం విపుల మైన కార్యక్రమాన్ని నిర్ణయించింది. వారికి కావలసిన సౌకర్యాలను, రక్షణలను కల్పిస్తున్నది. ఈ కార్య క్రమంలో మనం కూడ భాగస్వాములు కావాలి. ప్రభుత్వం సంకల్పించిన ఉదార ఆశయాల సాధనకు అధికారులు అనధికారులు నిష్పాక్షిక బుద్ధితో సహకరిస్తే అనైక్యత, సాంఘిక విభేదాలు సమసి పోతాయి."

తదుపరి శ్రీ శీలం సిద్దారెడ్డిగారు మాట్లాడుతూ ఖమ్మం జిల్లాలో రెండు వెనుకబడిన తాలుకాలు కల వన్నారు. "ఈ తాలూకాలలో వేలాది వెనుకబడిన జాతులు తగిన సౌకర్యాలు లేక నివసిస్తున్నారు. ప్రభుత్వం పెద్ద మొత్తాలు ఈ జాతుల వికాసానికి ఖర్చు పెడుతున్నది. 5, 6 సంవత్సరాల నుండి యీ తాలూకాలలో కొన్ని చోట్ల చెప్పుకోదగిన అభివృద్ధి సాధింప బడింది. అయినా కొన్ని ప్రదేశాలలో కోయలు యింకా తమ పాత విధానాలకు స్వస్తిచెప్పలేదు. చాలమంది కోయలు తమ పిల్లలను ఊళ్లలో పాఠశాలలున్నప్పటికీ పంపడంలేదు. ఇది వారికే నష్టదాయకం. నిరక్షరాస్యులుగా జీవించడం వల్లనే ఇంతకాలం వారు ఎన్నో అన్యాయాలకు గురికావడం జరిగింది" అన్నారు.

శ్రీ రాయ్ హీరాలాల్ మోరియాగారు ప్రసంగిస్తూ కులమత వర్గ విభేదాలు తరతరాలుగా మనలను ముందుకు పోకుండా నిలిపివేస్తున్నాయన్నారు. "కొంతమంది పెత్తందారులు అధికారాలను హస్తగతం చేసుకుని అమాయకులపై అనవసరమైన ఆంక్షలు విధించి దోచుకున్నారు. హరిజనోద్ధరణ కోసం గాంధీజీ తన జీవితాన్ని అంకితం చేశారు. మహాత్ముని ప్రయత్న ఫలితంగా యీనాడు వారిపైగల ఆంక్షలు చాలా వరకు తొలగినవి. ప్రభుత్వం యీనాడు ఈవర్గాల కోసం పెడుతున్న ఖర్చు సక్రమంగా వినియోగమవుతున్నదీ లేనిదీ బహు జాగ్రత్తగా గమనించాలి. సమాజంలో ఒక వర్గానికీ మరొక వర్గానికీ ఒక కులానికీ వేరొక కులానికీ మధ్య ఏకీభావం కుదరనంత వరకు స్వాతంత్ర్యసముపార్జన యొక్క సంపూర్ణ లక్ష్యం సిద్ధించదు.

ఆంధ్రప్రదేశ్ లో ఆదిలాబాదు, ఖమ్మం, వరంగల్లు, మహబూబ్ నగర్, శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, కర్నూలు జిల్లాల్లో వెనుకబడిన వర్గాలవారి సంఖ్య ఎనిమిది లక్షలకు పైగా వుంది. ద్వితీయ ప్రణాళికా కాలంలో తెలంగాణా ప్రాంతానికి చెందిన వెనుకబడిన జిల్లాలలో ప్రభుత్వం రు. 19 లక్షలు ఖర్చు పెట్టాలని నిర్ణయించింది. ఇంకా యితర అభివృద్ధి కార్యక్రమాలకు రు 80 లక్షలు కూడా ప్రభుత్వం ఖర్చు పెట్టనున్నది.

"ప్రభుత్వం తలపెట్టిన యీ అభివృద్ధి పథకాలకు ప్రజలు సంపూర్ణ సహకారాన్ని యిచ్చి దేశ కల్యాణానికి తోడ్పడాలి" అన్నారు, శ్రీ మోరియా.

శ్రీ చింతల రాములుగారు, జిల్లా వెనుకబడిన వర్గసంఘ కార్యదర్శి, వారి ఇబ్బందులు, సమస్యలు గురించి వివరణాత్మకంగా మాట్లాడారు.

మహాసభ కన్వీనరు శ్రీ దాసరి వెంకట్రాములు గారు ఈ క్రింది తీర్మానాలను ప్రవేశ పెట్టారు.

1. వెనుకబడిన విద్యార్థుల విద్యాస్థాయి పెరుగుటకు, హెచ్చుసంఖ్యలో విద్యార్థులు పాల్గొనుటకు తగిన వసతి సౌకర్యాలు, ఉపకార వేతనములు, ఉచిత భోజన సౌకర్యాలు, గృహావసతులు, ప్రభుత్వం ఏర్పరుచుట, యీ వర్గాల రైతులకు భూవసతులు కల్పించుట.

2. వివిధ వృత్తులలో ఉన్నవారికి తగిన పరికరముః ఉచిత ధరలకు ప్రభుత్వము ఇప్పించుట. ఉత్పత్తి వస్తువుల విక్రయం ఎక్కువగా జరిపించి వారి అభివృద్ధికి తోడ్పడుట.

తీర్మానములు ఏకగ్రీవంగా ఆమోదింపబడినవి.



# తెలంగాణా ప్రాంతపు సిబ్బంది రక్షణలు

**కష్ట నిష్ఠూరాల పరిశీలనకు కమిటీ నియామకం :**

**ప్రభుత్వోద్యోగాలలో తెలంగాణా ప్రాంతపు సిబ్బందికి కల్పించబడిన రక్షణలు వుల్లంఘించబడుతున్నాయని ప్రభుత్వంపై ఆరోపణ మోపబడింది. ఈ ఆరోపణలు కేవలం నిరాధారమైనవని వివరిస్తూ యీ సందర్భంలో ప్రజలకి కలిగిన అపోహను నివారించుటకు ప్రభుత్వం ఒక పత్రికాప్రకటనను చేసింది. వివరాలు యివి.**

ఉద్యోగాల విషయంలో తెలంగాణా ప్రాంతపు సిబ్బందికి యివ్వబడిన రక్షణలను అమలు జరపడం లేదని ప్రభుత్వాన్ని నిందిస్తూ యిటీవల ప్రజలు, వార్తా పత్రికలు, ఆఖరికి శాసన సభలోను కూడా పెక్కు ఫిర్యాదులు వినవస్తున్నాయి. ఈ ఫిర్యాదులు కొంత వరకూ అస్పష్టంగా వున్నాయి. హైదరాబాదు రాష్ట్రం నుంచి తీసికోబడిన తెలంగాణా ప్రాంతపు సిబ్బందికివ్వబడిన రక్షణలు, ప్రభుత్వోద్యోగాల ప్రారంభ రక్రూట్మెంటులో తెలంగాణా అభ్యర్థులికి యివ్వబడిన కేటాయింపుల విషయాలు సరిగా అర్థం చేసుకొనబడలేదని మొత్తం మీద ఆ ఫిర్యాదుల వల్ల తెలుస్తున్నది. ఆంధ్ర రాష్ట్రం నుంచి వచ్చిన సిబ్బంది, హైద్రాబాదు రాష్ట్రం సిబ్బంది ఉద్యోగాలలో ముఖ్యంగా సీనియరు కేటగరీలకి సంబంధించిన వాటిలో యే నిష్పత్తిలో వున్నారో కూడా వారికి తెలియదు.

రక్షణలు స్థూలంగా మూడు రకాలుగా వున్నాయి.

1. సామాన్య గ్రెడేషన్ జాబితాలలో యేకీకరణ.
2. జీతం, ఉద్యోగ నిబంధనలు,
3. రిక్రూటు మెంటు

**వీటిలో ప్రతి ఒక్క అంశం పరిస్థితి దిగువ యివ్వబడింది.**

**ఉద్యోగాల సమన్వయం :-** తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలవ్యవస్థ, వుద్యోగ నిబంధనలలో వ్యత్యాసమున్న కారణాన ఆ రెండు ప్రాంతాల సర్వీసులను యేకీకృతం చేయడం కష్టం. అందుకు కొంత ఆలస్యం కూడా జరుగుతుంది. ఈ రెండు ప్రాంతాల ఉద్యోగాలను సమీకృతం చేసి, సామాన్య గ్రెడేషన్ జాబితాలను తయారు చేయడానికై కేంద్ర ప్రభుత్వం స్పష్టమైన ఆదేశాలను యిచ్చింది. ఈ జాబితాలకి శీఘ్రంగా తుది రూపమివ్వడానికి వీలుగా సలహా సంఘాల యేర్పాటును కూడా అది సూచించి వున్నది. ఆ ప్రకారము, గెజిటెడ్, నాన్-గెజిటెడ్ ఉద్యోగాలు రెండిటి విషయంలోను కూడా సలహా సంఘాలు యేర్పాటు చేయబడినవి. వాటిలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల ప్రతినిధులు సమసంఖ్యలో వున్నారు. చాలా సందర్భాలలో యీ సలహా సంఘాల సిఫార్సులు యేకగ్రీవంగా వున్నాయి. మొత్తము మీద వాటిని ప్రభుత్వం ఆమోదించింది. స్టేట్ సర్వీసులలో వుండి ప్రభుత్వం ఉత్తరువుల వల్ల నష్టం కలిగిందనుకొన్న వారు పంపే అప్పీళ్ల విచారణకై కేంద్ర ప్రభుత్వం కూడా ఒక సంఘాన్ని యేర్పాటు చేసింది. కేంద్ర పబ్లిక్ సర్వీసు కమిషన్ సభ్యులలో ఒకరు దాని అధ్యక్షుడు. పదవీ విరమణ చేసిన హైకోర్టు జడ్జి ఒకరు, ఉద్యోగంలో వున్న లేక పదవీ విరమణ చేసిన సీనియరు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు ఒకరు దాని సభ్యులుగా వుంటారు.

స్టేట్ సర్వీసులు కాని యితర సర్వీసులన్నిటి నుంచి వచ్చే అప్పీళ్లు, విజ్ఞప్తుల పరిశీలనకై కూడా

కేంద్ర ప్రభుత్వం ఒక సంఘాన్ని యేర్పాటు చేసింది. రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమిషన్. సభ్యులలో ఒకరు దాని అధ్యక్షుడు. దానిలో కేంద్ర ప్రభుత్వ శాఖకి చెందిన ఒక డిప్యూటీ కార్యదర్శి, రాష్ట్ర ప్రభుత్వం నియమించిన ఒక వ్యక్తి యిద్దరూ సభ్యులుగా వుంటారు.

ఈ విధంగా, ఉద్యోగాల సమీకరణ, సామాన్య గ్రేడేషన్ జాబితాల తయారీ కేంద్ర ప్రభుత్వపు ఆదేశాల ననుసరించి జరుగుతాయి. ఈ ఆదేశాలు పునర్వ్యవస్థీకృతమైన రాష్ట్రాలన్నిటికీ వర్తిస్తాయి. ఇందువల్ల నష్టం కలిగిందనుకొన్న యెవరైనా కేంద్ర ప్రభుత్వం యేర్పాటు చేసిన నిష్పక్ష పాతమైన సంఘానికి అప్పీలు చేసుకోవచ్చు.

ఉద్యోగనిబంధనలు :- ప్రొబేషన్ విషయంలో కేంద్ర ప్రభుత్వపు హామీ యేమీ లేదు. కాని యేర్పడిన ఖాళీల విషయంలో, ఆంధ్ర సర్వీసు నిబంధనావళి క్రింద ఆంధ్రలో అప్రూవుడు ప్రొబేషనర్లకి ముందు ప్రాధాన్యత వున్నది. ఆంధ్రలో దాదాపు అన్ని తరగతుల ఉద్యోగాలకి ప్రొబేషన్ సిస్టంవున్నది. కాని తెలంగాణాలో మొత్తం మీద ఉద్యోగంలో మొదట చేరినప్పుడు తప్ప అటువంటి పద్ధతి లేదు. ఆంధ్రలో ప్రొబేషనరు లేక అప్రూవుడు ప్రొబేషనరు ఖాళీ లేక క్రింది ఉద్యోగంలోనికి పంపబడినప్పుడు, ఆ తరువాతి ఖాళీలో తిరిగి నియమించ బడ్డానికి అతనికి చట్టబద్ధమైన హక్కు వుంటుంది. తెలంగాణాలో, స్పష్టమైన ఖాళీ వున్నప్పుడే, ఉద్యోగాభివృద్ధి, రెగ్యులర్ గా, యివ్వబడేది. స్వల్ప కాలం సెలవు లేక తదితరమైన ఖాళీలు యేర్పడినప్పుడు, పునర్నియామకానికై చట్టబద్ధమైన హక్కులేమీ లేకుండా కేవలం సెలక్షన్ ప్రమోషన్లు యివ్వబడేవి. కొన్ని ఉద్యోగాలలో, క్రింది వుద్యోగాలకి పంపబడిన ఆంధ్ర ప్రొబేషనర్లు లేక అప్రూవుడు ప్రొబేషనర్లు పెక్కురు వున్నారు. కొత్త వారికి ఉద్యోగాభివృద్ధి యివ్వకుండా వీరందర్ని తిరిగి నియమించాలంటే ప్రొబేషన్ సిస్టం లేని తెలంగాణా ప్రాంతపు సిబ్బందికి యిబ్బంది కలుగుతుంది. ఈ యిబ్బందిని తగ్గించడానికై ఆంధ్ర ప్రొబేషనర్ల జాబితా అఖరై పోయే వరకు, యేర్పడే ప్రతి మూడు ఖాళీల లోను రెండవ దానిని తగిన సీనియరు తెలంగాణా వ్యక్తికి యివ్వాలని ప్రభుత్వం వుత్తరువు చేసింది. ఆంధ్ర అప్రూవుడు ప్రొబేషనర్ల జాబితా అఖరయే వరకూ దీని వల్ల తెలంగాణా వారికి రక్షణ సమకూరుతుంది. ఆ తరువాత ప్రతిభ — సీనియారిటీ ప్రకారం నియామకాలు జరుగుతాయి.

వేతనపుస్కేళ్లు : ఖాయపు ఉద్యోగులవిషయంలో సబ్ స్టాన్షివ్ వేతనం యథాతథంగా యివ్వబడుతుంది. ఒకరి స్థానంలో పని చేస్తున్న వారి సందర్భంలో వేతనం, వేతనపు స్కేలు కూడా 1-11-56కి కనీసం 3 సంవత్సరాల ముందు నుంచి ఆ వేతనం తీసుకుంటున్న వారి విషయంలో మార్చబడవు. తాత్కాలికోద్యోగుల విషయంలో, ఒకానొక స్కేలులో తీసుకునే వేతనం యథా ప్రకారం యివ్వబడుతుంది. కాని అదే స్కేలు మాత్రం యివ్వబడదు. అయితే అందుకు 1-11-56కు పూర్వం 3 సంవత్సరాలకి తక్కువ కాని కాలంలో ఆ వేతనాన్ని తీసుకుంటూ ఉండాలి. చేసే ఉద్యోగం అంతస్థు పునర్వ్యవస్థీకరణ తేదీకి ముందున్న అంతస్థుకంటె తగ్గకూడదు కూడా. 1-11-56 కి పూర్వం 5 సంవత్సరాలకి తక్కువ కాకుండా ఆ వేతనం తీసుకుంటున్న తాత్కాలికోద్యోగి విషయంలో వేతనపు స్కేలుకూడా మార్చబడదు. 1-11-56 కి పూర్వం అసందర్భంగా హయ్యర్ టైం స్కేలుకి బదులు తీసుకొనబడే సందర్భంలో ప్రత్యేక వేతనానికి కూడా వేతనం మేరకే రక్షణ కల్పించబడుతుంది. ఈ విషయంలో సవివరమైన ఆదేశాలు ఇవ్వబడినవి. రక్షణలన్నీ అమలు జరుపబడుతున్నాయి. ఒక వేళ ఎక్కడైనా పొరపాట్లు జరిగితే, తెలియబరిస్తే అవి సరిదిద్దబడగలవు.

## రిక్రూట్మెంటు

తెలంగాణాలో జిల్లా స్థాయి సబార్డినేటు ఉద్యోగాలలో ఏర్పడే ఖాళీలు పూర్తిగాను, సెక్రటే

రియట్, రాజధానీ నగరంలో వున్న ప్రభుత్వ శాఖాధిపతుల కార్యాలయాల్లో ఏర్పడే ప్రతి మూడు ఖాళీలలోను ఒకటి నేరు నియామకంతో భర్తీ చేయవలసిన సందర్భంలో, ముల్కీలకి అనగా తెలంగాణా ప్రాంతంలో 15 సంవత్సరాలు నివసించిన వారికి కేటాయించబడినవి. ప్రభుత్వానికి తెలిసినంతవరకూ యీ హామీ ఉల్లంఘించబడలేదు.

పూర్వం తెలంగాణా ప్రాంతంలో వెనుకబడిన తరగతులికి ప్రభుత్వోద్యోగాలు కేటాయించబడేవి కావు. ఇప్పుడు వారికి ప్రభుత్వం 25 శాతాన్ని కేటాయించి తద్వారా ఆంధ్ర ప్రాంతంలో వున్న అటువంటి ప్రత్యేక సదుపాయాలతో సమానమైన వాటిని తెలంగాణా ప్రాంతానికి కూడా కల్పించింది.

ప్రమోషన్లు :- తెలంగాణా ఉద్యోగి మొట్ట మొదటిసారి ఉద్యోగాభివృద్ధి పొందినప్పుడు పూర్వ హైదరాబాదు స్కేలు లేక ఏకీకృతమైన కొత్త స్కేలు యీ రెండిటిలో దేనినైనా ఎన్నుకో వచ్చును. ఇదే ఉద్యోగాభివృద్ధి విషయంలో ఇవ్వ బడిన ఏకైక హామీ.

## తగ్గించిన సిబ్బంది నియామకం

పూర్వ హైదరాబాదు రాష్ట్రం తగ్గించిన సిబ్బందిని 'ఎ', 'బి', 'సి' అని మూడు తరగతులుగా విభజించింది 'ఎ' జాబితాలోని వారందరూ నేరుగా ఉద్యోగాలలోనికి తిరిగి తీసుకోబడినారు. 'బి' జాబితాలోనివారు పబ్లిక్ సర్వీసు కమీషన్ లేక ఉద్యోగ సాధక సంస్థల ద్వారా తీసుకో బడినారు. 'సి' జాబితాలోనివారు తిరిగి ఉద్యోగములోనికి తీసికొనుటకు అర్హులు కారని నిశ్చయించ బడింది.

తర్వాత తగ్గించబడిన ఉద్యోగులందరినీ తిరిగి తీసుకోవాలనే నియమం లేదు. కాని యీ విషయంలో ప్రజలు చాలా అపోహపడుతున్నారు. కమిషన్ వారిచే ప్రకటించబడిన లేక వారిచే ఖాళీలు నింపబడిన పదవుల విషయంలో పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో రిట్రెంచ్ చేయబడిన ఉద్యోగులకు వయః పరిమితి నిబంధనల సడలింపు సౌకర్యము చేయబడింది. హైదరాబాదు పబ్లిక్ సర్వీసు కమీషను వారిచే లోగడ ఎన్నిక చేయ బడిన అభ్యర్థులను ఖాళీలు ఎర్పడగానే వాటిలో నియమించడం జరుగుతున్నది. పూర్వ హైదరాబాదు సైన్యంలోని అధికారులు మినహా రిట్రెంచ్ చేయబడిన గెజిటెడ్ అధికారులలో ఒకరిద్దరు మినహా అందరూ ఉద్యోగాలలోనికి తీసుకో బడినారు. 'బి' జాబితాలోగల రిట్రెంచ్ చేయ బడిన నాన్ గెజిటెడ్ ఉద్యోగులను కూడా, తిరిగి సర్వీసు కమీషన్ వారి నిమిత్తం లేకుండా ఉద్యోగాలలోనికి తీసుకోవలెనా అనే విషయం పరిశీలనలో ఉన్నది.

ప్రాంతీయ సంఘం :- భారత రాజ్యాంగం 371 వ. సూత్రం క్రింద భారత ప్రభుత్వం ఒక ప్రాంతీయ సంఘాన్ని నియమించింది. ఈ సంఘాన్ని నియమిస్తూ జారీ చేయబడిన ఉత్తర్వుకు అనుబంధంగా గల షెడ్యూలులోని విషయాలను పరిశీలించుటకు ఇది నియమించబడినది. ఈ షెడ్యూలులోని విషయాలు స్థానిక స్వపరిపాలన, ప్రజారోగ్యం, పరిశ్రమలు, వ్యవసాయం మొదలైన వాటికే సంబంధించి ఉన్నవి గాని ఉద్యోగములతో వీటికేమీ నిమిత్తం లేదు. సర్వీసుల విషయంలో ఇదివరకు పేర్కొన్న ప్రత్యేక గ్యారంటీలు అమలు జరుగుతున్నవి.

రక్షణ ఫలితాలు :- ఏమైనా వ్యక్తిగతంగా కలిగిన ఇబ్బందులనుగురించి ప్రభుత్వానికి నిర్దిష్టంగా ఫిర్యాదు లేమీ రాలేదు. సమన్వయం చేయబడిన సామాన్య గ్రెడేషన్ జాబితాలలో సీనియారిటీ నిర్ణయం విషయంలో కొన్ని విజ్ఞప్తులు వచ్చినవి. వాటిని పరిష్కరించుటకు భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన ప్రత్యేక సంఘాలు యీ విజ్ఞప్తులను పరిశీలించి పరిష్కరించగలవు. జీతభత్యముల విషయాలలో వ్యక్తిగతంగా వచ్చే విజ్ఞప్తులు వాటి వాటి మంచి చెడులను బట్టి పరిష్కరించబడ గలవు.

ఇవి కాకుండా తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలలో ఒకే విధమైన ఉద్యోగ హోదాలోలేని అధికారులకు ఒకేవిధమైన విధులను కేటాయించే విషయంలో కొన్ని ఇబ్బందులు సాధారణంగా ఉన్నవి. ఉదాహరణకు, తాసిల్దారు పదవులు తెలంగాణాలో గెజెటెడ్ ఉద్యోగాలు. ఆంధ్రలో నాన్-గెజెటెడ్ ఉద్యోగాలు. కాని యీ పదవులలో వున్నవారు నిర్వహించేపనులు ఒకటే. సహకార శాఖలో, తెలంగాణాలోని అసిస్టెంటు రిజిస్ట్రార్లు, ఆంధ్రలోని సబ్ రిజిస్ట్రార్ల విషయంకూడా ఇంతే. ఇటువంటి వారి విషయంలో గెజిటెడ్ నాన్ గెజిటెడ్ ఉద్యోగులు ఉభయులూ ఒకే సీనియారిటీ జాబితాలో చేర్చబడ లేదు. వారి జాబితాలు వేర్వేరుగా చూపబడినవి కాబట్టి యీ విషయంలో ఎవరికీ యిబ్బంది కలగదు. ప్రమోషన్లలో ఉభయ ప్రాంతాలకు కొంత నిష్పత్తిని కేటాయించడం ద్వారా యీ రెండు తరగతులవారి ప్రయోజనాలు సంరక్షించబడినవి. ప్రత్యేక తరగతులకు చెందిన పదవులలో గల తెలంగాణా అధికార్లందరినీ సాధ్యమైనంత త్వరలో సమన్వయ పరచుకొని, క్రొత్త నియామకాలకి మామూలు స్కేళ్లు, తరగతులు మాత్రమే వర్తింప చేయాలని సంకల్పం. ఇప్పటి ఆందోళనలో అధిక భాగం వాణిజ్య పన్నులశాఖ నుండియే ప్రారంభమైనది. ఆ శాఖలో కొన్ని వ్యత్యాసాలు ఏర్పడినవి తెలంగాణాలోని రెండవతరగతి అమ్మకంపన్ను అధికార్లు గెజిటెడ్ అధికార్లు. 1957 సంవత్సరపు అమ్మకం పన్నుచట్టం అమలుతో వీరికి ఆంధ్రలోని నాన్ గెజిటెడ్ ఉద్యోగులైన డిప్యూటీ వాణిజ్య పన్నుల అధికార్లకుగల బాధ్యతలే ఇవ్వబడినవి. రెండవ తరగతి అమ్మకంపన్ను అధికార్లు, పై వాణిజ్యపన్నుల అధికార్లు, విడివిడిగా, రెండు ప్రత్యేక తరగతులక్రిందనే ఉంచబడినారు. అయితే హైదరాబాదునగరంలో అమ్మకం పన్నుల మండలాలను 11 నుండి 4 కు తగ్గించినందున, లోగడ మండలాల అధిపతులుగా పనిచేసిన రెండవతరగతి అమ్మకం పన్ను అధికార్లు 6 గురు లేక 7 గురు, ఇప్పుడు 1 వ తరగతి అమ్మకంపన్ను అధికార్లక్రింద పని చేయవలసివస్తున్నది. వారికి మున్ముందు ప్రమోషను వచ్చేవరకు యీ విధంగా వారు పనిచేయవలసి ఉంటుంది. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అమ్మకం పన్నుల వ్యవహారాలలో ఐక్యత సాధించుటకై మండలాలను తగ్గించిన ఫలితంగా దురదృష్టకరమైన యీ పరిస్థితి తప్పనిసరిగా ఏర్పడింది. నగరంలో 11 మండలాలు ఏర్పాటు చేయటం ఏమంత భావ్యంకాదు. మద్రాసులో, ఇంతకంటే 8 రెట్లు ఆదాయం వున్నా రెండు మండలాలు మాత్రమే ఏర్పాటై వున్నవి. జీతాలు, గెజిటెడ్ హోదా మాత్రము చెక్కు చెదరకుండా రక్షించ బడినవి. కాని మండలాలు తగ్గింపబడి నందున ప్రతి రెండవ తరగతి అమ్మకం పన్ను అధికారికీ మండలాధిపత్యం ఇవ్వటానికి మాత్రం వీలు కలుగలేదు. మరి కేవలం ఇందుకోసం మండలాలను ఏర్పాటు చేయలేకదా.

ఇంకా తక్కువ స్థాయిలోగల ఉద్యోగులు ప్రత్యేక ప్రాంతీయ తరగతులలోనే ఉంటున్నారు. వారిలో ఒకరితో ఒకరికి పోటీలేదు. డిప్యూటీ వాణిజ్య పన్నుల అధికార్లు, అంతకు తక్కువ హోదాగల ఉద్యోగులు అనంతపురం, గుంటూరు, కాకినాడలలోని డిప్యూటీ వాణిజ్య పన్నుల కమిషనర్ల రేంజీల ననుసరించి ప్రాంతీయ సీనియారిటీ జాబితాలలో చూపబడినారు. అలాగే తెలంగాణా ప్రాంతంలోని వారుకూడా ప్రత్యేక తరగతిక్రింద పేర్కొన బడినారు. వారికి వుండే ప్రమోషను అవకాశాలు ఉండనే ఉన్నవి.

సీనియర్ పదవుల పంపిణీ:- పోతే సీనియర్ అధికార్ల విషయంలో, దిగువ పేర్కొన్న సంఖ్యలు గమనార్హములు. జనాభా ప్రాతిపదిక ననుసరించి యీ పదవులలో మూడవవంతు తెలంగాణా వారికి ఉండాలి. కాని వాస్తవంగా అంతకంటే చాలా ఎక్కువగానే ఉన్నాయి.

సచివాలయంలో:- 14 మంది కార్యదర్శులలో 8 మంది ఆంధ్రనుండి వచ్చినారు. 6 గురు తెలంగాణావారు.

డిప్యూటీ సెక్రటరీలు:- 29 మందిలో, 12 మంది ఆంధ్రనుండి వచ్చినవారు, 17 మంది తెలంగాణా వారు.

శాఖాధిపతులు:- గవర్నరు సిబ్బందిని మినహాయిస్తే, 35 మంది ఆంధ్రనుండి వచ్చినవారు, 26 మంది తెలంగాణావారు. ఇందులో, స్టేట్ రోడ్డు రవాణా కార్పొరేషన్ ప్రధాన కార్య నిర్వాహక అధికారి, నిజాం పంచదార ఫ్యాక్టరీ అపరేటివ్ డైరెక్టరు, సింగరేణి బొగ్గుగనుల ఆపరేటివ్ డైరెక్టరు పదవులు చేర్చబడలేదు. వీరు ముగ్గురుకూడా తెలంగాణావారే. వీరినికూడా శాఖాధిపతులక్రింద లెక్కిస్తే, ఆంధ్ర నుండి వచ్చినవారు 35 మంది, తెలంగాణావారు 29 మంది కాగలరు.

ముఖ్యమైన శాఖాధిపతులను మాత్రమే లెక్కలోనికి తీసుకుంటే పరిస్థితి వేరుగా ఉంటుంది. రెవిన్యూబోర్డుసభ్యులు నలుగురిలో ఒకరు తెలంగాణావారు. వ్యవసాయశాఖ డైరెక్టరు, సహకార సంఘాల రిజిస్ట్రారు, మెడికల్ సర్వీసుల డైరెక్టరు, ప్రజారోగ్యశాఖ డైరెక్టరు ఆంధ్రనుండి వచ్చినవారు, పరిశ్రమలశాఖ డైరెక్టరు విద్యాశాఖ డైరెక్టరు తెలంగాణాకు చెందినవారు. 9 మంది చీఫ్ ఇంజనీర్లలో ఆంధ్రనుండి వచ్చినవారు 6 గురు, తెలంగాణావారు ముగ్గురు.

ఇబ్బందుల పరిష్కార సంఘం:- రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. పి. పాయ్, ఐ.సి.ఎస్. రెవిన్యూ బోర్డు సభ్యుడు శ్రీ గులాం హైదర్, ఐ ఎ ఎస్. రాష్ట్రప్రభుత్వ ఆరోగ్యశాఖ కార్యదర్శి శ్రీ ఎల్. ఎస్. గుప్త సభ్యులుగా ప్రభుత్వం ఉద్యోగుల ఇబ్బందుల పరిష్కార సంఘాన్ని నియమించింది. సిబ్బందినుండి వచ్చే ఫిర్యాదులు వ్యక్తిగతమైనవైనా, తరగతుల వారీగా వచ్చినవైనా గెజెటెడ్ ఉద్యోగులకు చెందినవైనా, లేక నాన్ గెజెటెడ్ తరగతులకు చెందినట్టివైనా, యీ సంఘంవారు పరిశీలించి ప్రతి సందర్భంలోను తీసుకోవలసిన లేక తీసుకొనుట వాంఛనీయమైన చర్యను గురించి ప్రభుత్వానికిగానీ, లేక ఆయా శాఖలకుగాని, సలహా ఇస్తారు. ఈ కమిటీ పరిశీలించే విషయాలు యివి:-

1. రాష్ట్ర పునర్నిర్మాణ ఫలితంగా ఏర్పడిన ఇబ్బందులు.
2. పూర్వపు హైదరాబాదు రాష్ట్రానికి చెందిన సిబ్బందికి ఇవ్వబడిన రక్షణల ఉల్లంఘన వల్ల కలిగే యిబ్బందులు.
3. అన్యాయము, లేక పక్షపాత బుద్ధితో కూడిన చర్యల విషయంలో స్థూలంగా ఋజువు కనిపించే విషయాలు.

విలీనమైన సర్వీసులలో సీనియారిటీకి సంబంధించిన వాటిని యీ కమిటీ పరిశీలించదు. ఎందువల్లనంటే, ఆరకం యిబ్బందుల పరిశీలనకై భారత ప్రభుత్వంవారు యిదివరకే ఒక కమిటీని నియమించారు.

ఈ కమిటీకి తమ యిబ్బందుల్ని తెలియచేయగోరువారు వ్రాతమూలకంగా తెలియజేయాలి. అసలు ప్రతికి నాలుగు ప్రతులనుతీసి, వాటిని తమతమ శాఖాధిపతులద్వారా రాష్ట్రప్రభుత్వ సాధారణ పరిపాలనశాఖ (రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ బ్రాంచి) డిప్యూటీ సెక్రటరీ పేర పంపాలి. ఈ సందర్భంలో, అన్ని ఫిర్యాదులు లేక పెటిషన్లు శాఖాధిపతులకు 1958 మే 20 వ. తేదీలోగా పంపబడాలి. శాఖాధిపతులు వాటిని, తమకు అవి చేరిన 10రోజులలోగా పైకమిటీకి పంపాలనీ, యే పరిస్థితులలోను అందుకు భిన్నంగా వ్యవహరించరాదనీ ఆదేశాలు యివ్వబడుతున్నవి.

అవసరమని భావిస్తే, యీ కమిటీ దరఖాస్తుదార్లు లేక పెటిషనర్లు కోరిన పక్షంలో వారికష్టనిష్టూరాల్ని స్వయంగా వినవచ్చు.

# మోటారు శకటాలపై పన్ను విధింపు

రాష్ట్రమంతటా గల పన్నుల విధింపు కార్యక్రమంలో సమన్వయ సాధనకై యిటీవల ఆంధ్ర ప్రదేశ్ శాసన సభవారు దిగువ పేర్కొన్న రెండు బిల్లుల్ని ఆమోదించారు.

1. 1958 మద్రాసు మోటారు శకటాల (ప్రయాణీకులు, వస్తువులపై పన్ను విధింపు) (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లు.

2. 1958 హైదరాబాదు మోటారు శకటాల పన్ను విధింపు (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లు.

ఈ రెండు బిల్లులలోని నిబంధనలు 1-4-1958 నుండి గానీ, లేదా అందుకై ప్రకటించ బడు తేదీ నుండి గానీ అమల్లోకి రాగలవు.

మొదటి బిల్లు ననుసరించి ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలో అమల్లో వున్న 1952 మద్రాసు మోటారు శకటాల (ప్రయాణీకులు, సరుకులపై పన్ను విధింపు) చట్టం తెలంగాణా ప్రాంతానికి కూడా వర్తింపజేయ బడింది. స్టేజ్ క్యారేజీలు, పబ్లిక్ కారియర్ శకటాలపై వెళ్లే ప్రయాణీకుల పైన, వస్తువులపైన పన్ను విధించటానికి యీ చట్టం ఉద్దేశించ బడింది. ఈ పన్నులు యిప్పుడు ఆంధ్రప్రాంతంలో వసూలు చేయబడు తున్నవి. కాని తెలంగాణా ప్రాంతంలో యీ చట్టం నిబంధనల్ని వస్తు శకటాలకు మాత్రమే వర్తింప చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది. తెలంగాణా ప్రాంతంలో స్టేట్ క్యారేజీలలో ప్రయాణించే ప్రయాణీకులనూ వస్తువులనూ పన్ను విధింపు నుండి మినహాయించే ప్రకటన ఒకటి విడిగా చేయబడుతున్నది. ప్రకటనలో పేర్కొన్న నిర్ణీత తేదీ నుండి తెలంగాణాలోని పబ్లిక్ క్యారీయర్ల యజమానులు చట్టంలో నిర్ణీతమైన రేట్ల ననుసరించి పన్ను చెల్లించాలి, సరుకుపై ఛార్జీల ద్వారా వారికి వచ్చే మొత్తంలో రూపాయకి 3 నయాపైసల వంతున గానీ లేక నెలకు మొత్తం రూ. 22.50 న. పై.లు గానీ చెల్లించవచ్చు. పన్ను చెల్లింపుకి సంబంధించిన ఇతర వివరాలు ఆయా ప్రాంతాలలోని ప్రాంతీయ ట్రాన్స్పోర్టు అథారిటీ కార్యదర్శినుండి గానీ, హైదరాబాదు, సికిందరాబాదు నగరాల విషయంలో రాకపోకల వ్యవహారాలను చూచే పోలీసు డిప్యూటీ కమీషనర్ నుండి గానీ తెలుసుకోవచ్చు

పోతే రెండవ బిల్లు ప్రకారం తెలంగాణా ప్రాంతంలోని మోటారు శకటాల మీద చెల్లించవలసిన పన్ను రేట్లు పెంచబడినవి. ఈ రేట్లను ఆంధ్ర ప్రాంతపు రేట్లతో సాధ్యమైనంత వరకు సమాన స్థాయికి తెచ్చుటకై యీ హెచ్చింపు జరిగింది. బిల్లులో పేర్కొన్న రేట్లు ప్రస్తుత రేట్ల కంటే 25 నుండి 300 శాతం వరకు ఎక్కువగా వున్నవి. అయినప్పటికీ యీ రేట్లు యింకా ఆంధ్ర ప్రాంతంలో అదేరకం శకటాలకి వర్తించే రేట్లకంటే చాలా తక్కువగానె వున్నవి. ఈ విషయంలో క్రమక్రమంగా సమాన స్థాయి సాధించబడుతుంది. టోలు పన్ను, యితర మునిసిపల్ పన్నుల విధింపు నుండి మోటారుశకటాలను మినహాయించే సమస్య విడిగా ఆలోచించ బడుతున్నది ఆ విషయంలో ఉత్తరువులు విడిగా జారీకాగలవు. ఇతర వివరాలకు పై పేరాలో పేర్కొన్న అధికారులతో సంప్రదించవచ్చు.

# కోర్టుఫీజు నిబంధనలు

ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతములో, 1956 ఆంధ్ర కోర్టురుసుం, దావాల వాల్యుయేషన్ చట్టం, తెలంగాణా ప్రాంతంలో 1324 ఫ. హైదరాబాదు కోర్టురుసుం చట్టం, 1318 ఫ. హైదరాబాదు దావాల వాల్యుయేషన్(జూరిస్‌డిక్షన్ ప్రయోజనాలకై) చట్టాలు అమలులో వున్నాయి. రాష్ట్రీయ రెండు ప్రాంతాలలోను అమలులో వున్న పన్ను విధింపు కార్యక్రమంలో యేకత్వాన్ని సాధించవలసివున్నది. ఆయా ప్రాంతాలలో అమలు జరిగే చట్టాలను యేకం చేసే లోపలే ఆ ప్రయోజనాలను పొందుటకు వీలుగా 1956 ఆంధ్ర కోర్టురుసుం, దావాల వాల్యుయేషన్ చట్టం తక్షణం తెలంగాణా ప్రాంతానికి వర్తింప చేయ బడుతుంది. ఇప్పుడు అక్కడ అమలులోవున్న పై రెండు చట్టాలు రద్దుచేయ బడతాయి. ఈ నిర్ణయం అమలుకై 1958 ఆంధ్ర కోర్టురుసుం, దావాల వాల్యుయేషన్ (ఆంధ్రప్రదేశ్ సవరణ) చట్టం అనే పేరుతో ఒక చట్టం చేయబడి, 26-3-58 తేదీగల ఆంధ్రప్రదేశ్ గెజిట్ అసాధారణ సంచికలో ప్రకటింప బడింది. దాని నిబంధనలు 1-4-58 నుంచి అమలు పరచ బడతాయి. ఆ తేదీలునుంచి కోర్టురుసుం తెలంగాణా ప్రాంతంలో కూడా పైన పేర్కొన్న రెండు హైదరాబాదు చట్టాలక్రింద కాక 1956 ఆంధ్ర కోర్టురుసుం, దావాల వాల్యుయేషన్ చట్టం నిబంధనల ననుసరించే చెల్లించ బడాలి.



# ఖాదీ గ్రామోద్యోగ మహా విద్యాలయం

హైదరాబాదులోని ఖాదీ గ్రామోద్యోగ మహా విద్యాలయంలో 1958 మార్చి 18, 19 తేదీలలో బొంబాయి ఖాదీ, కుటీర పరిశ్రమల కమిషన్ యొక్క ఫిల్ము సెక్షన్ రెండు వార్తా చిత్రాలను ప్రదర్శించింది. ఈమహా విద్యాలయంలో శిక్షణ పొందుతున్న ఎక్‌స్టెన్షన్ వుద్యోగుల నిమిత్తం యేర్పాటైన యీ ప్రదర్శనలో ఖాదీ, కుటీర పరిశ్రమలు, భూదానం, వ్యవసాయం, మున్నగు వాటికి సంబంధించిన వార్తా చిత్రాలు చూపబడినవి. వాటి ప్రదర్శన విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధాల శాఖ తోడ్పడింది. ఆ చిత్రాలు చక్కని విషయాలను బోధించేవిగా వున్నవి. శిక్షణ పొందే వారని అవి బాగా ఆకర్షించాయి.





రాష్ట్ర సమాచార, ప్రణాళికల శాఖ మంత్రి శ్రీ పి. వి. రాజు 26-8-58 న హైదరాబాదులోని ఆలిండియా రేడియో కేంద్రంలో ప్రణాళికా ప్రచారం వేసవి కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఆ సందర్భంలో రాష్ట్ర శాసనసభ అధ్యక్షులు శ్రీ ఏ. కాశేశ్వరరావు అధ్యక్షత వహించారు.



కేంద్ర మంత్రిగా నియమితులైన శ్రీ బి. గోపాలరెడ్డికి 24-8-58 న రాష్ట్ర ప్రభుత్వం వీడ్కోలు విందు జరిపిన సందర్భంలో తీయబడిన గ్రూపు ఫోటో.



రాష్ట్ర ముఖ్యమంత్రి 1.3.58 న హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ తొలి ద్రాక్ష ప్రదర్శనను ప్రారంభించారు



రాష్ట్ర వ్యవసాయ శాఖ మంత్రి (శ్రీ) పి. తిమ్మారెడ్డి 19.8.58 న హైదరాబాదులో భారతీయ కేంద్ర నూనెగింజల కమిటీ పదకొండవ (వార్షిక) సాధారణ సమావేశాన్ని ప్రారంభించారు.



సాటిలేని మేటిపంట: డా. రామకోటేశ్వరరావు హైదరాబాదు తోళిచౌకిలోని తమ దాక్షిణ తోటలో ద్రాక్ష పళ్లను యిది వరకు యెవరూ పండించనంత యెక్కువగా పండించారు. ఆ ద్రాక్షతోటను వీక్షిస్తున్న రాష్ట్రగవర్నరును చిత్రంలో చూడవచ్చు.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్ల ప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతం రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8¼" డెమ్మీ.
2. ముందటి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్ ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,<br>
సమాచార పౌరసంబంధముల శాఖ<br>
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం<br>
హైదరాబాదు దక్కన్ — 1.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలు మార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| ***12*** *సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి కూడా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| ***10*** *సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒక్కొక్కటి రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడాలభిస్తాయి. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2½ వంతులచొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ .15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. |

15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు : రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 28,000 ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి 8½ వంతుల చక్రవడ్డీతో నెలసరి వాయిదాలుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతవి. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది! భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు :

నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)

చిరునామాకు గాని వ్రాయవలెను.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటనరేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8½" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైద్రాబాదు దక్కన్ — 1.



హుస్సేన్‌సాగర్ మత్స్య పోషణ కేంద్రం.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో

# మత్స్యసంపద అభివృద్ధి

సాధారణంగా భారతీయుల ఆహారంలో ధాతు పుష్టికి మిక్కిలి అవసరమైన మాంసకృత్తులు లోపించి వుంటాయి. జంతుమాంసం, కోడిమాంసం మున్నగు వాటికంటె చేపలు మంచివి. అవి చౌకగా కూడా లభిస్తాయి. ఆపైన అవి దేశంలో పెద్ద ప్రాంతాలలోవి సగటు మానవుని ఆహారంలో ఒక ముఖ్య భాగమై వున్నాయి. అదృష్టవశాత్తూ, ఆంధ్రప్రదేశ్‌కి 600 మైళ్ళ పొడుగు తీర ప్రదేశ మున్నది. చేపలు పట్టడానికనువైన సముద్రప్రదేశం 12,000 చ. మైళ్లు లేక 76,80,000 యెకరాలు అని అంచనా వేయబడింది.

మత్స్యసంపద అభివృద్ధి కార్యక్రమంలో 5 ప్రధానమైన భాగాలున్నాయి. 1. డ్రైరేషన్ 2. సముద్రరేవుల అభివృద్ధి 3. ఇతరరేవుల అభివృద్ధి 4. పరిశోధన 5. సోషియో-యెకనమిక్సు.

తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆంధ్రలో 97.67 లక్షల చిరు చేపలు సేకరించబడి, ప్రభుత్వ శాఖకు చెందిన నీటి వనరులలో నిలువచేయ బడినవి. ప్రైవేటు మత్స్య పోషకులకు కూడా అవి పంపిణీ చేయబడినవి. మొత్తం యించుమించు 10,000 టన్నుల చేపలు వుత్పత్తి చేయబడినవి. మనది వుష్ణ దేశం కావడంవల్ల పట్టిన చేపలు త్వరగా చెడిపోతాయి. కాబట్టి తొలి ప్రణాళిక కాలంలో 3 మత్స్య శుద్ధి కేంద్రాలు ప్రారంభింప బడినవి. చేపల

శుద్ధికై వుప్పు యిక్కడ సబ్సిడీ ధరలకు యివ్వ బడేది. ఈ కేంద్రాలలో సుమారు 2,500 టన్నుల చేపలు శుద్ధి చేయబడినవి. రేవు కేంద్రాల నుంచి చేపల శీఘ్రరవాణాకై ప్రభుత్వ మత్స్య శాఖ రెండు వాన్‌లను యేర్పరచింది. అవి యించుమించు 268 టన్నుల చేపల్ని రవాణా చేసినవి. జాలర్లు వలల్ని బాగు చేసుకుని యెక్కువ చేపలు పట్టుకోడానికై వారికి నూలును సబ్సిడీ ధరలకు యీ శాఖ లభింప చేసింది. సముద్రంలో లోతు రేవుల్లో చేపలు పట్టడానికై సమిష్టి మద్రాసు రాష్ట్రంలో 8 మోటారు బోట్లు కొనబడినవి. వాటిలో ఒకటి కాకినాడలో వుంచబడింది. తొలి ప్రణాళిక కాలంలో అది కొంతకాలం పనిచేసింది కాని అది యెక్కువగా మరమ్మతులలో వుండేది. చేపలుపట్టే స్థానిక నావలు రెండింటికి 10 హా. ప. మారిన్ డీసెల్ ఇంజన్లు అమర్చ బడినవి. ఇవి సముద్రంలో చేపలు పట్టడానికి బాగా వుపయోగించేవి. చేపలు చెడిపోకుండా నిలవ చేయడానికి 50 టన్నులు పట్టే మంచు గడ్డ యంత్రం ఒకటి టి. సి. ఏ. క్రింద కానుకగా లభించింది కాని అది స్థాపించ బడలేదు.

తెలంగాణా ప్రాంతంలో, మహబూబ్‌నగరం, కరీంనగరం జిల్లాల్లోని మత్స్యసంపద అభివృద్ధి పరచ బడినది. చిరు చేపల్ని సేకరించి, ఆ జిల్లాల్లోని వివిధ నీటి వనర్లలో నిలవ చేయడం జరిగింది. ఇందు మూలంగా, తొలి ప్రణాళిక కాలంలో 80 లక్షల పౌనులకు మించి చేపలు వుత్పత్తి అయినవి.

## ముప్పది పథకాలు

రాష్ట్రంలో మత్స్యసంపద అభివృద్ధికి యింకా యెంతో అవకాశమున్నది. దీనిని బట్టి చూస్తే, తొలి ప్రణాళిక కాలంలో జరిగిన పనిదీ లెఖ్కలోది కాదు. కాబట్టి మిగిలిన దానిని ద్వితీయ ప్రణాళిక కాలంలో పూర్తి చేయాలని సంకల్పించ బడింది. ఇందు నిమిత్తం మొత్తం మీద 30 పథకాలు—18 ఆంధ్రలోను, 12 తెలంగాణాలోను—మొత్తం రూ. 110.51 లక్షల—రూ. 76.06 ఆంధ్రలోను, 34.45 తెలంగాణా లోను వ్యయంపై అమలు జరుపబడగలవు. ఈ సందర్భంలో రూ. 18.08 లక్షల వరకూ కేంద్ర ప్రభుత్వం నుంచి లభించగలవు. ఇందులో రూ. 17.08 లక్షలు గ్రాంట్ల రూపంలో లభిస్తాయి.

ఆంధ్ర ప్రాంతంలో, ద్వితీయ ప్రణాళిక కాలంలో హెడ్ క్వార్టర్సు సిబ్బందిని బలపరచాలని సంకల్పం. ప్రారంభమైన పథకాలు యింకా బాగా అమలు జరగాలనే వుద్దేశంతో యీ చర్య తలపెట్ట బడింది. ప్రభుత్వ శాఖ కార్యక్రమాల్ని గురించి ప్రజలకి, జాలర్లకి కూడా తెలియ చేయడం అవసరం. కాబట్టి ద్వితీయ ప్రణాళిక కాలంలో ఒక సమాచార యూనిట్టును యేర్పరచాలని సంకల్పం. రాష్ట్రంలో ఒక జలజంతు ప్రదర్శన స్థావరం కూడా నిర్మించబడగలదు. 'ఉప్పు సబ్సిడీ పథకం' క్రింద మరి 10 మత్స్య శుద్ధి కేంద్రాలు ప్రారంభింప బడగలవు. ఆపైన జాలర్లకి 45 మోటారు బోట్లు సబ్సిడీ ధరలకి యివ్వబడగలవు. బోట్ల ఖరీదు చిన్న చిన్న వాయిదాలలో 5 సంవత్సరాలలో వసూలు చేయబడుతుంది. ఈ 5 సంవత్సరాలలోను చేపలు పట్టని నెలలు చేరి వుండవు. జాలర్లకి 1,000 నైలాన్ వలలు కూడా సబ్సిడీ ధరలకు యివ్వబడతాయి. మామూలు పడవలన్నిటి స్థానే మోటారు బోట్లను ప్రవేశ పెట్టడానికి చాలా కాలం పడుతుంది. కాబట్టి మోటారు బోట్లతో చేపలు పట్టడం యిప్పుడప్పుడే వ్యాప్తిలోకి రాదు. కాబట్టి మత్స్య శాఖ జాలర్లకి తెప్పలు చేసుకోడానికి పనికి వచ్చే 1 000 దుంగలను సబ్సిడీ ధరలకు యిస్తుంది. రాష్ట్రంలో అనువైన స్థలాల్లో 9 మారిన్‌ఫిషరీ కేంద్రాలు యేర్పాటు చేయబడతాయి. ఇక్కడ బోట్ల మరమ్మతుకి, మోటారు బోట్ల కవసరమయే విడి భాగాలు, నూనెల సరఫరాకి, వాతావరణ పరిస్థితుల్ని తెలియ జేయడానికి వసతి వుంటుంది. వివియోగ కేంద్రాలకి చేపల శీఘ్ర రవాణాకై ద్వితీయ ప్రణాళిక కాలంలో 10 వాన్‌లను, 2 కారియర్ బోట్లను కొనాలని కూడా సంకల్పించ బడింది.

త్వరగా పెరిగే రకం చిరుచేపలు కావాలని ప్రైవేటు మత్స్య పోషకులు చాల మంది అడుగు

తున్నారు. పొరుగు రాష్ట్రంలో యీ రకాలు వీలేనందున అక్కడివారు కూడా చాలమంది టిని అడుగుతున్నారు. కాబట్టి ప్రణాళిక కాలంలో 320 లక్షల చిరు చేపలు సేకరించ బడగలవు. ప్రస్తుతం వూరికే పడివున్న 600 చెరువుల్ని తీసుకని వాటిలో కూడా చేపల్ని పెంచాలని సంకల్పం. చేపలు, చిరు చేపల్ని పెంచి కావలసిన మత్స్య పోషకులకివ్వడానికేమి, చేపల యెకరా వుత్పత్తి హెచ్చింపు విషయంలో ప్రయోగాలు జరపడానికేమి ప్రతి జిల్లాకు ఒక మత్స్య పోషణ కేంద్రం తప్పక వుండాలి. కాబట్టి జిల్లాల్లో 8 ప్రయోగ మత్స్య పోషణ కేంద్రాలు ప్రారంభించబడతాయి.

6 అడుగుల కంటె యెక్కువ లోతున్న చెరువుల్లో జాలర్లు ప్రస్తుతం చేపలు పట్టడం లేదు. వేసవి కాలంలో నీటిలోతు తగ్గుతుంది. కాబట్టి వారు అప్పుడే చేపలు పడతారు. అయితే చెరువులలో నీరు తగ్గడంతో పాటే, మార్కెట్టుకి చేపలు విరివిగా రావడం, తన్మూలంగా వాటి ధర కూడా తగ్గడం జరుగుతుంది. అందుచేత, లోతు నీటి చేపల వేట యూనిట్టు నొకదానిని స్థాపించాలని సంకల్పించబడింది. ఇక్కడ జాలర్లకి లోతునీటిలో చేపలు పట్టడం నేర్పబడుతుంది. అప్పుడు వారు సంవత్సరం పొడుగునా చేపల్ని పట్టి అమ్ముకుని, వాటికి సరైన ధరను పొందగలుగుతారు.

## పరిశోధన కేంద్రాలు

ఏ పరిశ్రమనయినా సరైనపద్ధతిలో యేర్పాటు చేయాలంటే, అందుకు పూర్తి పరిశోధనవల్ల సేకరించిన సమాచారం కావాలి. మత్స్య పరిశ్రమాభివృద్ధివిషయంలో యిది మరీ అవసరం. ఎందువల్లనంటే, చేపల జీవిత చరిత్ర, ఆహారం, సంతానాభివృద్ధి విషయాలలో వాటి అలవాట్లు మున్నగు వాటికి సంబంధించిన సమాచార మేమీ మనకి తెలియదు. సముద్రరేవుల విషయంలో, చేపలు పట్టడానికి మిక్కిలి అనువైనకాలం యేదో, చేపలు వలసవెళ్లే ప్రదేశం యేమిటో, యెంతవరకూ పెరిగాక వాటిని పట్టవచ్చునో అన్నవిషయాలను



జూబ్లీ హిల్ చెరువు దృశ్యం.

తెలుసుకోవలసివున్నది. అలాగే మిగిలిన రేవులవిషయంలో, చేపల వుత్పత్తిని పెంచేమార్గాలు, రవాణా సమయంలో యెక్కువ చేపలు చనిపోకుండా కాపాడే మార్గాలు మున్నగు వాటిని గురించి తెలుసుకోవలసివున్నది. కాబట్టి రెండు పరిశోధన కేంద్రాలను స్థాపించాలని సంకల్పించబడింది. ఒకటి సముద్రరేవులకి సంబంధించిన పనిని, రెండవది యితర రేవులకి సంబంధించిన పనిని చూస్తాయి.

చేపలు మాంసకృత్తులు సమృద్ధంగా వున్న ఆహారమే కాదు. వాటినుంచి అనేకమైన యితర పదార్థాలను తయారు చేయవచ్చు కూడా. ఈ వుపపదార్థాలను యింకా బాగా, చౌకగా తయారు చేసే విధానాలను కనుగొని వాటిని జాలర్లకి తెలియజేయాలి. మనకి సొరచేపలు చాలా యెక్కువగా లభిస్తాయి. వాటి కాలేయంతో తయారైన నూనెలో విటమిన్ 'ఎ' పుష్కలంగా వుంటుంది. కాబట్టి ఒక టెక్నలాజికల్ కేంద్రాన్ని ప్రారంభించాలని సంకల్పించబడింది. దానిని చేరి ఒక చేపనూనె ( షార్కులివర్ ఆయిల్ ) ఫ్యాక్టరీ వుంటుంది.

మన జాలర్లు వెనుకబడివున్న అజ్ఞానులు. చేపలు పట్టడం లేక వాటిని నిలవ చేయడంలో కొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టడానికి వీరి అజ్ఞానం ఒక ఆటంకంగా వుంటున్నది. కాబట్టి జాలరిగ్రామాలలో 20 పాఠశాలల్ని తెరిచి, జాలరి పిల్లలకి వుచితంగా చదువు నేర్పాలని, వారికి పలకలు, పుస్తకాలను కూడా వుచితంగా యివ్వాలని సంకల్పించబడింది. జాలరిగ్రామాలలో అధిక భాగం యింకా రోడ్లతో కలపబడలేదు. అందుచేత, ముఖ్యమైన గ్రామాలను కలపడానికై 10 మైళ్ల ఫీడర్ రోడ్లను నిర్మించాలని సంకల్పం. శుభ్రమైన స్థలంలో, ఆరోగ్యకరమైన పరిస్థితులలో చేపలను అమ్మడానికి వీలుగా 14 మార్కెట్లు స్థానిక సంస్థల సహాయంతో నిర్మించ బడతాయి. ఇందు నిమిత్తం వీటికి ధన సహాయం చేయబడుతుంది.

తెలంగాణాలో, ద్వితీయ ప్రణాళిక కాలంలో త్వరగా పెరిగే గండు చేప పిల్లల్ని తెప్పించి పెంచాలని సంకల్పించ బడింది. ఇక్కడ హుస్సేన్ సాగర్ వంటి వివిధ సాగరాలు, జలాశయాలు వున్నాయి. శాస్త్రీయ పద్ధతిలో వాటిలో చేపలు పట్టడానికి కావలసిన పడవలు మున్నగు సాధన సంపత్తి లేదు. కాబట్టి అవి అదనంగా కొనబడ గలవు. చేపలరేవుల నుంచి చేపల్ని హైదరాబాదు, సికింద్రాబాదు మార్కెట్లకి రవాణా చేయడానికి ఒక ట్రక్కు కూడా కొనబడుతుంది. నల్గొండ, ఆదిలాబాదు, హైదరాబాదు, ఖమ్మం జిల్లాల్లోని మత్స్య నిలయాల అభివృద్ధి పనిని చూడడానికి ప్రత్యేక సిబ్బంది లేక ప్రస్తుతం దానిని ప్రక్క జిల్లాల డ్రాఫ్టింగు సిబ్బంది చేస్తున్నది. ఇప్పుడీ పని నిమిత్తం అక్కడ ప్రత్యేక సిబ్బంది నియమించ బడుతుంది. జాలరి సహకార సంఘాలకి పడవలు మున్నగునవి సబ్సిడీ ధరలకు సరఫరా చేయ బడతాయి. ప్రధాన కార్యాలయం, పరిశోధన కేంద్రాలను బలపరచుటకు అదనపు సిబ్బంది నియమించ బడుతుంది. ఓవిధనీటి వనరులలో హెచ్చుగా. తీవ్రంగా చేపల్ని పట్టడం వల్ల ఎక్కువ చేపలు లభిస్తాయి. మిగులు చేపల్ని సరిగా నిలవ చేయక పోయినట్లయితే అమ్ముడయే లోపున అవి చెడిపోతాయి. కాబట్టి హైదరాబాదులో ఒక కోల్డు స్టోరేజ్‌ని నిర్మించాలని సంకల్పించ బడింది. ప్రణాళిక కాలంలో ప్రస్తుతపు ప్రధాన కార్యాలయపు భవనం కూడా విస్తరింప చేయబడుతుంది ప్రణాళిక క్రింద నియమించ సంకల్పించిన అదనపు పరిశోధన, అడ్మినిస్ట్రేటివ్ సిబ్బందికి దానిలో వసతి కల్పించ బడుతుంది.

ప్రస్తుతం మత్స్య శాఖ తన సిబ్బందికి కలకత్తా లోని కేంద్రీ ఇన్లండ్ మత్స్య సంపద పరిశోధన కేంద్రంలో శిక్షణ ఇస్తున్నది. మత్స్య సంపదాభి వృద్ధిలో వున్నత శిక్షణకై 10 మందిని అమెరికా ఇంగ్లండు, కెనడా దేశాలకి పంపాలని సంకల్పం చిన్న చేపల పెంపకానికి వేరే వసతి వుండడం అవసరం. పెద్ద చేపల నుంచి ఆత్మరక్షణ చేసు కొనుటకు తగిన యీడు వచ్చేవరకూ అవి యీ ప్రత్యేక ప్రదేశంలో పెంచబడాలి. ప్రస్తుతం అటువంటి కేంద్రాలు రెండు మాత్రమే, ఒకటి మనైర్‌లోను, మరొకటి నిజామాబాదు లోను వున్నవి. మహబూబ్‌నగరంజిల్లా లోని కోయల్ సాగర్ కేంద్రం, ప్రధాన కాలవ గండి పడినందున, చెడిపోయింది. ద్వితీయ ప్రణాళిక కాలంలో మహబూబునగరం, మెదక్, నిజామాబాదు, కరీంనగరం జిల్లాల్లో జిల్లాకొకటి చొప్పున అట్టి కేంద్రాలు 4 నిర్మించ బడతాయి.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో విడి విడిగా అమలు పరచబడగల పథకాలు, ఒక్కొక్క దానికి వుద్దేశించ బడిన ఖర్చుల వివరాలు దిగువ యివ్వబడినవి:—

## మత్స్య సంపద—ఆంధ్ర

| వరుస సంఖ్య | పథకం పేరు | ప్రణాళిక కేటాయింపు రూ. లక్షలలో | రిమార్కులు |
|---|---|---|---|
| 1. | హెడ్ క్వార్టర్సు సిబ్బంది | 0.81 | వాయిదా వేయబడింది. |
| 2. | చిరు చేపల తీవ్రి సేకరణ, పంపిణీ | 10.70 | మంజూరైంది. |
| 3. | ఉప్పు సబ్సిడీ పథకం | 1.67 | ,, |
| 4. | దేశవాళీ క్రాఫ్టు, టాకిల్ అభివృద్ధి | 3.33 | ,, |
| 5. | శీఘ్ర రవాణా సౌకర్యాల యేర్పాటు | 4.00 | ,, |
| 6. | కొత్తరకం చేపల వలల్ని ప్రవేశపెట్టే పథకం | 5.00 | ,, |
| 7. | మత్స్య నిలయాల విస్తరణ, ప్రచారం | 1.00 | ,, |
| 8. | చెరువుల అభివృద్ధి పథకం | 12.00 | ,, |
| 9. | ప్రయోగ మత్స్య పోషణ కేంద్రాలు | 8.00 | ,, |
| 10. | లోతు నీటిలో చేపలుపట్టే ప్రయోగాలు | 2.00 | ఇంకా మంజూరు కాలేదు. |
| 11. | మారిన్ ఫిషరీ కేంద్రం | 8.00 | ,, |
| 12. | తెప్పలతయారీకై జాలర్లకి దుంగల సరఫరా పథకం | 2.50 | ,, |
| 13. | జాలరి పిల్లల నిమిత్తం పాఠశాలలు | 2.40 | ,, |
| 14. | రోడ్డు సౌకర్యాలు | 0.50 | ,, |
| 15. | చేపల మార్కెట్ల అభివృద్ధి | 1.40 | ,, |
| 16. | టెక్నలాజికల్ కేంద్రం | 4.84 | ,, |
| 17. | మత్స్యసంపద పరిశోధన | 2.00 | ,, |
| 18. | రాష్ట్రంలో జలజంతు ప్రదర్శన స్థావర నిర్మాణం | 5.91 | ,, |
|  | మొత్తం | 76.06 |  |

## మత్స్య సంపద—తెలంగాణా

1. అధికాహారోత్పత్తి కార్యక్రమం క్రింది పథకం (రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కలిసి పెట్టుబడి పెడుతవి.)

| | | | |
|---|---|---|---|
| అ. | చిరుచేపల పంపిణీ, నిలవ | 5.00 | మంజూరైంది. |
| ఆ. | ఫిషరీకి అవసరమైన సరుకుల సరఫరా | 1.50 | ,, |
| ఇ. | చేపల నిలవ, మార్కెటింగులకై రవాణా సౌకర్యాలు | 0.64 | ,, |
| ఈ. | నిర్ణీతమైన చెరువులలో చేపల వుత్పత్తి హెచ్చింపు | 3.00 | ,, |

| | | | |
|---|---|---|---|
| 2. | నల్గొండ జిల్లాలో మత్స్య సంపదఅభివృద్ధి పథకం | 3.00 | ,, |
| 3. | ఖమ్మం జిల్లాలో మత్స్య సంపదఅభివృద్ధి పథకం | 3.00 | ,, |
| 4. | సహకార సంస్థలకి సహాయం | 1.52 | ,, |
| 5. | ప్రధాన కార్యాలయానికి అదనపు సిబ్బంది | 1.00 | ,, |
| 6. | పరిశోధన కేంద్రానికి అదనపు సిబ్బంది | 0.80 | ,, |
| 7. | హైదరాబాదులో కోల్డు స్టోరేజి నిర్మాణం | 1.43 | ఇంకా మంజూరు కాలేదు. |
| 8. | ప్రధాన కార్యాలయం, పురావస్తు ప్రదర్శనశాల, జలజంతు ప్రదర్శన స్థావరం, లేబొరేటరీలు | 2.30 | ,, |
| 9. | సిబ్బంది శిక్షణ | 0.75 | వాయిదా వేయబడింది. |
| 10. | ఆదిలాబాదు జిల్లాలో మత్స్య సంపదఅభివృద్ధి | 3.00 | మంజూరైంది. |
| 11. | హైదరాబాదు జిల్లాలో మత్స్య సంపదఅభివృద్ధి | 3.58 | ,, |
| 12. | దిగువ నాలుగు జిల్లాల్లోను చిన్న చేపల పెంపకం కేంద్రాలనిర్మాణం, నిర్వహణ | | |
| అ. | మెదక్ | 1.05 | మంజూరైంది. |
| ఆ. | మహబూబునగరం | 1.05 | ,, |
| ఇ. | నిజామాబాదు | 1.05 | ఇంకా మంజూరు కాలేదు. |
| ఈ. | కరీంనగరం | 1.05 | ,, |
| | మొత్తం | 34.45 | |

# ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు

శ్రీ బి. ఆర్. సోమయాజులు (విద్యుచ్ఛక్తి చీఫ్ ఇంజనీరు)

ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు-తొలి అంచె-ఆంధ్రప్రదేశ్ లో అద్వితీయమైన జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు అయి వున్నది. ఇందులో యెన్నో లాభదాయకమైన అంశాలున్నాయి. ఉదాహరణకి దీనిని తక్కువ వ్యయంతో త్వరగా నిర్మించ వచ్చు. దీని నిర్మాణంలో క్లిష్టమైన పనిలేదు. విద్యుచ్ఛక్తి ప్రయోజనాలను శీఘ్రగతిని పొందవచ్చు. ప్రతి ఫలం యెక్కువ వస్తుంది. ప్రస్తుతపు నిర్మాణ యంత్రాలను, అనుభవజ్ఞులైన సిబ్బందిని, వ్యవస్థీకృతమైన యేర్పాట్లను వినియోగించు కోవచ్చు. దీనికి అవసరమైన విదేశ మారకం మిక్కిలి తక్కువ.

దేశంలో మిక్కిలి తక్కువ వ్యయంతో నిర్మాణమయ్యే జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులలో యిది ఒకటి. కేవలం రూ. 6 కోట్ల పెట్టుబడితో 120, ఎమ్.డబ్ల్యు., 100 వుత్పత్తి శక్తిని సాధించవచ్చు. దీని ప్రకారం స్థాపించిన ప్రతి కె.వా. కి యించుమించు రూ. 500/600 ఖర్చు కాగలదు. భారత దేశంలోని యుద్ధానంతర విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులకి స్థాపించిన ప్రతి కె.వా. కి రూ. 1,000 నుంచి రూ. 2,000 మించి ఖర్చవు తున్నది.

అతి సామాన్యమైన యీ ప్రాజెక్టు మచ్ ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకం చివరిభాగం నీటిని వుపయోగించు కుంటుంది. మచ్ ఖండ్ పథకం యిప్పుడు అమలు జరుగు తున్నది. అది అదేనదిపై 50 మైళ్ల యెగువన వున్నది. సీలేరు ప్రాజెక్టుకి ఆనకట్ట యేమీ నిర్మించ వలసిన అవసరం లేదు. కేవలం ఒక మళ్లింపు అడ్డకట్టను నిర్మిస్తే చాలు. ఇది, ఆతరువాత అభివృద్ధి దశలలో నిర్మాణం కాబోయే ఆనకట్టలో ఒక భాగంగా వుండగలదు. దీనికి పవర్ కెనాలు వుండదు. మళ్లింపు అడ్డకట్టయొక్క నీటి వ్యాప్తికి ప్రక్కనగల ఫోర్ బే ఒక పెద్ద సరస్సు అయి వున్నది. కురుచ పెన్ స్టాకులు నేరుగా యిక్కడినుంచి బయలు దేరతాయి.

ఆంధ్ర దేశానికి యీ ప్రాజెక్టు అత్యవసరమైనది ఎందువల్లనంటే, ఆంధ్రలో వాడకం అవసరాల అంచనా నివేదిక ప్రకారం ప్రస్తుతపు పంచవర్ష ప్రణాళిక ఆఖరు (అనగా 1960-61) నాటికి విద్యుచ్ఛక్తి కొరత 60ఎమ్.డబ్ల్యు. లకి మించ గలదు. రాష్ట్ర ప్రభుత్వం తయారు చేసిన యీ నివేదికకి కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్ తుది రూపమిచ్చింది. ఇందువల్ల యీ ప్రాజెక్టును ప్రారంభించడం అత్యవసర మవుతున్నది.

ఆనకట్ట, పవర్ కెనాల్ లేక టన్నెల్ ల నిర్మాణం లేనందున యీ ప్రాజెక్టు పనికి 3, 4 సంవత్సరాల కంటె ఎక్కువ అవసరం వుండదు.

కేవలం 3 సంవత్సరాలలో యీ ప్రాజెక్టు విద్యుచ్ఛక్తి ప్రయోజనాలను పూర్తిగా పొంద వచ్చు. దీనికి ప్రధాన కారణ మేమిటంటే, మొత్తం ఆంధ్రా స్టేట్ ప్రాంతమంతటిలోను విద్యుచ్ఛక్తి గ్రిడ్ వున్నది. ఆపైన పారిశ్రామిక ప్రయోజనాలకై విద్యుచ్ఛక్తి వాడకం నానాటికీ హెచ్చుతున్నది.

## చక్కని ప్రతి ఫలం

పై కారణాలవల్ల యీ ప్రాజెక్టు చక్కని ప్రతి ఫలాన్నిస్తుంది. ఈ విషయంలో దానికదే సాటి.

మచ్ ఖండు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు పూర్తి అయింది. దానిలో జాలాపుట్ ఆనకట్ట, మచ్ ఖండు విద్యుదుత్పత్తి కేంద్రం వున్నాయి. ఈ ప్రాజెక్టు మొదటి అంచె అప్పుడే పని

ప్రారంభించింది. రెండవ అంచెలో అదనంగా మూడు విద్యుదుత్పత్తి యూనిట్లను యేర్పాటు చేయాలి. ఇందుకు సంబంధించిన పని చాలా భాగం పూర్తయింది. పై ప్రాజెక్టు నుంచి రెగ్యులేటెడ్ పద్ధతిలో యెగువ సీలేరుకి యించుమించు 1400 క్యూసెక్కుల యెడతెగని పవర్ డ్రాఫ్టు లభిస్తుంది. నదిపై కేవలం ఒక తక్కువ యెత్తు అడ్డకట్ట నిర్మాణంతో యెగువ సీలేరుకి యించుమించు 1800 క్యూసెక్కుల యెడతెగని పవర్ డ్రాఫ్టు లభిస్తుంది.

తక్కువ వ్యయంతో జల విద్యుచ్ఛక్తి అభివృద్ధికి మచ్‌ఖండ్-సీలేరు బేసిన్ మిక్కిలి అనుకూలంగా వుంది. మచ్‌ఖండ్ అభివృద్ధి యించుమించు 850 అడుగుల యెత్తు జలపాతాన్ని వుపయోగించుకుని 114 ఎమ్.డబ్ల్యు. ల విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేస్తుంది. మచ్‌ఖండు చివరి భాగం నీటిని వుపయోగించుకుంటూ దానికి 50 మైళ్ల దిగువన గల యెగువ సీలేరు పథకం 440 అడుగుల యెత్తు జలపాతాన్ని వినియోగించుకోవచ్చు. అలాగే మళ్లీ యెగువ సీలేరు పథకం చివరి భాగం నీటిని వుపయోగించుకునే దిగువ సీలేరు పథకం 1040 నుంచి 240 వరకూ 800 అడుగుల యెత్తు జలపాతాన్ని వుపయోగించుకోవచ్చు. దిగువ సీలేరు అదే నదిపై యించుమించు మరి 25 మైళ్ల దిగువన వుంది. ఈ విధంగా యీ బేసిన్‌లో మొత్తం 800 ఎమ్.డబ్ల్యు. లకి పైగా విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయవచ్చు.

## నిర్మాణ కార్యక్రమం

ప్రస్తుతపు యెగువ సీలేరు ప్రాజెక్టు, తొలి అంచెలో దిగువ పనుల నిర్మాణానికి వసతి వున్నది.

1. గుంటవాడకి సమీపంలో యించుమించు 35 అడుగుల ఎత్తు గల మళ్లింపు అడ్డకట్ట. దీని కిరువైపులా అంత యెత్తు లేని మట్టి కట్ట లుంటాయి.

2. అడ్డకట్టకి దిగువన ఒక ఫోర్‌బేసరస్సు. దీనికి సాడిల్ పైన తక్కువ యెత్తు మట్టి కట్ట లుంటాయి. అడ్డకట్ట నీటి వ్యాప్తి నుంచి సరస్సులోనికి వచ్చే పవర్ డ్రాఫ్టుకి రెగ్యులేటింగ్ గేటు లుంటాయి.

3. ఫోర్‌బే నుంచి బయలుదేరి విద్యుదుత్పత్తి కేంద్రాన్ని చేరే కురుచ పెన్‌స్టాక్కు.

4. విద్యుదుత్పత్తి కేంద్రం భవనం, నదికి చేరే టెయిల్ రేస్.

5. ప్రారంభంలో 2-60 ఎమ్. డబ్ల్యు. విద్యుదుత్పత్తి యూనిట్ల స్థాపన. ఇక్కడ ఆఖరికి 5 యూనిట్ల స్థాపనకి వసతి వుంటుంది. (గుంటవాడ వద్ద ఆనకట్ట-ఇది మళ్లింపు అడ్డకట్టను లీనం చేసుకుంటుంది—నిర్మాణం, అదనంగా 3-60 ఎమ్. డబ్ల్యు. విద్యుదుత్పత్తి యూనిట్ల స్థాపనల కార్యక్రమం తరువాత అభివృద్ధి దశలలో చేపట్టబడుతుంది.)

6. ఎగువ సీలేరు నుంచి రాజమండ్రికి యించుమించు 85 మైళ్ల పొడుగు 132 కెవి ప్రసార మార్గం. రాజమండ్రి ప్రస్తుతపు ఆంధ్రా స్టేట్ గ్రిడ్‌లో ఒక సబ్-స్టేషన్ అయి వున్నది. ఎగువ సీలేరు నుంచి ప్రస్తుతపు మచ్‌ఖండ్ విద్యుదుత్పత్తి కేంద్రానికి యించుమించు 50 మైళ్ల పొడుగు మాత్రం వుండే 132 కెవి ప్రసార మార్గం.

ఈ పథకం సరిగా పరిశోధించబడింది. కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్‌తో సంప్రదించిన మీదట దానికి తుది రూప మివ్వబడింది.

ఎగువ సీలేరు ప్రాజెక్టు ప్రస్తుతపు మచ్‌ఖండ్ జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు నుంచి కేవలం కొన్ని మైళ్ల అవతల అదే నదిపై వుంది. మచ్‌ఖండ్ ప్రాజెక్టు దాదాపు పూర్తి అయింది. కాబట్టి మచ్‌ఖండ్ ప్రాజెక్టుకి వుపయోగపడిన నిర్మాణ యంత్రాలను, అనుభవజ్ఞులైన సిబ్బందిని, వ్యవస్థీకృతమైన యేర్పాట్లను యిది బాగా వుపయోగించుకోవచ్చు. నిర్మాణ యంత్రాలపై విదేశ మారకం దాదాపు రూ. 80 లక్షల వరకూ తగ్గు

తుంది. ఈ విధంగా నిర్మాణం పనిని త్వరగా ప్రారంభించి, వేగంగా పూర్తి చేయవచ్చు.

సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు తొలి అంచెకి రూ. 200 లక్షల విదేశ మారకం అవసరం కాగలదు. ఇది పవర్ ప్లాంటు ఖరీదుకి పరిమితమై వున్నది. లాభాలతో పోల్చినప్పుడు యిది చాలా తక్కువ కూడా.

తక్కువ వ్యయంతో కూడిన యెగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు తొలిఅంచె మచ్ ఖండ్-సీలేరు బేసిన్‌లో యేకీకృతమైన విద్యుచ్ఛక్తి అభివృద్ధి చెయిన్‌లో ఒక ముఖ్యభాగమై వున్నది. మొత్తం 800 ఎమ్ డబ్ల్యు ల నిమించే విద్యుచ్ఛక్తినిసులభమైన అంచెలలో అభివృద్ధి చేయవచ్చు.

ఒకదేశం ఆర్థికాభ్యుదయం ఆ దేశంలో వాడకమయే విద్యుచ్ఛక్తి ప్రమాణాన్ని బట్టి నిర్ణయమవుతుంది. ఇది గుర్తించబడిన విషయం. ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రతి ఒక్కరు యించుమించు 8 యూనిట్ల విద్యుచ్ఛక్తిని మాత్రమే వినియోగిస్తున్నారు. అఖిలభారతదేశం విషయంలో యీ అంకె 20 అయి వున్నది. పొరుగు రాష్ట్రాలైన మద్రాసు, మైసూరుల విషయంలో అది వరుసగా యించుమించు 25,60 అయి వున్నది. ఈ వినియోగంతో పోల్చినప్పుడు మన రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి తలసరి వినియోగం చాలా తక్కువ. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారతదేశం లోని మిక్కిలి పెద్ద రాష్ట్రాలలో ఒకటి. దానికి తగినంత ఖనిజసంపద వున్నది. దానిగుండా మహా నదులైన కృష్ణా, గోదావరులు ప్రవహిస్తున్నాయి. దానికి చక్కని రాకపోకల సౌకర్యాలున్నవి. కాబట్టి పారిశ్రామిక, ఆర్థికాభ్యుదయాలకి కావలసిన సదుపాయాలన్నీ దానికి వున్నాయి. అది ప్రస్తుతం వెనుకబడివుండడానికి ముఖ్య కారణం విద్యుచ్ఛక్తి చౌకగా లభించక పోవడమే. ఈ విషయాన్నే ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి వాడకం అంచనా నివేదిక తెలియజేస్తున్నది. 1960-61 నాటికి ఆంధ్ర ప్రదేశ్‌లో యించుమించు 70 ఎమ్. డబ్ల్యు. ల విద్యుచ్ఛక్తి కొరత యేర్పడుతుంది. కాబట్టి యీ ప్రాంతంలో చౌకగా జల విద్యుచ్ఛక్తిని అభివృద్ధి చేసి, వాడుకోడానికి చాలా అవకాశ మున్నది.

ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుతొలి అంచె ఆంధ్రప్రదేశ్‌కి మిక్కిలి ముఖ్యమైనది. అత్యావసరమైనది కూడా.

యాత్రీకులకు, గిరిజనులకు వరప్రసాదమైన

# మున్ననూరు - నీలగంగ రోడ్డు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి 18-3-58 న ఒక కొత్తరోడ్డు నిర్మాణాన్ని ప్రారంభించారు. దీనితో తెలంగాణా ప్రాంతం నుంచి శ్రీశైలానికి వెళ్లే యాత్రీకుల చిరకాల వాంఛితం నెరవేరుతుంది.

ఆ సందర్భంలో స్వాగతోపన్యాసం చేసిన చీఫ్ ఇంజనీరు (రహదార్లు) శ్రీ ఎన్. దురానీ దిగువ విషయాలను పేర్కొన్నారు:

శ్రీశైలం దక్షిణ భారతంలో సుప్రసిద్ధమైన యాత్రా కేంద్రం. ఈ పుణ్యక్షేత్రం కర్నూలు జిల్లాలోని నల్లమల కొండలమీద కృష్ణానదీ తీరాన వున్నది. దీనికి ఇటీవలనే ఒక ఘాట్ రోడ్డు నిర్మింపబడి, రాక పోకలకు తెరువ బడినది. మహబూబునగరం జిల్లా నుంచి యిక్కడికి రావడానికి రోడ్డు లేదు. మున్ననూరు నుంచి శ్రీశైలానికి యెదురుగా వున్న కృష్ణానది ఒడ్డు వరకూ రోడ్డు నిర్మించే ప్రతిపాదన 1955 లో, కేంద్ర ప్రభుత్వపు రూ 50.00 లక్షల గ్రాంట్సు యిన్ ఎయిడ్ కార్యక్రమం క్రింద ఆమోదించ బడింది. దీనికి రాష్ట్ర ప్రభుత్వం కూడా, కేంద్ర రోడ్డు నిధి (రాష్ట్రకేటాయింపులు), కేంద్ర రోడ్డు నిధి (మామూలు రిజర్వు) నుంచి సరి సమంగా ఖర్చు పెట్టాలి. . . .

అసలు తెలంగాణాయే వెనుక బడిన ప్రాంతం. దానిలో మరీ వెనుక బడిన జిల్లాల్లో మహబూబు నగరం ఒకటి. ఈజిల్లాలోని చాల రోడ్లు కేవలం మొరం రోడ్లు. వీటిపై చాలచోట్ల వంతెనలు



*18-3-58 న రోడ్డు నిర్మాణాన్ని ప్రారంభిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి*



నిర్మాణంలో వున్న రోడ్డు

లేనందున అన్ని కాలాల్లోను వీటి మీద రాకపోకలు జరగడానికి వీలుండదు. ఈ జిల్లా సర్వతో ముఖాభివృద్ధికై ముందు ముఖ్యంగా యిక్కడ చక్కని రోడ్డు గ్రిడ్ యేర్పడాలి. ఈ ప్రణాళికా కాలంలో మొత్తం రూ 26.90 లక్షల వ్యయంపై 70 మైళ్ల పొడుగు రోడ్లను, మొసనరీపనులతో సహా నిర్మించాలని సంకల్పించ బడింది. వీటిలో మిక్కిలి ముఖ్యమైనది మన్ననూరు-నీలగంగ రోడ్డు నిర్మాణం.

మున్ననూరు నుంచి కృష్ణానది ఒడ్డు వరకూ మొత్తం యీరోడ్డు పొడుగు 39 మైళ్ల 2ఫర్లాంగులు. దీనికి రూ 17.00 లక్షలు ఖర్చు కాగలదని అంచనా. ఈ రోడ్డు దిగువ పేర్కొన్న మూడు విభాగాలుగా విభజించ బడింది.

1. మున్ననూరు నుంచి ఫరహాబాద్ వరకూ-పొడుగు 18 మైళ్లు. ఖర్చు రూ. 4.74 లక్షలు.
2. ఫరహాబాదునుంచి పాండిబోర్ వరకూ-పొడుగు 20 మైళ్ల 2ఫర్లాంగులు. ఖర్చు రూ 7.00 లక్షలు.
3. పాండిబోర్‌నుంచి కృష్ణానది ఒడ్డు వరకూ-పొడుగు 6 మైళ్లు. ఖర్చు రూ 5.26 లక్షలు.

మిగిలిన రెండు రీచ్‌ల సర్వే కూడా పూర్తయింది. అంచనాలు కేంద్రప్రభుత్వం మంజూరు క్రింద వున్నాయి.

## గిరిజనులకి సౌకర్యం

ప్రస్తుతపు మున్ననూరు - ఫరహాబాదు రోడ్డు జడ్‌చెర్ల-అమరాబాదు రోడ్డు 59 వ మైలునుంచి ప్రారంభ మవుతుంది. మన్ననూరు నుంచి ఫరహాబాద్‌కి, అక్కడి నుంచి కృష్ణానదికి ఒక ఫెయిర్ వెదర్ రోడ్డు వున్నది. ఇది బాగా మెలికలు తిరిగి వుంటుంది. కొన్నిచోట్ల బాగా నిట్రమైన గ్రేడియంట్లు, 8-10%వరకూ వున్నవి కూడా వుంటాయి. ఈ రోడ్డు దట్టమైన అరణ్యాలు, గిరిజన గ్రామాల గుండా పోతుంది. ఇప్పుడు యిక్కడ పక్కారోడ్డు నిర్మాణంతో అడవి పదార్థాల మార్కెటింగ్ కు సదుపాయ మేర్పడుతుంది. తద్వారా జాతీయ

రాబడి హెచ్చుతుంది. అంతేకాక పెక్కురు గిరిజనులకి చక్కని ఆవాసం కల్పించి, వారికి ఆధునిక సౌకర్యాలను కలిగించ వచ్చు కూడా. ఆ పైన దీనివల్ల తెలంగాణా ప్రాంతం నుంచి శ్రీశైల శ్రీ మల్లికార్జునస్వామి దర్శనానికి వెళ్లే వేలాది యాత్రికులు నేరుగా ప్రయాణం చేసే అవకాశ మేర్పడుతుంది. ఈ రోడ్డు నిర్మాణం పూర్తయిన పిమ్మట నీలగంగవద్ద కృష్ణానదిపై వంతెనను కూడా నిర్మించినట్లయితే రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల మధ్య దగ్గరత్రోవను నేరుగా రాకపోకలు జరగడానికి కూడా వీలు కలుగుతుంది.

మొదటి విభాగం అనగా మన్ననూరు-ఫరహాబాదు రోడ్డు యెక్కువ భాగం దట్టమైన అడవులలో మెత్తని భూమి, గండ్రాతి ప్రదేశాల మీదుగా పోతుంది. మొదటి రెండు మైళ్ల మేర లోను సాగయే మాగాణీ భూములు కూడా వున్నాయి. మిగిలిన భాగంలో రాళ్లు తగులు తాయి. వాటిని బ్రద్దలు కొట్టాలి. 5 వ. మైలులో ఒక ఘాట్ భాగం వుంటుంది. ఘాట్ భాగం కాక యింకా 21 ఎపెక్సు లుంటాయి. ఘాట్ భాగంలో వంపు వ్యాసార్థం కనిష్ఠ పరిమితి 100అ-0 గా వుంచబడింది. మిగిలిన భాగంలో అది 600'-0—5000'-0 మధ్య వుంటుంది. ఇక్కడ సంకల్పించిన గ్రేడియంట్లు సులభమైనవి. ఘాట్‌లో 1 800'-0 పొడుగున వుండగల వీటి గరిష్ఠం 5.4%. ఇక్కడ 24'-0 వెడల్పున రోడ్డు నిర్మించబడుతుంది. దానిమధ్యన 12'-0 మేర కంకరచేయబడుతుంది. ఘాట్ భాగంలో తగిన వంతెనలు, అవసరమైన పట్టు గోడల నిర్మాణం కూడా చేపట్టబడుతుంది. ఇక్కడ వంతెనలు కట్టవలసిన ప్రవాహాలు 17 వున్నాయి. వాటిలో రెండు పెద్దవి. ఈ వంతెనల ఖర్చును కూడా యీ మంజూరు నుంచే భరించవలసి వున్నది.

స్థానికంగా వున్న పనివారు యీ పనికి పనికి రారు. కాబట్టి యిందు నిమిత్తం మన్ననూరు, అమరాబాదుల నుంచి, జిల్లాలోని యితర ప్రదేశాల నుంచి పని వారిని రప్పించాలి. అక్కడ మంచినీటి సౌకర్యాలు కూడా వున్నట్టు కనపడదు. 199'-0 వరకూ త్రవ్విన బావులు కూడా వేసవిలో యెండిపోతున్నవిట. కాబట్టి పని జరిగే ప్రదేశానికి సమీపంలో తగిన చోట్ల గొట్టపు బావుల్ని నిర్మించాలని సంకల్పించబడింది.

ఈ మార్గంలోని యే గ్రామంలోను కూడా సిబ్బందికి తగిన వసతి సౌకర్యంలేదు. మంచి నీటికా మహాకొరత. ఈ పరిస్థితులలో దట్టమైన అడవులలో యీ పనిని జరిపించడం నిజంగా



*చెంచు బాలలు—మన్ననూరులో రాష్ట్రముఖ్యమంత్రి మన్ననూరు—నీలగంగ రోడ్డు నిర్మాణాన్ని ప్రారంభించుటను చూస్తున్నారు.*

కష్టమే. అయినప్పటికీ కూడా ప్రోత్సాహకరమైన తమతోడ్పాటుతో కష్ట సాధ్యమైన యీ పనిని సకాలంలో పూర్తి చేయగలనని ఆశిస్తాను.

అని చీఫ్ ఇంజనీరు ముఖ్యమంత్రిని వుద్దేశించి విన్నవిస్తూ "మున్ననూరు-నీలగంగ రోడ్డు నిర్మాణాన్ని" ప్రారంభించమని ఆయనను కోరారు. ప్రారంభిస్తూ, అధిక వేగంతో దానిని కొనసాగించడానికి సంకేతాన్నిమ్మని ఆయన ముఖ్య మంత్రిని అర్థించారు. "నరమాంస భక్షణ కలవడిన క్రూర మృగాలతో నిండివుండి వేటగాడికి స్వర్గ తుల్య" మని ప్రసిద్ధి పొందిన ఆ ప్రాంతంలో మనుషులకి ప్రమాదంరాకుండా, వస్తువాహనాలకి నష్టం రాకుండా ప్రశాంతంగా పని జరగాలని ప్రార్థించమని కూడా ఆయన ముఖ్య మంత్రిని అర్థించారు.



# పంచాయతీ సమితుల అధికారాలు, రాబడి మార్గాలు

ఆడ్ హాక్ పంచాయతీ సమితుల నిర్మాణంపై యేర్పాటైన ఆఫీసర్ల స్పెషల్ కమిటీ 12-3-58 న సమావేశమయి, అన్ని ప్రభుత్వ శాఖలు, జిల్లా బోర్డుల అభివృద్ధి కార్యక్రమాల్ని, అవి ఆ యా అభివృద్ధి కేంద్రాలకి సంబంధించినంతవరకూ ఆడ్ హాక్ పంచాయతీ సమితులకి బదలీ చేయాలన్న సూత్రాన్ని అంగీకరించింది.

ఆ కమిటీ చేసిన యితర సిఫార్సులు దిగువ పేర్కొనబడినవి.

పంచాయతీ సమితులకి రసాయన యెరువుల జిల్లా కోటానుంచి ప్రత్యేకమైన కోటాలు కేటాయించబడాలని, అభివృద్ధి కేంద్రంలో సహకార సంస్థలద్వారా జరిగే రసాయన యెరువుల పంపిణీని అవి సక్రమపరచాలని, అందుకు అవసరమైన సౌకర్యాలు వాటికి కల్పించబడాలని సిఫార్సు చేయబడింది అవసరమైనచో తెల్లా అద్దె-కొనుగోలు పద్ధతి క్రింద అప్పులను వాటికి ప్రత్యేకం కేటాయించాలని, సాగునీటి సరఫరా నిమిత్తం అద్దె కివ్వడానికి ప్రత్యేకం కొన్ని ఆయిల్ ఇంజన్లను వాటి అధికారం క్రింద వుంచాలనీ కూడా సిఫార్సు చేయబడింది.

ఈ సమితులు దిగువ పనులు చేయాలని సూచించబడింది.

1. రైతులకి యెన్ని విత్తనాలు అవసరమో తెలుసుకోవాలి.
2. విత్తనాల వుత్పత్తి క్షేత్రాల ప్రారంభానికై ఆధునిక పద్ధతుల నవలంబించే రైతులను యెన్నాలి.
3. ప్రభుత్వ శాఖ సరఫరా చేసిన వుత్తమ (న్యూక్లియస్) విత్తనాలను యెక్కువగా పండించాలి.
4. విత్తనాలను సేకరించి, అభివృద్ధి కేంద్రంలోని రైతులకి పంపిణీ చేయాలి.
5. ఈ సందర్భంలో అవసరమైన బాండుపై సంతకం చేసే అధికారాన్ని బ్లాకు అభివృద్ధి అధికారికి యివ్వాలని అంగీకరించబడింది.

అప్పుల మంజూరు సందర్భంలో, దరఖాస్తుల్ని ప్రభుత్వ శాఖకి చెందిన యేజన్సీ కాక, అభివృద్ధి కేంద్రం సిబ్బంది పరిశీలించాలనీ, వాటిని అందుకు సంబంధించిన ప్రభుత్వశాఖాధికార్లు లేక అంతకంటె వీలుగా బ్లాకు అభివృద్ధి అధికారి పరిష్కరించాలనీ అంగీకరించబడింది.

## మొక్కల రక్షణ

మొక్కల రక్షణ కార్యక్రమాన్ని గ్రామ పంచాయతీలకు, సహకార సంఘాలకి అప్పగించాలని, మొక్కల రక్షణ పరికరాలు, మందుల సరఫరాకై పంచాయతీ సమితులు యేర్పాటు చేయాలనీ, ఇందుకు అవి సొమ్మును తమకి కేటాయించిన డిపార్టుమెంటల్ ఫండ్సు లేక బ్లాకు బడ్జెట్టు నుంచి తీసుకోవాలని, క్రిమి సంహారకమైన మందుల ఖరీదును వాటివల్ల లాభం పొందిన వారినుంచి రాబట్టాలని సిఫార్సు చేయబడింది.

ఈ సమితులు వ్యవసాయ కార్యక్రమాన్ని (డిపార్టుమెంటు, బ్లాకు రెండింటికి చెందినది) పూర్తిగా అమలు పరచగలిగితే, ఆ సందర్భంలో డిపార్టుమెంటల్ పథకాలకి చేసిన కేటాయింపులు వాటి అధికారం క్రింద వుంచబడాలని సిఫార్సు చేయబడింది.

## అప్పుల వసూలు

అప్పుల వసూలు బాధ్యతను యీ సమితుల కప్పగించే విషయం చర్చించబడింది. ప్రస్తుతానికి ఎప్పటిలా రెవిన్యూ శాఖే యీ అప్పుల్ని వసూలు చేయాలని నిశ్చయించబడింది.

## పశు పోషణ

పంచాయతీ సమితులకి దిగువ పనులు అప్ప గించాలని సిఫార్సు చేయబడింది.

1. ఆయా ప్రాంతాలకు కేటాయించబడిన ఆబోతు పోషణ, గుడ్లు పొదిగే కేంద్రాలు, పశు వుల ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్నరకం వెటర్నరీ డిస్పెన్సరీలు, కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు మున్నగు వాటి యేర్పాటు.

2. కొత్త వెటర్నరీ సెంటర్లు, గుడ్లు పొదిగే కేంద్రాలు, కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు మున్నగువాటి ప్రారంభం.

3. ఆయా ప్రాంతాలలో పశు వైద్యం, పశుగణాల అభివృద్ధికై విరాళాల సేకరణ.

4. అభివృద్ధి కేంద్రాలలోని గుడ్లు పొదిగే కేంద్రాలనుంచి పంపిణీకై పిట్టల, గుడ్ల ధర నిర్ణయం.

5. పశుపోషణ నిమిత్తం విరాళ మివ్వబడిన భవనాలను, వాటి నిర్వహణ బాధ్యతను స్వాధీనం చేసుకోవడం.

## సహకారం

దిగువ రెండు పనుల్ని పంచాయతీ సమితులకి బదిలీ చేయాలని సిఫార్సు చేయబడింది.

1. అభివృద్ధి కేంద్రాలలో సహకార సంస్థల యేర్పాటు విషయమై సిఫార్సు చేయడం. సహకార సంఘాలను రిజిష్టరు చేసే అధికారాన్ని యీ సమితులకి అప్పగించాలనే ప్రతిపాదనకి, దానిని సంస్థలకి బదిలీ చేయడానికి వీలు లేదనే కారణంపై అభ్యంతరం చెప్పబడింది.

2. సహకార సంఘాలకి ప్రభుత్వం నుంచి అప్పులు, గ్రాంట్ల రూపంలో లభించే సహాయం విషయాన్ని పరిశీలించి, సిఫార్సు చేయడం.

## సాంఘిక సంక్షేమం

దిగువ పనుల్ని పంచాయతీ సమితులకి అప్ప గించి, అందు కవసరమైన సొమ్మును వాటి అధి కారం క్రింద వుంచాలని సిఫార్సు చేయబడింది.

1. సాంఘికసంక్షేమ పాఠశాలలు.
2. సాంఘికసంక్షేమ వసతి గృహాలు.
3. షెడ్యూల్డు కులాల గృహవసతి పథకాలు.
4. షెడ్యూల్డు కులాలకై బావులు త్రవ్వడం.
5. మాజీనేరస్థ జాతుల వసతి గృహాలు, పాఠ శాలలు.
6. మాజీనేరస్థ జాతుల గృహ వసతి, పథకాలు
7. మాజీ నేరస్థ జాతులకై బావులు త్రవ్వడం.

## విద్య

దిగువ మూడు పనులు, అవి అభివృద్ధి కేంద్రా లలో జిల్లా బోర్డులు, ప్రభుత్వం నిర్వహించే సంస్థ లకి సంబంధించి నంతవరకూ యీ సమితులకి అప్ప గించాలని సిఫార్సు చేయబడింది:

1. ప్రాథమిక పాఠశాలల నిర్వహణను యీ సమితులకి బదిలీచేసి, వాటిని ఆ పాఠశాలల నిర్వాహ కులుగా గుర్తించాలి.

2. ప్రాథమిక పాఠశాలలకి సంబంధించిన అన్ని ఎస్టాబిలిష్‌మెంటు విషయాలకి, వుపాధ్యాయుల నియామకం, బదిలీలు, వారి సెలవు మంజూరులకు సంబంధించిన అధికారాలు యీ సమితులకు, సిబ్బంది రిక్రూట్‌మెంటు, డిసిప్లినరీ కంట్రోలుల విష యంలో నిర్ణీతమైన నిబంధనలకు లోబడి, యివ్వ బడాలి.

3. జిల్లా బోర్డులు లేక ప్రభుత్వం నడిపే సెకండరీ పాఠశాలల పరిపాలనాధికారాన్ని (అడ్మినిస్ట్రేటివ్ కంట్రోలు) యీ సమితులకు బదిలీ చేయాలి. సిబ్బంది బదిలీలు మున్నగు వ్యవహారాలు మాత్రం

యథా ప్రకారం జిల్లా స్థాయిలో సందర్భాన్ని బట్టి జిల్లా కలక్టరు లేక విద్యాశాఖ డైరెక్టరుచే జరుపబడతాయి.

## సంఖ్యా వివరాల సేకరణ

దిగువ అంశాలకి సంబంధించిన సంఖ్యా వివరాలను సేకరించే కార్యక్రమాన్ని యీ ఆడ్‌హాక్ పంచాయతీ సమితులకు బదిలీ చేయాలని, ఇప్పుడు యీ వివరాల్ని సేకరిస్తున్న యేజన్సీలు యికముందు వాటిని యీ సమితులకి సరఫరా చేయాలనీ సిఫార్సు చేయబడింది.

1. వైటల్ స్టాటిస్టిక్సు.
2. ధరల సంఖ్యావివరాలు-కోసిన పంటధరలు, చిల్లర వ్యవసాయ ధరలు.
3. వ్యవసాయ వేతనాలు.
4. వివిధ పంటల క్రింద వున్న ప్రదేశం.
5. ప్రధాన ఆహార, ఆహారేతర పంటలు కాని పంటల వుత్పత్తికి సంబంధించిన సంఖ్యా వివరాలు-ప్రతి పంటకీ సంబంధించిన మామూలు వుత్పత్తి మున్నగు వివరాలు.
6. సాగునీటి సరఫరాకి సంబంధించిన సంఖ్యా వివరాలు.
7. వ్యవసాయం పనుల్లో ప్రతినెలా జరిగే అభివృద్ధి.

ఇవి కాక యింకా అదనం పనులను యీ సమితులకు క్రమేణా బదిలీ చేయడానికి అభివృద్ధి శాఖలు ప్రయత్నించాలని సిఫార్సు చేయ బడింది.

## రాబడి మార్గాలు

ఈ విషయంలో దిగువ సిఫార్సులు చేయబడినవి:-

1. ప్రభుత్వం, అఖిల భారత సంస్థలు చేసే సహాయం యీ సమితుల ద్వారా జరగాలి. అటు వంటి సహాయానికై ప్రభుత్వం లేక యితర సంస్థలకు చేసే విజ్ఞప్తులు యీ సమితుల ద్వారా చేయ బడాలి.

2. ఆ యా జిల్లా అధికార్లు బ్లాకులో మంజూరైన లేక యీ సమితులచే అమలు పరచబడిన ఆ శాఖ పథకాల సొమ్మును వాటికి బదిలీ చేయాలి.

3. వెనుక బడిన ప్రాంతాలకి ప్రభుత్వం అప్పుడప్పుడు యిచ్చే గ్రాంట్లు యీ సమితులకు యివ్వ బడాలి.

4. ఈ సమితి ప్రాంతంలోని భూమిశిస్తులో 6 1/4% సమితికి, అంతేమొత్తం గ్రామ పంచాయతీకి యివ్వబడాలి.

5. దిగువ పేర్కొన్న రకాల రాబడి పంచాయతీ సమితులకు వెళ్లాలి.

అ. ఇప్పుడు జిల్లా బోర్డులకు యివ్వబడే, బ్లాకు ప్రాంతంలోని భూమి శిస్తుపై సెస్సు.
ఆ. వృత్తులు మున్నగు వాటిపై విధించ బడే పన్ను.
ఇ. బ్లాకు ప్రాతం నుంచి యిప్పుడు జిల్లాబోర్డులకు వచ్చే రాబడులు.
ఈ. ప్రజలు స్వచ్ఛందంగా యిచ్చే విరాళాలు.



రాష్ట్ర పశు ప్రదర్శనంలో పుత్తమమైన పశువుల్ని ప్రదర్శించిన వారికి రాష్ట్ర వ్యవసాయ శాఖమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి 9-3-58 న బహుమతులు పంచి పెడుతున్న దృశ్యం

# క్రమబద్ధమైన వస్తు విక్రయ సౌకర్యాలు, విస్తరణ

రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయ శాఖ సంక్షేమకృషి

సరైన మార్కెటింగు సౌకర్యాలు లేనిదే ప్రభుత్వ వ్యవసాయశాఖ అమలు జరిపే వివిధ అభివృద్ధి పథకాల పూర్తి ప్రయోజనాలు రైతులకు లభించవనేది గుర్తించబడిన విషయం. వాణిజ్యపంటల మార్కెట్ల చట్టం క్రింద రెగ్యులేటెడ్ మార్కెట్ల స్థాపన ద్వారా యీ విషయంలో యిదివరకే చర్య తీసుకొనబడింది. ఆంధ్రప్రాంతంలో ఒక్క నెల్లూరు జిల్లా తప్ప మిగిలిన అన్ని జిల్లాల్లోను జిల్లా మార్కెటు కమిటీలు యేర్పాటు చేయబడినవి. నెల్లూరు జిల్లాలో ముఖ్యమైన వాణిజ్య పంటయేదీ లేనందున అక్కడ యీ కమిటీ యేర్పాటుకాలేదు. ఆయా జిల్లా కమిటీలు బాధ్యత వహించే ప్రధాన పంట వస్తువుల వివరాలు యివి:

| సంఖ్య | జిల్లా పేరు | (ప్రారంభించిన మార్కెటు కేంద్రాల సంఖ్య) | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | వేరుసెనగ, | జనపనార | .. .. |
| 2. | విశాఖపట్నం | వేరుసెనగ, | బెల్లం | .. .. |
| 3. | తూర్పు గోదావరి | పొగాకు, | కొబ్బరి | .. .. |
| 4. | పశ్చిమ గోదావరి | పొగాకు | | |
| 5. | కృష్ణా | పొగాకు, | వేరుసెనగ | 8 |
| 6. | గుంటూరు | పొగాకు, | వేరుసెనగ | 7 |
| 7. | అనంతపురం | ప్రత్తి. | వేరుసెనగ | 3 |
| 8. | కర్నూలు | ప్రత్తి, | వేరుసెనగ | 3 |
| 9. | కడప | వేరుసెనగ, పసుపు, వుల్లిపాయలు, మిర్చి | | .. .. |
| 10. | చిత్తూరు | వేరుసెనగ, | బెల్లం | .. .. |
| | | | మొత్తం | 21 |

ఆంధ్రప్రదేశ్ యిప్పటికే ఆహారంలో మిగులు రాష్ట్రం. ఆ పైన యిక్కడ యింకా అనేకమైన వ్యవసాయ వస్తువుల వుత్పత్తికి చక్కని అవకాశ మున్నది. ద్వితీయపంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ వస్తూత్పత్తిలో మరికొంత అభివృద్ధి తలపెట్టబడింది. ఉత్పత్తి హెచ్చడంతో మిగులు సరుకు ఖర్చు విషయంలో చిక్కులు రాగలవని భావించబడింది. కాబట్టి, యీ చిక్కుల నివారణకై యింకెక్కువ రెగ్యులేటెడ్ మార్కెట్ల ఏర్పాటు ద్వారా మార్కెటింగు పరిస్థితుల్ని అభివృద్ధి పరచి, నిపుణ వ్యాపారానికి తగినసౌకర్యాల్ని కల్పించాలని సంకల్పించబడింది. పై చర్యల అమలుతో ఆర్థిక వ్యవస్థ యింకా సమసౌష్ఠవంగా అభివృద్ధిచెంది, రాష్ట్ర సౌభాగ్యానికి దోహదం చేస్తుందని ఆశించబడుతున్నది.

## మార్కెటింగు వ్యవస్థ

ఆంధ్రలో ముగ్గురు అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్లున్నారు. వారిముఖ్య కార్యాలయాలు కాకినాడ, విజయవాడ, కడపలలో వున్నాయి. ఒకొక్క కేంద్రంలో ఒక్కొక్క అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసరికి ఒక మార్కెటింగు అసిస్టెంటు, యిద్దరు రికార్డరుల చొప్పున తోడ్పడుతారు. వీరు వివిధ వస్తువుల ధరలు, యెగుమతి, దిగుమతులు, వివిధ పంటల సాగుబడికయ్యే ఖర్చులకు సంబంధించిన సమాచారాన్ని, అగ్మార్కు వస్తువుల నమూనాలను సేకరిస్తారు. పంటల మార్కెటు సర్వేలను జరుపుతారు. పై సిబ్బందికాక హెడ్ క్వార్టర్సులో ఒక మార్కెటింగు అసిస్టెంటు, ఒక రికార్డరు వున్నారు. పై ముగ్గురు ప్రాంతీయ అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్లు పంపే సంఖ్యా వివరాల కూర్పులో హెడ్ క్వార్టర్సు డిప్యూటీ డైరెక్టరి (మార్కెటింగు) కివీరు తోడ్పడుతారు.

## II మార్కెటు కమిటీల ఆదాయ వ్యయాలు

(ఆంధ్ర ప్రాంతం)

1955, 1956 సంవత్సరాలలో మార్కెటు కమిటీల ఆయ వ్యయాల వివరాలు యివి :

| మార్కెటు కమిటీ పేరు | ఆదాయం | | వ్యయం | |
|---|---|---|---|---|
| | 1955 | 1956 | 1955 | 1956 |
| (1) | (2) | (3) | (4) | (5) |
| | రూ. | రూ. అ. పై. | రూ. | రూ. అ. పై. |
| రాజమండ్రీ మార్కెటు కమిటీ | 79,103 | 74,646-4-1 | 39,852 | 44,930-4-3 |
| విజయవాడ మార్కెటు కమిటీ | 1,07,798 | 93,500-0-0 | 1,00,311 | 99,500-0-0 |
| గుంటూరు మార్కెటు కమిటీ | 2,50,348 | 2,70,458-12-0 | 1,08,827 | 2,20,371-11-6 |
| గుంతకల్లు మార్కెటు కమిటీ | 1,02,662 | 77,646-4-1 | 64,085 | 44,930-4-3 |
| ఆదోని మార్కెటు కమిటీ | 1,10,629 | 2,35,162-9-5 | 1,69,588 | 1,86,865-5-10 |
| ఆముదాలవలస మార్కెటు కమిటీ | —— | 35,066-3-6 | —— | 14,909-6-0 |
| అనకాపల్లి మార్కెటు కమిటీ | —— | 31,227-14-9 | —— | 8,980-9-6 |
| కొవ్వూరు మార్కెటు కమిటీ | —— | 9,424-1-3 | —— | 10,112-15-3 |
| కడప మార్కెటు కమిటీ | —— | 39,676-7-0 | —— | 32,164-13-9 |
| చిత్తూరు మార్కెటు కమిటీ | —— | 39,700-95 న.పై | —— | 11,930-84 న. పై |

తెలంగాణాలో, మార్కెటింగు వ్యవస్థకి పూర్వం హైదరాబాదు రాష్ట్ర ప్రధాన మార్కెటింగు ఆఫీసరు అధిపతిగా వుండేవారు. ఇప్పుడు అది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వ్యవసాయ శాఖ డైరెక్టరు అధ్వర్యం క్రింద హెడ్‌క్వార్టర్సు డిప్యూటీ డైరెక్టరు (మార్కెటింగు) అజమాయిషీ క్రింద పనిచేస్తున్నది. 1956 సెప్టెంబరుకి పూర్వం ఖర్చు ఆధారాలను బట్టి దీనిలో మూడురకాల సర్వీసులుండేవి. ఖర్చు ఆధారాలు యివి : 1. ప్రభుత్వ సాధారణ ఆదాయాలు 2. రెగ్యులేటెడ్ మార్కెట్ల నుంచి వచ్చే 40% ఆదాయం నుంచి వచ్చేమొత్తాల సమీకరణ వల్ల యేర్పడిన సాధారణ మార్కెటింగు నిధి. 3. రెగ్యులేటెడ్ మార్కెట్ల ఆదాయంలో మిగిలిన 60%. 1956 సెప్టెంబరు 1వ. తేదీనుంచి, హైదరాబాదు రాష్ట్ర చట్టం (1956 లో 22 వది) ద్వారా కేంద్ర మార్కెటింగు సర్వీసులు ప్రకటింపబడినవి. ఈ చర్యతో, పూర్వపు కేంద్ర మార్కెటింగు నిధి సర్వీసులలోని అధికార్లు, సిబ్బందిల జీత భత్యాలు, పెన్షన్లు, గ్రాట్యుయిటీలకయే వ్యయం యేకీకృతమైన రాష్ట్ర నిధి నుంచి చేయబడుతున్నది. ప్రతి మార్కెటు కమిటీ తన ఆదాయంలో 30%ను యీ నిధికి యివ్వాలి. ఇప్పుడు మార్కెటింగు వ్యవస్థలో రెండు రకాల సర్వీసులున్నయ్.

1. ప్రభుత్వ సర్వీసులు. వీటిపై ప్రభుత్వ సాధారణ ఆదాయంలోని సొమ్ము ఖర్చుపెట్టబడుతుంది.

2. మార్కెటు కమిటీ సర్వీసులు. వీటిపై ఆయా కమిటీల ఆదాయాలలోని సొమ్ము ఖర్చు పెట్ట బడుతుంది. కాబట్టి యివి ప్రభుత్వేతర సర్వీసులుగా పరిగణింప బడతయ్.

ఆంధ్రప్రదేశ్ యేర్పడిన పిమ్మట, ప్రభుత్వ సాధారణ ఆదాయంపై ఆధారపడిన గెజిటెడ్, నాన్-గెజిటెడ్ వుద్యోగుల పేర్లు మార్చబడినవి. 2వ తరగతి గెజిటెడ్ కేడర్ కి చెందిన సీనియర్ అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసరు పేరు అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్ (సర్వే) గాను, అదే తరగతి అదే కేడర్ కి చెందిన ప్రాంతీయ మార్కెటింగు ఆఫీసర్ పేరు అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్ (తనిఖీ) గాను మార్చబడినవి. నాన్-గెజిటెడ్ కేడర్ లో, (యిద్దరు) అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్ల పేరు మార్కెటింగు అసిస్టెంటుగా, ఆంధ్రలో తోటి వుద్యోగుల పేరుతో సమానంగా మార్చబడింది. ఆడిట్ ఆఫీసర్, మార్కెట్ ఇంజనీరుల పేర్లు మాత్రం మార్చబడ లేదు.

తెలంగాణా ప్రాంతంలో యిప్పుడీవ్యవస్థ నిర్మాణ స్వరూపం సంగ్రహంగా యిది :

అ. ప్రభుత్వ బ్రాంచి :

1. ప్రభుత్వ సాధారణ ఆదాయంపై ఆధార పడిన సర్వీసులు :

i అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్ (సర్వే) వ్యవసాయ వస్తువుల యొక్క మార్కెటింగు సర్వే, మార్కెటు స్టాటిస్టిక్సు, పథక నిర్మాణం పై సాధారణ అజమాయిషీ, వ్యాపార సమితులు, నానావిధ మార్కెటింగు విషయాలకు సంబంధించిన పనిని చూస్తారు.

ii అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్ (తనిఖీ) రెగ్యులేటెడ్ మార్కెట్ల నిర్వహణ బాధ్యతను వహిస్తారు.

iii మార్కెటింగు అసిస్టెంట్లు వ్యవసాయ, జంతు పదార్థాల సర్వేపనిని చేస్తారు.

iv హెడ్ క్వార్టర్సులోవున్న యితర మినిస్టీరియల్ సిబ్బంది.

2. మార్కెటుకమిటీలు సొమ్ముయిచ్చే ప్రభుత్వ యేకీకృత నిధి పై ఆధారపడిన సర్వీసులు :

i ప్రధాన కార్యాలయంలోని ఆడిట్ ఆఫీసరు రెగ్యులేటెడ్ మార్కెట్లకి సంబంధించినఆడిట్, జమా ఖర్చుల పనిని చూస్తారు.

ii ప్రధాన కార్యాలయంలోని మార్కెట్ ఇంజనీరు రెగ్యులేటెడ్ మార్కెట్లలో చేవట్టబడే నిర్మాణం పనుల్ని చూస్తున్న ఇంజనీరింగు సెక్షన్ల అధ్వర్యాన్ని వహిస్తారు.

iii వరంగల్లు, నిజామాబాదు సర్కిళ్ళలోని యిద్దరు అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్లు ఆయా సర్కిళ్ళలోవున్న రెగ్యులేటెడ్ మార్కెట్ల నిర్వహణను అజమాయిషీ చేస్తారు.

iv మార్కెట్ సూపరింటెండెంట్లు రెగ్యులేటెడ్ మార్కెట్లకు అధ్వర్యం వహిస్తారు.

v హెడ్ క్వార్టర్సులోను,వరంగల్లు,నిజామాబాదు, సర్కిలు ఆఫీసుల్లోను నియమితులైన మినిస్టీరియల్ సిబ్బంది.

ఆ. ప్రభుత్వేతర బ్రాంచి :

1. మూడు 'ఎ' తరగతి మార్కెట్లు, 12 'బి' తరగతి మార్కెట్లు, 17 'సి' తరగతి మార్కెట్లు, 7 'డి' తరగతి మార్కెట్లు వున్నాయి. మార్కెట్ల యీ తరగతివారీ విభజనకి వాటివాటి ఆదాయం ప్రాతి పదికయై వున్నది. ఈ ఆదాయం వివరాలు దిగువ యివ్వబడినవి. మార్కెట్ సూపరింటెండెంట్ల జీత, భత్యాలకయే ఖర్చుమాత్రం ప్రభుత్వ యేకీకృత నిధినుంచి చేయబడుతుంది. మార్కెటు కమిటీలలోని మిగిలిన సిబ్బంది క్రింద అయే ఖర్చు ఆయా మార్కెటు కమిటీల ఆదాయంనుంచి చేయబడుతుంది.

'ఎ' తరగతి మార్కెట్టు ... ఆదాయం,సంవత్సరానికి రూ. 50,000 పైన

'బి' తరగతి మార్కెట్టు ... ,, సం॥ రూ. 20,000 రూ. 50,000 మధ్య

'సి' తరగతి మార్కెట్టు ... ,, సం॥ రూ. 8,000 రూ. 20,000 మధ్య

'డి' తరగతి మార్కెట్టు ... ,, సం॥రూ.8,000లోపు

2. మార్కెట్ల చట్టం అమలు : 1930 హైదరాబాదు వ్యవసాయ మార్కెట్ల చట్టం (1950 వరకూ సవరించబడింది) తెలంగాణాలోని 30 వ్యాపార కేంద్రాలలో అమలు జరుగుతున్నది. దూది, రద్దు, ప్రత్తి, 51 యితర వ్యవసాయ వస్తువుల వ్యవహారాలు యీ చట్టం పరిధి క్రిందకు వస్తాయ్. 1950లో యీ చట్టానికి చేయబడిన సవరణతో 'లైవ్‌స్టాక్' కూడా నోటిఫైడ్ వస్తువులలో చేర్చబడింది.

మార్కెట్ల చట్టం క్రింద, ప్రతి మార్కెటు కేంద్రానికి ఒక మార్కెటు కమిటీ యేర్పాటుకి వసతి వుంటుంది. ఈ కమిటీలో 12 మంది సభ్యులుంటారు. వీరిలో ఆరుగురు వ్యవసాయదార్ల ప్రతినిధులు. నలుగురు లైసెన్సు పొందిన వ్యాపారస్థుల ప్రతినిధులు. ఒకరు స్థానిక టౌన్‌కమిటీ ప్రతినిధులు. మరొకరు ప్రభుత్వంచే నియమితులవుతారు. ప్రభుత్వం సాధారణంగా స్థానిక రెవిన్యూ అధికారులలో వున్నతాధికారిని నియమిస్తుంది. వ్యవసాయదార్ల ప్రతినిధుల సందర్భీ జిల్లా కలక్టరు నియమించగా ప్రభుత్వం ఆమోదిస్తుంది. పూర్వం మార్కెటు కమిటీలన్నీ కూడా ప్రభుత్వం నియమించిన వారిని తమ తమ అధ్యక్షులుగా యెన్నుకుంటూ వుండేవి. పరిపాలనా సామర్థ్యం దృష్ట్యాను, ఆ కమిటీలలో ప్రాతినిధ్యం వహించే వివిధ గ్రూపు ప్రయోజనాల సమన్వయం దృష్ట్యాను యీ ఆచారం పాటింపబడేవి. కాని గడచిన 6,7 సంవత్సరాలలోను యీ పద్ధతి క్రమేణా తొలగించబడి, ఆ యా కమిటీలలోని అనధికార గ్రూపుల నుంచి అధ్యక్షుని యెన్నుకొనడం ప్రారంభమయింది. తత్ఫలితంగా యిప్పుడు తెలంగాణాలోని 16 మార్కెటు కమిటీలకి అనధికార్లే అధ్యక్షులుగా వున్నారు.

మార్కెటు కమిటీలు తమ తమ 'బైలాస్' ను స్వయంగా తయారు చేసుకుంటాయి. వాటిని ప్రభుత్వం ఆమోదించవలసి వుంది. మార్కెట్ల సక్రమ నిర్వహణ, అజమాయిషీలకి, బేరసారాలు, వస్తునాణ్యం, విక్రేతలకి రావలసిన బాకీలు మున్నగు విషయాలలో విక్రేతలకు, క్రేతలకు వచ్చే వివాదాల పరిష్కారానికి మార్కెటు కమిటీలు వుపసంఘాల్ని నియమించుకోవచ్చు.

రెగ్యులేటెడ్ మార్కెట్లకి ఆదాయం (1) మార్కెటు రుసుం, (2) రిజిస్ట్రేషన్, లైసెన్సు రుసుముల ద్వారా వస్తుంది. అమ్మకానికి కాని లేక గిడ్డంగులలో నిలవచేయడానికి కాని విక్రేతలు మార్కెటుకి తీసుకువచ్చే వ్యవసాయ వస్తువుల విషయంలో రూ. 100/- విలువగల వస్తువులకి పావలా చొప్పున మార్కెటు రుసుం విధించబడుతుంది.

మార్కెటింగు వ్యవస్థకు ఆధిపత్యం వహించే ప్రభుత్వ శాఖ కార్యదర్శి సాధారణ అజమాయిషీకి లోబడి మార్కెటు కమిటీలు తమ తమ అధికారాలను వినియోగించుకొంటాయి. ఆ పైన ఆ కార్యదర్శి ముందు ఆమోదం లేనిదే అవి యేమీ "బైలాస్"ను కానిలేక ఒప్పందాన్ని కాని చేసుకోకూడదు. కొత్త రుసుమును విధించకూడదు. కొత్త తూకాలు లేక స్కేళ్లను ఆమోదించకూడదు. ఏదైనా ఒప్పందం లేక లైసెన్సు షరతులకు కొత్తవాటిని చేర్చకూడదు లేక వున్న వాటిని మార్చకూడదు. కొత్తగా మార్కెటు సూపరింటెండెంటును నియమించకూడదు. లేక కొత్త స్కేళ్లను లేక జీతాన్ని నిర్ణయించకూడదు. చారిటీ నిమిత్తం యేమీ అలవెన్సులు, తగ్గింపులు లేక కంట్రిబ్యూషన్లను ఆమోదించకూడదు.

హైదరాబాదు వ్యవసాయ మార్కెట్టు చట్టం అమలుతో మార్కెటింగు, వ్యాపార పద్ధతులు అనేక విధాల అభివృద్ధి చెందినవి. ముఖ్యమైనవి. యివి:

అమ్మకం యూనిట్టు: 120 శేర్ల పల్లా అమ్మకం యూనిట్టుగా నిర్ణయించబడింది.

1. చాల్నీ: కొనుక్కునే వారికిమంచి సరుకును, అమ్ముకునే వారికి మంచి ధరను లభింపచేయడానికై ఆముదాలు, యితర ధాన్యాలు, గింజల జల్లింపుకి చేతిపరికరం 'చాల్నీ' ప్రవేశపెట్టబడింది.

2. వేలంపద్ధతి: నమూనాల ప్రాతిపదికపై అమ్మే పద్ధతి క్రమేణా తొలగించబడింది. వేలం సమయంలో చూపేనమూనాలకి, ఆతరువాత తూకం సమయంలో యిచ్చే సరుక్కి మధ్య నాణ్యంలో తేడావుండటంవల్ల క్రేత, విక్రేతల మధ్య వచ్చే వివాదాలకి యీ పద్ధతి తొలగింపు ద్వారా స్వస్తి చెప్పబడింది. విక్రేతలుసరుకును రాశిపై చూపించి, దానికి తగిన ధరను రాబట్టుకోడానికి తగిన పద్ధతి ప్రవేశపెట్టుబడింది.

3. రిఫాక్షన్ అలవెన్సులు: సరుకు కొనుక్కునేటప్పుడు స్కేలు అలవెన్సులు, యితర అలవెన్సులు యివ్వాలని, నమూనా సరుకు వుచితంగా యివ్వాలనీ చాల మార్కెట్లలో క్రేతలు తప్పక అడుగుతూవుండేవారు. ఈ పద్ధతికి క్రమేణా స్వస్తి చెప్పబడింది.

4. ఇతర సౌకర్యాలు: రైతుల షెడ్లు, పశువులకు నీటి తొట్లెలు, కార్టుపార్కింగు ప్రాంతాల చుట్టూ తీగ కంచెలు మున్నగు సౌకర్యాలు వివిధ మార్కెట్లలో యెప్పటి కప్పుడు కలిగించబడుతూవుంటాయి.

హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వంచే నియమించబడిన వున్నతస్థాయి అడ్-హాక్ కమిటీ అప్పటి హైదరాబాదు రాష్ట్రంలోను, ప్రక్కరాష్ట్రాలలోను గల మార్కెట్లలో విస్తృత పర్యటనను సలిపి, అక్కడి పరిస్థితుల్ని పరిశీలించిన మీదట వివిధ సిఫార్సుల్ని చేసి, మార్కెట్ల చట్టంలో సవరణల్ని సూచించడం జరిగింది. గ్రామపునర్నిర్మాణ శాఖ మంత్రి ఆ కమిటీ అధ్యక్షుడుగా నియమింపబడ్డారు. ప్రస్తుతపు మార్కెటింగు పరిస్థితుల్ని యింకా అభివృద్ధి పరచుటకు వుద్దేశించబడిన ఆ సిఫార్సులు ప్రభుత్వ పరిశీలనలో వున్నవి.

తెలంగాణా ప్రాంతంలో 1956-57 లో ఆయ వ్యయాలు

| | ఆదాయం | * వ్యయం |
|---|---|---|
| వరంగల్లు ప్రాంతం | 3 51,769 | 1,72,153 |
| నిజామాబాదు ప్రాంతం | 3,82,973 | 99,383 |
| హైదరాబాదు నగర ప్రాంతం | 3,07,019 | 78,633 |
| మొత్తం | 10 41,790 | 3,50,151 |

* ఎస్టాబ్లిష్మెంటు, అత్యావసర ఖర్చులు, నిర్మాణాలకయిన వ్యయం. (ఏకీకృతమైన నిధికియిచ్చే 30%, సెంట్రల్ పూల్ కియిచ్చే 10% యిందులో చేరి లేవు.)

## కమిటీవుద్యోగుల సమావేశం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మార్కెట్టు కమిటీ వుద్యోగులు, మార్కెటింగు ఆఫీసర్ల సమావేశం, స్టేట్ మార్కెటింగు ఆఫీసర్ కార్యాలయంలో 1957 నవంబరు 14 వ. తేదీనుంచి 16 వ. తేదీ వరకూ జరిగింది. దానిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వ్యవసాయ శాఖా మాత్యులు శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రారంభించగా ప్రభుత్వ వ్యవసాయ శాఖడైరెక్టరు అధ్యక్షత వహించారు.

ఆంధ్రప్రదేశ్ అంతటా ఒకేరకమైన శాసనాన్ని అమలుపరుచుటకై ఆంధ్ర, హైదరాబాదు మార్కెట్టుచట్టాల్ని తక్షణం యేకంచేయాలని యీసమావేశం నిశ్చయించింది.

1. అన్ని వ్యవసాయ పంటలకి, యీ రాష్ట్రంలోని 'లైవ్ స్టాక్'కి కొన్ని అటవీ వస్తువులకి యీచట్టం నిబంధనలు వర్తించాలి.

2. సెస్సు, ప్రస్తుతం ఆంధ్రప్రాంతంలో అమలులో వున్న రాశి ప్రాతిపదికపై కాక 'అడ్వాలోరెం' ప్రాతిపదికపై వసూలు చేయబడాలి.

3. సెస్సు, ప్రస్తుతం తెలంగాణా ప్రాంతంలో వలె వుత్పత్తిదారుని వద్ద కాక వ్యాపారస్థుని వద్దనుంచి **వసూలు** చేయబడాలి.

4. కొనుగోలు, అమ్మకం, నిలవ, ప్రోసెసింగు, తూకం మున్నగువాటికి సంబధించి సరుకులన్నిటి తోవ్యవహరించడానికి ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతం లోవున్నట్టు రెండు లైసెన్సులు కాక ఒకేఒక లైసెన్సు వుండవచ్చు.

5. వుత్పత్తి దారులైనసభ్యులు ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలోవలె యెన్నిక కాకుండా ప్రభుత్వంచే నియమితులు కావాలి.

6. రైతులకు, సహకార సంస్థలకు విస్తృతప్రాతి నిధ్యం లభింప చేయడానికై మార్కెటు కమిటీ లుప్రస్తుతంలో వలె 12 మంది సభ్యులతో కాక 16 మంది సభ్యులతో యేర్పాటు కావాలి.

## విస్తరణ పథకాలు

అ. విత్తనాల అభివృద్ధి పథకం:

కొత్తగా సాధించిన రకాలు, స్థానిక రకాలకంటె మంచివని 'ట్రయల్', ప్రదర్శన ప్లాట్లలో రుజు వైన పిమ్మట అవి విత్తనాల క్షేత్రాలలో యెక్కువగా పండించబడతయ్. విత్తనాల క్షేత్రాలు రైతుల భూములపై వుంటాయి. ఈ రైతులు ప్రభుత్వ శాఖ సిఫార్సుల ప్రకారం విత్తనాలు జల్లిన పొలంలో అందుకు భిన్నమైన రకం మొక్కలు కనబడితే, అవి తీసివేయ బడతాయి. ఈ విత్తనాల ధాన్యం ప్రత్యే కంగా నూర్చి, బాగా యెండబెట్టి, సరైన పద్ధతిలో నిలవచేయ బడతాయి. ఈ కార్యక్రమం ప్రతి దశలోను యీ విత్తనాల ధాన్యంలో మరొక రకం ధాన్యం కలవకుండా జాగ్రత్త తీసుకో బడు తుంది. పొలంలో అవాంఛనీయమైన రకం మొక్కల్ని తొలగించి స్వచ్ఛమైన విత్తనాల వుత్పత్తికి తోడ్పడిన రైతులకి డబ్బు కూడా చెల్లించబడుతుంది. తరువాత యీ విత్తనాల్ని ప్రభుత్వ వ్యవసాయశాఖ,స్థానిక మార్కెటుధర ప్లస్ 10% ప్రీమియంచొప్పున కొని పిమ్మటవాటిని రైతు లకు లాభ నష్టాలులేని ప్రాతిపదికపై విక్రయిస్తుంది. ఇలా వుత్పత్తి అయిన స్వచ్ఛమైన విత్తనాలను రైతులు విరివిగా వాడుతున్నందున అవి బాగా ఖర్చవుతున్నవి. ఆపైన యీ విత్తనాలను పండించిన రైతులు కూడా వాటిని తోటి రైతు లకి అమ్ముతారు. ఈ విధంగా యీ వుత్తమ రకాల వాడకం బాగా వ్యాప్తి చెందుతుంది. దీనికి "సహజ వ్యాప్తి" అని పేరు.

తెలంగాణాలో వుత్తమరకాల విత్తనాలు మొదట ప్రభుత్వ భూములలో ఖచ్చితమైన అజమాయిషీ క్రింద పండించ బడతవి. వీటికి 'న్యూక్లియస్' విత్త నాలు అని పేరు. ఆయా పంటల నిపుణుల కేటా యింపు ననుసరించి, వ్యవసాయశాఖ డైరెక్టరు తుది ఆమోదాన్ని పొందిన పిమ్మట యివి జిల్లాలకి సరఫరా చేయబడతాయి. జిల్లా విస్తరణ సిబ్బంది వీటిని 'ఎ' తరగతి రైతులకి పంపిణీ చేస్తుంది. ఈ వుత్తమ విత్తనాలు మార్కెటు రేటుప్లస్ మణుగుకి అర్ధరూపాయ ప్రీమియం చొప్పున (వరి, గోధుమ లకు) సేకరించ బడతాయి.

వ్యవసాయ శాఖ విడుదల చేసే వుత్తమ రకం విత్తనాల్ని రైతులు బాగా వాడు తున్నారు. ఈ విషయంలో వరి, చెఱకు, ప్రత్తిల విషయంలో

మొత్తం భూమిలో 77% యిప్పటికే వుత్తమరకం విత్తనాల క్రింద వున్నది. ద్వితీయ ప్రణాళిక ఆఖరి నాటికి యింకా యెక్కువ భూమిని వీటి క్రిందకి తేవాలనిసంకల్పించబడింది.వర్షాధారమైనప్రదేశాలు, చౌడుభూములు, మున్నగు వాటిలో పెరిగేరకాలు ప్రస్తుతం లేవు. అట్టివాటి సాధన కవసరమైన పథకాలు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడినవి. చెఱకు క్రిందగల మొత్తం ప్రదేశంలో ఆంధ్రలో 99%, తెలంగాణాలో 5% వుత్తమరకం చెఱకు క్రింద వున్నవి. ప్రత్తి విషయంలో, వుత్తమ రకాల క్రింద వున్న ప్రదేశాలశాతం ఆంధ్ర తెలంగాణాలలో వరుసగా 68,46 అయి ఉన్నది.

మెట్టధాన్యాల విషయంలో, జొన్న, రాగి, కొర్రల క్రింద వున్న మొత్తం ప్రదేశంలో దాదాపు 40% వుత్తమరకాలక్రింద వున్నది. సజ్జవిషయంలో మాత్రం యీ శాతం కేవలం 2. మెట్టధాన్యాలు ప్రకృతి సిద్ధంగా ఆయా ప్రాంతాలలో స్థిరీకరింపబడ్డాయి. ప్రభుత్వశాఖ వీటి విషయంలో వుత్తమ రకాల్ని స్వల్పంగా మాత్రమే సాధించింది. ద్వితీయ ప్రణాళికలో రాష్ట్రంలో 7 ప్రాంతీయ మెట్టధాన్యం కేంద్రాల ప్రారంభం సంకల్పించబడింది. పప్పుదినుసులు, నూనెగింజల విషయంలో కూడా కేవలం కొన్నిరకాలు మాత్రమే సాధించబడినవి. వేరుసెనగ పంట క్రింద వున్న మొత్తం భూమిలో 13% వుత్తమ రకం పంట క్రింద వున్నది. పప్పుదినుసులు, నూనెగింజలలో వుత్తమరకాల సాధన కుద్దేశించబడిన పథకాలు ద్వితీయ ప్రణాళికలో చేర్చబడినవి. 1956-57 లో వివిధ పంటల క్రింద పంపిణీచేయబడిన వుత్తమ విత్తనాల పరిమాణాల వివరాలు యివి:

| విత్తనాల పేరు | పంపిణీ చేసిన సరుకు టన్నులు | పౌనులు |
|---|---|---|
| వరి | 5,743 | — |
| మెట్టధాన్యాలు | 334 | — |
| పప్పుదినుసులు | 7 | — |
| పచ్చి యెరువు విత్తనాలు | 203 | 1,172 |
| నూనెగింజలు | 68 | 1,603 |

ఈ పథకం ముఖ్యాంశాలు యివి: (1) సంవత్సరానికి ఒక్క పంటపండే మాగాణీ భూములు ఖాళీగా వున్నప్పుడు వాటిలో ప్రత్తి పండించుట (2) వేరుసెనగ, మిర్చి, రాగి మున్నగు పంటలతో మిశ్రమ పంటగా దానిని పండించుట (3) ఉత్తమ విత్తనాల పంపిణీ. ఈ విషయంలో సాధించిన అభివృద్ధి వివరాలు యివి.

| 1956-57 పంట క్రిందవున్న భూమి | లక్ష్యాలు | సిద్ధించిన ఫలితాలు |
|---|---|---|
| యెకరాలలో | 50,747 | 64,611 |
| ఉత్పత్తి బేళ్లలో | 23,503 | 28,256 |

బొంబాయి రాష్ట్రంనుంచి 2,000 ఇంపీరియలు మణుగుల లక్ష్మి ప్రత్తి సేకరించబడి, పంపిణీ చేయబడింది.

## (ఇ) పొగాకు విస్తరణ పథకం :

ఈ పథకం గుంటూరు, పశ్చిమ గోదావరిజిల్లాల్లో 2 సంవత్సరాల పాటు అమలు జరుగుటకై మంజూరు చేయబడింది. ఈ పంటను సరైన పద్ధతిలో పండించడం మున్నగు పనుల్ని వర్జీనియా పొగాకు వుత్పత్తి దారులకు, ప్రదర్శనల ద్వారా ప్రత్యక్షంగా చూపించి, ఆ విధముగా వారికి యీ విషయంలో అనుభవ పూర్వకమైన విజ్ఞానాన్ని కలుగజేయడం యీ పథకం ఆశయం. ఈ పథకం, కృష్ణా, తూర్పు గోదావరి జిల్లాలకు కూడా విస్తరింప చేయబడుతున్నది.

## (ఈ) చెఱకు అభివృద్ధి పథకం :

రాష్ట్రంలో చెఱకు యెకరా వుత్పత్తిని కనీసం 20% హెచ్చించడం, చెఱకు తోటల పెంపకంలో రైతులకు తోడ్పడ్డం, పంచదార ఫ్యాక్టరీలలోని రికవరీ శాతాన్ని హెచ్చించడం యీ పథకం ఆశయాలు. సామర్లకోటలో ఒక లైజాన్ చెఱకు పంట కేంద్రమున్నది. వుత్తమ రకాలు, లాభదాయక

మైన వ్యవసాయ పద్ధతుల ప్రదర్శనకై యిది పాలెంతీము కేంద్రంగా వుపయోగిస్తున్నది. ఈ లైజాన్ కేంద్రంలో వుత్తమ రకాల విత్తనపు సరుకు కూడా పండించబడి, చెఱకు వుత్పత్తిదార్లకు సరఫరా చేయబడుతుంది. ఈ పథకం క్రింద, రాష్ట్రంలో చెఱకు పండే ప్రధాన కేంద్రాలలో 10 మంది వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు నియమితులైనారు. వారు వుత్తమ పద్ధతిలో చెఱకు పండించుటను గురించి ప్రచారం చేస్తారు. పరిశోధన ఫలితాల్ని రైతులకి తెలియజేస్తారు. చెఱకు తోటలకు చీడపట్టినా, వ్యాధిప్రబలినా చూచి, వాటి నివారణకై మొక్కల రక్షణ సిబ్బంది సహకారంతో వారు సత్వరచర్యను గైకొంటారు. ఈ పథకం ప్రకారం జరిగిన తీవ్ర కృషి వల్ల రాష్ట్రంలో చెఱకు పంట బాగా అభివృద్ధి చెందింది.

ఈ అభివృద్ధి కార్యక్రమాన్ని ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో మరి 8 కేంద్రాలకు విస్తరింప చేయాలని సంకల్పించబడింది. దీనితో రాష్ట్రంలోని తీవ్ర కృషి కేంద్రాల సంఖ్య 18కి హెచ్చుతుంది. ఈ సిబ్బంది ప్రభుత్వ శాఖ సిఫార్సు చేసిన శాస్త్రీయ పద్ధతిలో ఆయా రైతుల కమతాలలో ప్రదర్శన, పరిశీలన ప్లాట్లను యేర్పాటు చేసి, తద్వారా ఆ పద్ధతి విశిష్టతను వారికి తెలియచేస్తుంది. సామర్లకోటలో వున్న కేంద్రం కాక మరి మూడు లైజాన్ కేంద్రాలు బొబ్బిలి (శ్రీకాకుళంజిల్లా), తణుకు (పశ్చిమగోదావరిజిల్లా), వుయ్యూరు (కృష్ణా జిల్లా) లలో యిదివరకే యేర్పాటు చేయబడినవి. అట్టి మరొక కేంద్రాన్ని త్వరలోనే హిందూపురం (అనంతపురం జిల్లా) లో యేర్పాటు చేయాలని సంకల్పం.

## రసాయన యెరువుల పంపిణీ

1956 లో రాష్ట్రంలో అమ్మోనియం సల్ఫేటు పంపిణీ కార్యక్రమం సహకార సంఘాలకి అప్పగించబడింది. ఆంధ్ర ప్రాంతంలో 361 సహకార డిపోలు పని చేస్తున్నాయి. తెలంగాణాలో 248 గిడ్డంగుల ద్వారా అది పంపిణీ చేయబడింది. 1956-57 లో అమ్మోనియం సల్ఫేటు ఆంధ్ర ప్రాంతానికి 95,000 టన్నులు, తెలంగాణా ప్రాంతానికి 7,500 టన్నులు కేటాయించ బడింది దీనిలో అప్పుడే 88,186 టన్నులు పంపిణీ చేయబడినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో 2,67,500 టన్నులను పంపిణీ చేయాలని సంకల్పం.

ఇతర రసాయన యెరువుల విషయంలో రాష్ట్రంలో 25,392 టన్నుల సూపర్ ఫాస్ఫేటు, 33,369 టన్నుల మూత్ర పదార్థాలు, 11,149 టన్నుల పాడీ ఫెర్టిలైజర్ మిశ్రమం వాడకమయినవి.

1957-58లో మొత్తం ఆంధ్రప్రదేశ్‌కి వివిధ రసాయన యెరువుల విషయంలో నిర్ణయమైన లక్ష్యాలు యివి:

1. అమ్మోనియం సల్ఫేటు 1,33,500 టన్నులు
2. సూపర్ ఫాస్ఫేటు 11,200 "
3. మూత్ర పదార్థాలు 10,000 "
4. అమ్మోనియం సల్ఫేటు నైట్రేటు 1,000 "
5. పాడీ ఫెర్టిలైజర్ మిశ్రమం 5,000 "

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆఖరి నాటికి సూపర్ ఫాస్ఫేటు వాడకాన్ని 49,600 టన్నులకు హెచ్చించుటకు, మూత్ర పదార్థాలు, అమ్మోనియం సల్ఫేట్ నైట్రేటు మున్నగు కొత్త రసాయన యెరువుల వాడకాన్ని విస్తరింప చేయుటకు యిప్పుడు తలపెట్టబడింది. ఇప్పుడు పరిమితంగా వాడక మవుతున్న యీ క్రొత్త రసాయన యెరువుల వాడకం నిరంతర ప్రదర్శన, ప్రచారాల ద్వారా వ్యాప్తిలోకి తేబడుతుంది.

దీనికి తోడు రాష్ట్రంలో ఒక పచ్చి యెరువు వాడకం పథకం కూడా పని చేస్తున్నది. పిల్లి పెసర వంటి పచ్చి యెరువు మొక్కల్ని పెంచి, పంటలకు పచ్చి యెరువు వాడకాన్ని వ్యాప్తి లోకి తేవడానికి కృషి జరుగుతున్నది. ద్వితీయ ప్రణాళిక కాలం ఆఖరునాటికి 600 టన్నుల పచ్చి యెరువు విత్తనాల్ని పంపిణీ చేయడానికి తల పెట్ట బడింది.

ఆధునిక పద్ధతుల అవలంబన

## (1) జపాను పద్ధతి వరిసాగు

మన రాష్ట్రంలో జపాను పద్ధతి వరిసాగుకి సంబంధించిన కార్యక్రమం సంతృప్తి కరంగా కొనసాగుతున్నది. ఆయా సంవత్సరాలలో యీ పద్ధతి వరిసాగు క్రిందవున్న ప్రాంతాల వివరాలు యివి :

| | ఆంధ్రప్రాంతం ఎకరాలు | తెలంగాణా ప్రాంతం ఎకరాలు | మొత్తం ఎకరాలు |
|---|---|---|---|
| 1954—55 | 49,305 | 1,65,316 | 2,14,621 |
| 1955—56 | 3,09,975 | 1,95,606 | 5,05,481 |
| 1956—57 | 5,29,151 | 1,86,249 | 7,09,400 |

1957-58 సంవత్సరానికి 9 లక్షల యెకరాల లక్ష్యం నిర్ణయించ బడింది. ఇంతవరకూ యీ విషయంలో సంతృప్తి కరమైన అభివృద్ధి సాధించబడింది.

## (2) పంటల పోటీలు

ప్రస్తుతం వరి, జొన్న, చెఱకు, వేరుసెనగ, పొగాకుల విషయంలో పంటల పోటీలు జరుపబడుతున్నాయి. గడచిన కొన్ని సంవత్సరాలలో యీ పోటీలలో పాల్గొన్న వారి సంఖ్యా వివరాలు దిగువ యివ్వబడినవి.

| పంట పేరు | లిస్టులో చేరినపోటీల సంఖ్య | | | |
|---|---|---|---|---|
| | 1953—54 | 1954—55 | 1955—56 | 1956—57 |
| వరి | 29,067 | 26,187 | 39,720 | 42,563 |
| జొన్న | 882 | 1,482 | 3,341 | 4,276 |
| చెఱకు | 157 | 388 | 3,331 | 5,796 |
| పొగాకు | | | | |
| (అ) ఉత్తమపంట | — | 125 | 249 | 351 |
| (ఆ) ఉత్తమ ఫ్లూక్యూరింగు | — | 52 | 234 | 282 |
| వేరుసెనగ | — | 913 | 260 | 6,490 |
| ప్రత్తి | 372 | 571 | 79 | 200 |

1955-56 లో యీ పంటల పోటీలలో మిక్కిలి యెక్కువ వుత్పత్తిని సాధించిన పంటల వివరాలు యివి:

| పంట | ఎకరా వుత్పత్తి | |
|---|---|---|
| వరి (ఆంధ్ర) | 10,290 | పౌనులు |
| (తెలంగాణా) అబీ | 12,937 | ,, |
| తాబీ | 10,080 | ,, |
| జొన్న | 5,963 | ,, |
| చెఱకు | 107—1,020 | ,, |
| వేరుసెనగ కాయలు | 4,800 | ,, |
| ప్రత్తి | 2,997 | ,, (కపాస్) |

## రైతులకి ఆర్థిక సహాయం

### (1) తీవ్రయెరువు వాడకం పథకం

ఈపథకం క్రింద రైతులకి యెకరానికి రూ 35-చొప్పున ఒక్కొక్కరికి గరిష్ఠం రూ 500 వరకూ రసాయన యెరువుల కొనుగోలుకై స్వల్ప కాలిక ఋణాలు యివ్వబడతాయి. వీటిపై సంవత్సరానికి రూ 4½% వడ్డీ విధించ బడుతుంది. 1956-57 సంవత్సరానికి రూ 125/-లతులు మంజూరుకాగా రూ 1,20,16,999 పంపిణీచేయబడినవి. 1957-58కి రూ 96 లతులు కేటాయించబడగా రూ 41,10,485పంపిణీ చేయబడినవి. ఈ పథకంక్రింద 1954-55, 1955-56 లలో వరుసగా రూ 70.00లతులు, రూ 97 లతులు కేటాయించబడినవి. ఈ అప్పులు ఒకేఒక వాయిదాలో వసూలు చేయబడతవి. ప్రథమ పంటకి యిచ్చిన అప్పులు ఆసంవత్సరం ఫిబ్రవరి 10వ తేదీనా, రెండవ పంటకు యిచ్చిన అప్పులు ఆసంవత్సరం జూన్ 10వ. తేదీనా వసూలు చేయబడతాయి. ఈ అప్పుల్ని ప్రభుత్వ వ్యవసాయశాఖ మంజూరు చేయగా రెవిన్యూశాఖ వసూలు చేస్తుంది.

### (2) తక్కావీ అప్పులు

విత్తనాలు, యెరువులు, వ్యవసాయ పరికరాల కొనుగోలుకి తక్కావీఅప్పులు కూడా యివ్వబడతాయి. వీటిక్రింద 1953-54లో రూ 17.00 లతులు 1954-55లో రూ 21.00 లతులు పంపిణీచేయబడగా 1956-57లో రూ 12,33,870 పంపిణీచేయబడినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో యీఅప్పుల్ని యింకాతీవ్రంగా యివ్వాలని సంకల్పించ బడింది. ఇవి, విత్తనాలు, యెరువుల సందర్భంలో ఒక్కొక్కరికి గరిష్ఠం రూ 120/- వరకూను, వ్యవసాయ పరికరాల సందర్భంలో రూ. 100/- వరకూను యివ్వబడతాయి. వాటిపై 5½% వడ్డీ విధించ బడుతుంది. ఇవికూడా ఒకేఒక వాయిదాలో రెవిన్యూశాఖ చేతనే వసూలుచేయబడతాయి.

రైతులకి అప్పు సొమ్మును సకాలంలో లభింపచేయడానికై యీ అప్పుల మంజూరీకి సులభమైన పద్ధతి రూపొందించబడింది. ఇందు నిమిత్తం రైతులు దరఖాస్తులు పంపుతూ తమకి యెంత భూమి వున్నదో సూచిస్తూ గ్రామోద్యోగులు యిద్దరూ కూడా యిచ్చిన సర్టిఫికెట్లను పంపాలి. అప్పులు పట్టాదార్లు లేక 'మార్టిగేజర్ల'కి యివ్వబడతాయి. ఇందు నిమిత్తం దరఖాస్తుదారు, మరిద్దరు వ్యక్తులు సష్టిగా హామీ యివ్వాలి. హామీ యిచ్చే మరిద్దరు వ్యక్తులలో ప్రతి ఒక్కరు రూ. 500/- వరకూ అప్పు తీర్చగల స్తోమత గలిగివుండాలి. ఆపైన వ్యవసాయ డిమానుస్ట్రేటరు దర్యాప్తు ద్వారా అప్పుదరఖాస్తు నిజాయితీని గురించి సంతృప్తి చెందవలసి వుంటుంది. ఈ తక్కావీ అప్పులు రెవిన్యూ బోర్డుచే విత్తనాలు, యెరువుల సందర్భములో జిల్లా కలక్టర్లకి, వ్యవసాయ పరికరాల సందర్భములో వ్యవసాయ శాఖ డైరెక్టరికి కేటాయించబడతాయి. అవి మళ్లీ ఆయా అధికార్లచే రాష్ట్రంలోని వివిధ జిల్లా వ్యవసాయ ఆఫీసర్లకి పంపిణీ చేయబడతాయి.

## మొక్కల రక్షణ

విస్తరణ కార్యక్రమం విషయంలో, ఆంధ్రలో అయిదుగురు ప్రాంతీయ మొక్కల రక్షణ అధికార్లు వున్నారు. వీరిలో ఒక్కొక్కరు 4-5 జిల్లాల పనిని చూస్తారు. వీరి క్రింద

ఆంధ్రలో యిద్దరు మొక్కల రక్షణ అసిస్టెంట్లు, తెలంగాణాలో ఒక మొక్కల రక్షణ అసిస్టెంటు పని చేస్తారు. వీరు కాక హెడ్ క్వార్టర్సులో ఒక మొక్కల రక్షణ అధికారి వున్నారు. వీరు ఆంధ్ర ప్రాంత మంతటి పైనా ఆధిపత్యం వహిస్తారు. వారు వ్యవసాయ శాఖ డైరెక్టరు ప్రత్యక్షాధికారం క్రింద పని చేస్తారు. జిల్లాల్లో, జిల్లా ముఖ్య పట్టణాలలో వున్న మొక్కల రక్షణ అసిస్టెంట్లు ఆ యా జిల్లా వ్యవసాయాధికార్ల పరిపాలనాధికారం క్రింద పని చేస్తారు. పంటలను పీడించే వివిధ చీడలు, వ్యాధుల నివారణలో వీరు జిల్లాల్లోని విస్తరణ సిబ్బందికి తోడ్పడుతూ పెద్ద యెత్తున వ్యాపించే చీడలు మున్నగువాటి నివారణలో ప్రత్యేక శ్రద్ధను చూపుతారు.

జాతీయ వికాస సేవాకేంద్రాలు, సమాజాభివృద్ధి కేంద్రాలలో మొక్కల రక్షణ కార్యక్రమం వ్యవసాయ విస్తరణాధికార్లకి అప్పగించ బడింది. వీరు యీ పనిని గ్రామస్థాయి కార్యకర్తలు, వ్యవసాయ శాఖకి చెందిన యితర సిబ్బందిల చే చేయిస్తారు.

## సాధన సంపత్తి

మొక్కల రక్షణ కార్యక్రమం యిప్పుడు బాగా వ్యాప్తిలోకి వచ్చింది. వరిపంటను వేధించే మిడుతల దండు, గొంగళి పురుగులు, పొలం యెలుకలు అలాగే మిర్చి పంటను వేధించే క్రిమి కీటకాల నిర్మూలన కేమి, వరి, జొన్న, చెఱకు మున్నగు పంటల్ని పీడించే వ్యాధుల నివారణ కేమి పెద్ద యెత్తున చర్య గైకొన బడుతున్నది. ఈ సందర్భంలో అవసరమైనప్పుడల్లా రెవిన్యూ శాఖ సహాయం తీసుకొన బడుతున్నది.

ప్రస్తుతం వ్యవసాయ శాఖకి 62 పవర్ స్ప్రేయర్లు, 7 పవర్ డస్టర్లు, 1,308 చేతి స్ప్రేయర్లు, 4,307 చేతి డస్టర్లు వున్నాయి. చేతిపరికరాలు 1955-56 వరకూ రైతులకు వుచితంగా సరఫరా చేయబడినవి. కాని 1955-56 నుంచి చేతిస్ప్రేయరు లేక డస్టర్ కి రోజుకి పావలా చొప్పున నామమాత్రంగా అద్దె వసూలు చేయబడుతున్నది. మందులు, పరికరాలు, నిపుణులైన సిబ్బందిని మారుమూల గ్రామాలకైనా త్వరగా చేర్చి, అవసరమైన తక్షణం మొక్కల రక్షణకి పూనుకోడానికి వీలుగా రాష్ట్రంలోని నాలుగు వేర్వేరు కేంద్రాలలో 4 సంచార వాన్‌లు వుంటాయి. రక్షణ కార్యక్రమాన్ని అమలు జరిపేటప్పుడు సిబ్బంది వివిధ అవసరాల్ని సమకూర్చుటకై యీ వాన్‌లలో ప్రత్యేక సమపాయాలుంటాయి

ఆంధ్ర ప్రాంతం మొత్తం అవసరాల నెదుర్కొడానికై అక్కడ మూడు కేంద్రాలలో మూడు వాన్ లున్నాయి. 1. కాకినాడ, 2 బాపట్ల 3. కడప నాలుగవ వాన్ తెలంగాణా ప్రాంతం అవసరాల నిమిత్తం హైదరాబాదులో వుంచబడుతుంది. ఒక్కొక్క వాన్ అనుభవశాలియైన ఒక్కొక్క మొక్కల రక్షణ అసిస్టెంటు ఆధ్వర్యంలో వుంటుంది. ఈ వాన్‌లు సంచరిస్తున్నప్పుడు రైతులు ఆయా గ్రామాలలోనే క్రిమి సంహారకమైన మందుల్ని మామూలు ధరలకి కొనుక్కోవచ్చు. ఇందువల్ల వారు వాటికై తాలూకా ముఖ్య పట్నానికి వెళ్లే శ్రమ తప్పుతుందన్న మాట.

స్ప్రేయర్లు, డస్టర్ల కొనుగోలు నిమిత్తం కూడా తక్కావీ అప్పులు యివ్వబడతాయి. పురోగాములైన రైతులు యీ సమపాయాల్ని వినియోగించుకుంటున్నారు.

## కార్య ప్రణాళిక

ప్రతి జిల్లాలోను జరుపవలసిన విస్తరణ కార్యక్రమం కార్య ప్రణాళికను ప్రతి సంవత్సరం బాగా ముందుగానే వ్యవసాయ ప్రాంతీయ డిప్యూటీ డైరెక్టర్లు తయారు చేస్తారు. ఇందు నిమిత్తం ప్రతి జిల్లాలోను కలయాపత్తు విస్తరణ సిబ్బందితోను సమావేశాలు జరపబడతాయి. ప్రతి జిల్లాలోను అమలు పరచబడే వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలు సాధించవలసిన నిర్దిష్టమైన లక్ష్యాలు నిర్ణయించబడతాయి. ఇలా తయారైన యీ కార్య ప్రణాళిక ప్రకారం

పని జరుగుతున్నదో లేదో తెలుసుకొనుటకై ప్రతి జిల్లాలోను మూడు నెలల కొకసారి సమావేశాలు జరుపబడతాయి. అప్పుడు జరిగిన అభివృద్ధి క్రమ పద్ధతిలో సమీక్షించ బడుతుంది. లోపాలు సరి దిద్దుట కవసరమైన చర్య తీసుకొన బడుతుంది. నిర్ణీతమైన లక్ష్యాలను సాధించుటకు మార్గం సూచించబడుతుంది. ఈ సమావేశాల పద్ధతి వల్ల వ్యవసాయ విస్తరణ కార్యక్రమం చాల సమర్థంగా అమలు జరుగుతున్నది.

## ఏజన్సీల అభివృద్ధి

ఆంధ్రలో ఏజన్సీ ప్రాంతాలు శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాల్లో మాత్రమే వున్నాయి. వీటిలో చాల భాగం కొండమయమై, అడవులతో నిండి వుంటుంది. ఏజన్సీ ప్రజలు చాల పేదవారు. వారి వ్యవసాయ జీవన పరిమాణాలు [illegible]మైనవి. గిరిజనుల [illegible] తగినంత మైదాన, [illegible] లలో నివసించే వారు 'పోడు' వ్యవసాయం చేస్తారు. వారు పూర్వకాలపు వ్యవసాయ పద్ధతుల్నే అవలంబిస్తారు. పంటల వుత్పత్తి తక్కువే. కాబట్టి అక్కడ వ్యవసాయాభివృద్ధికి యెంతైన అవకాశం వుంది.

గిరిజనులు వ్యవసాయాన్ని ఒక చోటి నుంచి మరొక చోటికి తిప్పకుండా చేయవలసి వున్నది. అక్కడ సాధించవలసిన ముఖ్యమైన అభివృద్ధులలో యిది ఒకటి. ఆ పైన వారు ఆధునిక వ్యవసాయ పద్ధతుల నవలంబించేట్టు చేయవలసి వున్నది. ఈ ఆశయ సిద్ధికై సమిష్టి మద్రాసు రాష్ట్రం శ్రీకాకుళం జిల్లాలోని సీతంపేట, గుమ్మ లక్ష్మీపురం యేజన్సీ ప్రాంతాలలో సాలీనా రూ. 20,000/- ఖర్చుపై ఒక అభివృద్ధి పథకాన్ని ఆరంభించింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులలో గిరిజనులకు సలహా యివ్వడానికి అవసరమైన ఫీల్డు సిబ్బందితో రెండు వ్యవసాయ డిపోలు తెరువ బడ్డాయి. ఇక్కడ మిశ్రపోయింపు ధరలకు వుత్తమ విత్తనాలు, యెరువులు మున్నగునవి కూడా అమ్మబడినవి. తొలి ప్రణాళిక కాలంలో, ప్రభుత్వ వ్యవసాయశాఖ సాధించిన వుత్తమ రకాల పంట క్రిందికి 5,000 యెకరాలు తేబడినవి.

ఏజన్సీ ప్రాంతాలలో భూమిస్వభావం, శీతోష్ణ స్థితి, వర్షపాతం, మొక్కల పెరుగుదల కవసరమైన యితర అంశాల విషయంలో ఒక చోటికి మరొక చోటికి బాగా వ్యత్యాస ముంటుంది. కాబట్టి అక్కడ కాయధాన్యాలు, పప్పుదినుసులు, నూనె గింజలు మున్నగు చాల రకాల పంటల్ని పండించ వచ్చు. ఫలోత్పత్తి అభివృద్ధికి కూడా అక్కడ గొప్ప అవకాశాలున్నవి. ఈ ఆశయ సిద్ధికై ప్రదర్శన సదుపాయాలుగల పరిశోధన క్షేత్రం ఒకటి రంపచోడవరంలో, 1955 మార్చిలో యేర్పాటు చేయబడింది. ఈ క్షేత్రం నారింజ, మామిడి, పనస, అనాస, జామ మున్నగు ఫలాల అభివృద్ధికి కృషిచేస్తుంది. ఆ ప్రదేశంలో కొత్తరకాల [illegible] ఫలాలు, సుగంధ ద్రవ్యాలు మున్నగునవి ఫలిస్తాయేమో కూడా ప్రయత్నించి చూడబడుతుంది.

తొలి ప్రణాళిక కాలంలో శరభన్నపాలెం వ్యవసాయ సంఘం సభ్యులకు చెందిన 250 యెకరాల భూమి బాగుకై 1954-55 లో ఒక పథకం మంజూరు చేయబడింది. ఇంత వరకూ మొత్తము 144 యెకరాలు బాగుచేయ బడ్డాయి. ఆ ప్రదేశం సర్వే, మిగిలిన బాగుపని జరుగుతున్నాయి.

ఈ సందర్భంలో మరొకపథకం కూడా యిప్పుడు అమలు జరుగుతున్నది. దానిక్రింద భూములు గల గిరిజనులకి ఆధునిక వ్యవసాయ పద్ధతులలో శిక్షణ యివ్వబడుతుంది. ఏజన్సీ ప్రాంతాలలో మేస్త్రీలుగా నియమితులు కావడానికి తగిన శిక్షణ గిరిజనులకు యివ్వబడుతుంది. ప్రతి సంవత్సరం పైతరగతులలో ప్రతి ఒక్క దానిలోను 30 మంది అభ్యర్థులకి శిక్షణ యిచ్చుటకు నిర్ణయమైంది. ఏజన్సీ ప్రజలకి ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని గురించి యేజన్సీ అభ్యర్థుల

చేతనే బాగాచెప్పించుటకై యీ శిక్షణ కార్యక్రమం చేపట్టబడింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో వివిధ పథకాల క్రింద మొత్తం రూ. 7.65 లక్షలు ఖర్చు చేయాలని సంకల్పం. అమలుపరచ సంకల్పించిన పథకాల వివరాలు దిగువ యివ్వబడినవి.

## (1) ప్రత్యేక జిల్లా వ్యవసాయాధికారి

ఏజన్సీ ప్రజలు బాగా వెనక బడివుండి, పూర్వ కాలపు వ్యవసాయ పద్ధతుల్ని అవలంబిస్తున్నారు. వారు మామూలుగ చేసే 'పోడు' వ్యవసాయాన్ని మాన్పించుటకు తీవ్ర ప్రచారం అవసరం. నిరంతర ప్రచారం, ప్రదర్శనలద్వారా వారిని ప్రబోధించాలి. ప్రస్తుతం ఏజన్సీ ప్రాంతాలలో 13 మంది వ్యవసాయ డిమాన్స్ట్రేటర్లు పనిచేస్తున్నారు. నాలుగు యేజన్సీ జిల్లాల సరహద్దు ప్రాంతాలలో మరి 8 మందిని, ద్వితీయప్రణాళిక 3వ సంవత్సరంలో, నియమించాలని సంకల్పించబడింది. ఏజన్సీ ప్రాంతాలలోని వ్యవసాయ డిమాన్స్ట్రేటర్ల పనిని ప్రస్తుతం ఆయా జిల్లాల వ్యవసాయాధికార్లు అజమాయిషీ చేస్తున్నారు. వారికి మైదానాలలోని పని భారం అధికంగా వున్నందున, ఏజన్సీ ప్రాంతాలలో పర్యటించి, అక్కడి పనిని సరిగా అజమాయిషీ చేయడం కుదరడం లేదు. కాబట్టి యిందు నిమిత్తం ఒక ప్రత్యేక జిల్లా వ్యవసాయాధికారి, తగిన సిబ్బందితో, నియమితులైనారు. ఆయన ముఖ్య కార్యాలయం కాకినాడలో యేర్పాటుచేయబడింది.

## (2) గిరిజనుల శిక్షణ

స్థానికంగా వుత్పత్తి అయిన విత్తనాలు, మొక్కలు మున్నగువాటిని గిరిజనులలో ఎక్కువ మందికి పంపిణీ చేయడానికై ముఖ్యమైన ప్రదేశాలలో పైలట్ ఫారమ్‌ల ఆరంభం ఏజన్సీ అభివృద్ధి దశ వర్ష ప్రణాళికలో సూచించబడింది. ప్రదర్శనకి, ఆ ప్రదేశానికి తగిన విత్తనాల వుత్పత్తికి యీ ఫారమ్‌లు వుద్దేశించబడినవి. వివిధ పరిశోధనా కేంద్రాలలో సాధించబడిన వేర్వేరు రకాలు, స్ట్రెయినులు ఫలిస్తాయేమో కూడా యిక్కడ ప్రయత్నించి చూడబడుతుంది. గిరిజనుల సరఫరాకై కూరగాయల విత్తనాలు, పళ్ళ మొక్కల అంట్లు కూడా యిక్కడతయారు చేయబడతవి. ద్వితీయ ప్రణాళిక కాలంలో యీ పైలట్ ఫారమ్‌లను దిగువ ప్రదేశాలలో యేర్పాటు చేయాలని సంకల్పం.

1. బుట్టాయగూడెం ... ప. గోదావరి జిల్లా
2. తాజంగి ... విశాఖపట్నం జిల్లా
3. శీతంపేట ... శ్రీకాకుళం జిల్లా

ప్రతి క్షేత్రానికి ప్రభుత్వ పోరంబోకు భూమి నుంచి 20 యెకరాలు తీసుకొనబడి, సాగులాయకైన భూమిగా మార్చబడుతుంది.

## (3) ప్రదర్శన యూనిట్లు

ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని గురించి గిరిజనులకి తెలియపరచుటకు తీవ్ర ప్రచారం, వ్యవసాయశాఖ వివిధ కార్యక్రమాల ప్రత్యక్ష ప్రదర్శన అవసరం. ఇందుకు యింకెక్కువ ప్రదర్శన యూనిట్లు అవసరం. కాబట్టి ద్వితీయ ప్రణాళిక మూడవ సంవత్సరంలో మరి 8 మంది వ్యవసాయ డిమాన్స్ట్రేటర్లను, తగిన సిబ్బందితో, నియమించాలని సంకల్పించబడింది.

ఇవిగాక, అరకులో ఒక వ్యవసాయ పరిశోధన కేంద్రం పని చేస్తున్నది. ప్రభుత్వ రెవిన్యూ శాఖ అధ్వర్యంలో వున్న యీ కేంద్రం, సాంకేతిక విషయాలలో ప్రభుత్వ వ్యవసాయ శాఖ అధికారానికి లోబడి పని చేస్తుంది. ఇది స్థానిక గిరిజనులు ఆధునిక వ్యవసాయ పద్ధతుల నవలంబించడానికి తోడ్పడుతుంది. ఏజన్సీ ప్రాంతాలకి మిక్కిలి అనువైన పళ్ళ రకాల్ని తెలుసుకొనడం, వుత్తమ విత్తనాల వుత్పత్తి మున్నగునవి యీ కేంద్రం చేసే ముఖ్యమైన పనులు. ఇక్కడ గణించిన అనుభవంతో అరకులోయ ఫారానికి ప్రక్క గ్రామాలలో వ్యవసాయ విస్తరణ కార్యక్రమం చేపట్ట బడుతుంది 1–4–56 న అరకు లోయలో ఒక జాతీయ వికాస సేవాకేంద్రం ప్రారంభించబడింది. అరకు, హుకుంపేటలలో బహుళార్థ సాధక ప్రాజెక్టులు పని ప్రారంభించాయి.

# ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమల అభివృద్ధి

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధికై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఒక సమగ్రమైన కార్యక్రమం చేపట్టబడింది. ఈ కార్యక్రమం ముఖ్యాంశాలను ప్రతిబింబించే చర్చా గోష్ఠి ఒకటి యిటీవల ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసారమైంది. ఈ గోష్ఠిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిశ్రమల శాఖ జాయంటు డైరెక్టరు డా. ఆర్. వి. రావు, హైదరాబాదు ఖాదీ సమితి కార్యదర్శి శ్రీ వి. కె. నాయక్, "హిందూ" పత్రిక విలేఖరి శ్రీ వామనరావుగారలు పాల్గొన్నారు. వారి చర్చల పాఠంయిది :

శ్రీ నాయక్ : ఇప్పుడు మనం పరిశ్రమల కత్యంత ప్రాధాన్యతనిస్తున్న ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక ద్వితీయ సంవత్సరంలో వున్నాం. ఆంధ్రప్రదేశ్ లో పారిశ్రామికాభివృద్ధికి గల అవకాశాలను గురించి మీరు, పరిశ్రమల శాఖజాయంటు డైరెక్టరుగా తీవ్రంగా యోచించి వుంటారు. ఆవిషయాలను నాకు తెలియ జేస్తారా?

డా. ఆర్. వి. రావు: మీరు అతి ముఖ్యమైన యీ ప్రశ్న అడిగినందుకు నాకు సంతోషంగా వుందండి నాయక్ గారూ. వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ లో పారిశ్రామికాభివృద్ధికి అంతర్భూతమైనశక్తి చాలావున్నది. ఆంధ్రప్రదేశ్ లో బొగ్గు,ముడియినుం, మాంగనీసు, సున్నపురాయి, కొన్ని రకాల బంకమట్టి, ఆస్బెస్టాస్, అభ్రకం, జిప్సం, రాగి, నాణ్యమైన యిసుక, శిలాస్ఫటికాల వంటి ఖనిజాలు పుష్కలంగా వున్నవి. ఇవి యిప్పుడు పెక్కు భారీ పరిశ్రమలకు ముడి పదార్థాలుగా వుపయోగిస్తున్నవి. ఈ భారీ పరిశ్రమలలో ఇనుం (పిగ్ ఐరన్), ప్లాస్టిక్కు, పింగాణీ సరుకులు, సిమెంటు తయారీ, తదితర పరిశ్రమలు చేరి వున్నవి. మనకి వ్యవసాయ, అటవీ సంపదల అభివృద్ధికి కూడా చాలా అవకాశాలున్నవి. వీటికితోడు, అదృష్ట వశాత్తూ థెర్మల్ విద్యుచ్ఛక్తిని, జల విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేసుకునే అవకాశాలు కూడా వున్నవి. ఇప్పటికే ఆంధ్ర ప్రాంతంలో 1,44,100 కి. వా., తెలంగాణా ప్రాంతంలో 78,775 కి. వా. విద్యుచ్ఛక్తి వుత్పత్తి అవుతున్నది. వివిధ నదీలోయ ప్రాజెక్టుల వల్ల విద్యుచ్ఛక్తి వుత్పత్తి బాగా హెచ్చుతుంది. ఈ ప్రాజెక్టులు భారీ పరిశ్రమల స్థాపనకు యింకా అవకాశం కల్పిస్తవి కూడా. మనకి సుదీర్ఘమైన తీర ప్రదేశం, ఓడరేవులు, వలలా అల్లుకొని వున్న నదులు కూడా వున్నవి. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సహాయ సంస్థ పరిశ్రమలకు పెట్టుబడి సంస్థగా కూడా పని చేస్తున్నది. అన్నటికి మించి, మన రాష్ట్రంలో శీఘ్రంగా పరిశ్రమలను అభివృద్ధి పరచుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం కూడా మిక్కిలి శ్రద్ధ గైకొంటున్నవి.

## కాగితం

శ్రీ వామనరావు: ఆంధ్రప్రదేశ్ లో కాగితం పరిశ్రమ అభివృద్ధికి గల అవకాశాలేమిటి ? 'బెగ్గసీ' నుంచి న్యూస్-ప్రింటు తయారీని గురించి చాలా విన్నాం. ఈ విషయంలో మీరు తాజా సమాచారాన్ని యివ్వగలరా ?

డా. ఆర్. వి. రావు : ఆంధ్రప్రదేశ్ లో కాగితం పరిశ్రమ అభివృద్ధికి చాలా చక్కని

అవకాశాలున్నవి, వామనరావు గారూ మన అరణ్య ప్రాంతాలలో వెదుళ్లు పుష్కలంగా వున్నందున, రాజమండ్రిలోని ఆంధ్ర పేపర్ మిల్లుల విస్తరణకి మేమప్పుడే యేర్పాటు చేశాం. దీని ప్రకారం రోజుకు మరి 50 టన్నుల కాగితం అదనంగా వుత్పత్తి అవుతుంది. ఇందుకు రూ 242 లక్షలు వ్యయమవుతవి. సిర్పూరు పేపర్ మిల్లులు యిప్పటికే రోజుకి 50 టన్నుల కాగితాన్ని తయారు చేస్తున్నవి. ద్వితీయ పంచ వర్ష ప్రణాళికలో యీ వుత్పత్తిని రెట్టింపు చేయాలని వుద్దేశించ బడుతున్నది. అపైన, భారతదేశంలో తొలుదొల్త బోధన్‌లో 'బెగసీ' నుంచి న్యూస్-ప్రింటు తయారు చేసే ఫ్యాక్టరీ నొకదాన్ని రూ 5-6 కోట్ల వ్యయంపై నెలకొల్పాలని సంకల్పించ బడింది. అలాగే చిత్తూరు జిల్లాలోని తిరుపతిలో కాగితం అట్టలు తయారు చేయ బడతవి. ఇక్కడ యిందు కవసరమైన ముడిపదార్థాలు పుష్కలంగా వున్నవి. మరోవిశేషం. మనకు పుష్కలంగా దొరికే వెదుళ్లను, ఆంధ్రప్రాంతంలో మరొక రేయన్ ఫ్యాక్టరీ స్థాపనకు వుపయోగించు కోవచ్చు. ఇది సిర్‌సిల్కు ఫ్యాక్టరీకి తోడుగా వుంటుంది. సిర్‌సిల్కు ఫ్యాక్టరీ సెల్యులోజ్ ఆసిటేట్ పద్ధతిలో ఆసిటేట్ రేయన్‌ని తయారు చేస్తున్నది. ఇది భారత దేశానికి మార్గదర్శక మైన కృషి.

శ్రీ నాయక్: మన రాష్ట్రంలో రసాయన యెరువుల ఫ్యాక్టరీ స్థాపన నుద్దేశిస్తున్న పథకమేమైనా వుందాండీ?

డా. రావు: ఉందండీ. రసాయన యెరువుల వినియోగం, వుత్పత్తుల దృష్ట్యా, నత్రజని యెరువుల ఫ్యాక్టరీ స్థాపనకు ఆంధ్రప్రదేశ్ ఆదర్శ ప్రాయమైన ప్రదేశం. ఆ యెరువుల తయారీ కవసరమైన ముడి పదార్థాలు యిక్కడికి చాల సమీపంలో లభ్యమవుతవి.

## బొగ్గు గనులు

శ్రీ వామనరావు: ఆంధ్రప్రదేశ్‌లో వున్న గనులనుంచి బొగ్గును త్రవ్వడానికేమైనా అవకాశాలున్నాయండీ?

డా. రావు: గోదావరి నదీలోయలో సింగరేణి, బెల్లంపల్లిలు, తదితర ప్రదేశాలలో విస్తారమైన బొగ్గు గనులున్నవి. సింగరేణి బొగ్గు గనుల లిమిటెడ్ వారు బొగ్గు త్రవ్వకానికి పూనుకుని, బాగా పని చేస్తున్నారు. ప్రస్తుతం సాలీనా 20 లక్షల టన్నుల బొగ్గు త్రవ్వబడుతున్నది. దీనిని 30 లక్షల టన్నులకు హెచ్చించుటకు వారి విస్తరణ కార్యక్రమంలో వసతి వున్నది. ఇందుకు మొత్తం రూ. 9 కోట్లు వ్యయమవుతవి.

తక్కువ గ్రేడ్ బొగ్గు నాణ్యాన్ని హెచ్చించుటకై తక్కువ వుష్ణోగ్రత వద్ద పనిచేసే కార్బొనైజేషన్ ప్లాంటు నొకదానిని స్థాపించాలని కూడా సంకల్పించ బడింది. ఇలా తయారైన బొగ్గు దిమ్మలు గృహ వాడకానికే కాక చిన్న రకం ఫౌండ్రీలకు (లోహాల్ని కరిగించి, పోతపోసే కర్మాగారాలు) సైతం వుపకరిస్తవి. కార్బొనైజుడ్ బొగ్గు యినుం (పిగ్ ఐరన్) తయారీకి కూడా వుపకరిస్తుంది

శ్రీ నాయక్: పిగ్ ఐరన్ తయారీకోండీ?

డా. రావు: అందుకూ ఉన్నాయండీ. ఇంత వరకూ చేరిన సమాచారం ప్రకారం ముడి యినుం, మాంగనీసు, డోలోమైటు మున్నగునవి లభిస్తవి కనుక లోపాష్టు పద్ధతిని, నాన్ కోకింగు బొగ్గును వుపయోగించుకునే చిన్న రకం పిగ్ఐరన్ (తయారీ) యంత్రాలను నెలకొల్పవచ్చు. అయితే యీ విషయం యింకా పరిశీలించబడుతున్నది.

శ్రీ వామనరావు: ఆంధ్రప్రదేశ్‌లో మరికొన్ని సిమెంటు ఫ్యాక్టరీల స్థాపనకు అవకాశ ముందంటారా?

# ఆంధ్రప్రదేశ్ ప్రకటనరేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మి.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్:
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు దక్కన్ — 1.